# భారతి

సాహిత్య మాసపత్రిక




జూలై, 1989

వెల : 5 రూపాయలు



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# స్వాస్ మింట్స్






అమృతాంజన్ లిమిటె

వారి మరొక గొప్ప తయారి

**Amrutanjan Limited**

# భారతి

మాసపత్రిక
*
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)
*
సంపుటము : 66 జులై 1989 సంచిక : 7
విడిప్రతి వెల ఐదు రూపాయలు

---

## విషయానుక్రమణిక

### జులై 1989

# స్వ విష యం




ఆధునిక కళలకు శాస్త్రీయ విజ్ఞానమే అధిష్ఠానమని శ్రీ సోమసుందర్ అంటున్నారు. ఇటు కళాకారులలో విజ్ఞానశాస్త్ర చైతన్యమూ, అటు శాస్త్రజ్ఞులలో కళాచైతన్యము పెంపొందినప్పుడే పురోగతి, ముక్తీ – అంటున్న ఈయన మాటలు కొత్తవేమీ కావు కాని – ఆ ఆలోచనావృత్తాన్ని పరిపూర్ణం చేయడానికి, పరిపుష్టం చేయడానికి– ఎప్పటికయినా ఉపకరించే సాధనాలుగా మాత్రం నిలిచే ఉంటాయి. కార్ల్‌పోప్పర్ చెబుతున్నది కూడా ఇదే కదా!

గుణ ప్రాధాన్యమున్న కవిత్వానికి 'భారతి' ఎప్పుడూ సముచిత స్థానం ఇస్తూనే ఉంది. కవిత్వం పేరిట వెలువడుతున్న అన్నిరకాల ప్రక్రియలకూ తొలి వేదిక "భారతి" మాత్రమే కావాలని మా ఆశ. తెలుగుభాషకి సేవ చేయడానికి "భారతి" కంకణం కట్టుకుని ఉందన్న విషయం పాతదే అని ఎవరికి తెలియదు?

శాసనప్రియుల కోసం శ్రీ బెల్లంకొండ రమేష్‌చంద్రబాబు రాసి పంపిన ప్రాచీన దంతపుర నగరం సచిత్ర వ్యాసాన్ని ఈ మాసం అందిస్తున్నాము. మహాభారతంలో వినిపించే దంతకురం, బౌద్ధజాతక కథలలోని దంతపురం – దంతవరపు కోటే అని వ్యాసకర్త రూఢిగా చెబుతున్నారు. ఇలాంటి వ్యాసం ఎంతోమందికి ఆసక్తికరంగా ఉండడంలో ఆశ్చర్యం లేదు.

తెలంగాణా విప్లవ పోరాటాన్ని గురించి, తెలుగు శతకాల గురించి కూడా ఈ నెల భారతిలో వేస్తున్నాము. ఈ వ్యాసాలు చరిత్ర పరిశోధకులను, సాహిత్య పరిశీలకులను బాగా కదలించగలవని అనుకుంటున్నాము.

'ఉంగరం' అనే ఐరిష్ కథ చదివితే అనురాగానికి ఎల్లలు లేవేమో అనిపిస్తుంది. మానవ భావం ఏ భాషలో అయినా, ఏ ప్రదేశంలో అయినా ఒకేలా ప్రతిస్పందిస్తుందని స్పష్టంగా తెలుస్తుంది. వాస్తవం కూడా అంతే మరి!

'కలగూరగంప' వేదికలో రకరకాల చర్చలకు తావు ఇస్తూనే ఉన్నాము. ఈ చోటు ఎంతో విలువైంది కాబట్టి అతి ముఖ్యమైన అంశాలకే "భారతి"కి రాసేవారు ప్రాధాన్యాన్ని ఇవ్వగలరని ఆశించడంలో పొరపాటు లేదనుకుంటాము.

"భారతి" అభ్యున్నతికి చదివేవారి, రాసేవారి సహాయ సహకారాలను ఎప్పుడూ కోరుకుంటున్నాము.

# "నఖక్షతాని"

## ప్రభంజనః

1. పూర్వం మే కవి మిత్రమేక మకరోత్ సత్కావ్య మీషద్ఘనం
సందేహాన్విత చిత్త విభ్రమతయా సాశ్చర్యమాసం క్షణమ్।
రంధ్రాన్వేషణ తత్పరోఽభవ మహం పశ్చాత్ ప్రమాణం వినా
పాండిత్యం పరివర్జ్య సంప్రతి దివానక్తం మ్రియేఽహం మ్రియే॥

2. పత్రస్తోమం చరసి హరితంచేత్ కిమాశ్చర్య మత్ర
పైత్య వ్యాధి ర్విశతి, సహజం తథ్యమాయాన్తి 'హిక్కాః'।
చిత్రం! తాస్తే 'ఋచ' ఇతి సదాభాషసే నిర్వికల్పం
గత్వాస్రీఘ్రం లవణ మిళితం భక్షయేః శృంగబేరమ్॥

3. పశ్యస్తీకిల కౌతుకేన తరుణీ కావ్యం 'తుషశ్రీ' కృతం
కాంతం ప్రాహ సవిస్మయం "మృగయసే కిం తత్ర తావచ్చిరమ్?"।
కేళీగర్భిత నర్మహాస రుచిరం ధీమాన్ ది దేశోత్తరమ్
"అన్విష్యామి తృణోచ్ఛయే నిపతితాం సూక్ష్మాం ప్రియే! సూచికామ్"!

4. బృందం బద్ధ్వాత్ర కాకాః శ్రవణ కటు రవం కుర్వతే నిర్విరామం
క్రౌంచాశ్చాన్యత్ర కహ్వాః పథిక సముదయం నిర్దయం కర్ణయన్తే।
పంకేఽస్మిన్ షితబేకాః పటు పరుషరవైః ఛిందతే కర్ణభేరీం
ఏకాకీ కోకిలోఽయం ప్రకటయతి కిమారుహ్య మాకంద శాఖామ్?॥

5. ఆహృత్యామల రత్నహార నిచయం ప్రాక్పశ్చిమ శ్రీమతాం
విస్రబ్ధం నను ఛాదయామి నిరతం శ్రీ పెటికాయాం మమ।
నిక్షేపం తమిమం న కోఽప్యపరతో జానాతి చౌర్యార్జితం
కశ్చిద్వా కథయిష్యతే యది కథాంతాం వహ్నితుల్యోఽస్మ్యహమ్।

శ్రీ సోమసుందర్

# ఆధునిక కళలకు శాస్త్రీయ విజ్ఞానమే అధిష్ఠానం

వైజ్ఞానిక శాస్త్రం సత్యసంశోధన కోసమే నియమితమవుతుంది. సౌందర్యాన్వేషణ కళల జీవనధర్మంగానూ పరిమితమవుతుంది. ఇదే మన సాధారణ అవగాహన. కాని ఈ విభాజ్యరేఖ వాస్తవమైనదేనా? లేక మన సానుకూలత కోసం వింగడించుకొని- ఏర్పరచుకొన్న కొండగుర్తా? పోనీ అపరిపక్వ ఆలోచనాపరులు రూపొందించిన సిద్ధాంతమందామా?

అటు వైజ్ఞానిక శాస్త్రంగాని, ఇటు కళా ప్రక్రియలు గాని, ఆధునిక చేతనలో వేరు వేరు గదులలో మసగలుగుతున్నట్లు కనిపించదు. వాటి విజృంభణా పథాలు వేరు వేరు కావచ్చు. కాని ప్రాదుర్భావ కేంద్రాలు మాత్రం మానవ మనఃపరికరమే! అటు సైన్సు కాని, ఇటు సృజనాత్మక కళలుగాని, ఒకే కాసుకు వెలపల దాపల ముఖాలే! అన్యంకాదు. మన అనుభవం ఆ మేరకే ధ్రువపరుస్తున్నది.

ఈ రెంటి నడుమా ఏ బలమైన విభాజ్యరేఖా కనిపించదు. ఈ రెండూ పరస్పర పోషకాలే తప్ప విద్వేషకాలు కావు. మానవ నాగరికతా పరిణామంలో, సాంస్కృతీ పురోభివృద్ధిలో— ఈ రెండూ పరస్పర ఆశ్రయాలే! పరస్పర ఆధారాధేయాలే! విరుద్ధ ధాతువులూ, శత్రుకూటాలూ మాత్రం కావు.

దురదృష్టవశాత్తూ, ఇంతవరకూ కళలకూ వైజ్ఞానిక శాస్త్రాలకీ నడుమ వున్నది సంబంధమా, వైరుధ్యమా అనే అంశం పెద్ద సమస్యగా తలలకెక్కడం జరిగింది. అనవసర ప్రయాసతో ఒక అనంతచర్చ సాగిపోయింది. శతాబ్దాలుగానూ సాగిపోయింది.

ఈ సమస్య గురించి ప్రపంచ పరిధిలో ఆలోచిస్తే కొంత సులభంగా గ్రాహ్యమవుతుంది. ఎందరో మహత్తర ఆలోచనాశీలురంతా కళా వైజ్ఞానిక శాస్త్రాల సమైక్యంపైనే వారి మనోధర్మాన్ని పెంపొందించుకున్నారు. సత్యాన్వేషణలో మనసులు ఏకోన్ముఖమై సాగాయి. అంటే సౌందర్య ప్రద నమూ, సత్యాన్వేషణమూ అవినాభావ సంబంధం గల అంత పదార్థాలే తప్ప - పరస్పర వైరస్యం కలవి కావు. ఇది సమ దర్శనా స్వరూపమే! గూడు కట్టుకొని వేరుపడింది కాదు.

ఖగోళశాస్త్ర పరిశోధకులు, గోళాల సంగీతమనీ, అం నాట్యమనీ అనలేకపోవచ్చు. విశ్వాంతర గ్రహాలు తమ పరిధులలో నిశ్చల పరిభ్రమణం చేస్తున్నాయని పొడిగా చె వచ్చు. ఆ పరిభ్రమణంవల్లనే పరిపూర్ణ సంచలనం కలుగుతోం పూర్వంనుంచీ భావించబడుతూ వచ్చింది. దాన్ని అనుసరి జ్యోతిష శాస్త్రం ఆవిర్భవించింది. గణితానికి లో పెంపొందింది.

సరిగ్గా ఇటువంటి గణితశాస్త్ర నియమమే - సంగీత సౌ ర్యాన్ని సంరక్షించే లయజ్ఞానంగా రూపొందింది. దృశ్య సౌ ర్యానికి రేఖాగణితం ప్రాణభూతమైనట్లే - కవితా సౌందర్యా చంధశ్శాస్త్ర నియమితి శరీరంగా నిర్ణయించబడింది. వాస్తు శి నికి భూ భౌతికశాస్త్రంతో అవినాభావ సంబంధం వున్నట్లే- నా కళకి శరీరశాస్త్రంతో గాఢ సంబంధమూ వుంటుంది.

ఉరుదూ కవిత్వంలోని గజల్‌ని పరిశీలిస్తే ఒక విరా సౌందర్య మవగత మవుతుంది. దీని రెండు పాదాలూ గణితశా పరిధికి పరిపూర్ణంగా లోబడి వుంటాయి. సమాన వేగాని ఉచ్చారణలో సమాన కాలాన్నీ సంతరించుకుంటాయి. మాత్రా సమతుల్యతను భజిస్తాయి. బాహ్యవికాస స్వరూపం ఆవిష్కృతమైన కవితాకళ - ఆంతరంగిక పటిష్ఠతను చేకూ కుందుకు గణితశాస్త్రం సహకరించిందన్న మాట!

కాలాన్ని శబ్దంతో కొలవడంలోనే లయ ఏర్పడుతుంది. లయ ప్రధానంగా గణితశాస్త్ర సంబంధే! కాని మనం కళాశాస్త్ర సంబంధిగానే భ్రమిస్తూంటాం. వాస్తుశిల్ప శాస్త్రంలో పరిగణనయమయ్యే సిమెట్రీ, బ్యాలెన్సువంటివి కవిత్వానికీ, సంగీతానికీ హార్మోనీగా పరివర్తనమయ్యాయి. నాట్య దర్శకత్వంలో (కొరియోగ్రఫీ) గణితం అంతర్లీనంగా మార్గదర్శక పాత్ర నిర్వహిస్తోంది.

సంగీతాన్ని క్రమబద్ధంగా కాపాడే లయ - అగోచరమైన కాలాన్ని తాళశబ్దంతో గణితబద్ధం చేయడానికే ప్రాదుర్భవించింది. శూన్యావకాశాన్ని లయబద్ధ నాదంతో నింపుతూ, అగణిత దైర్ఘ్యాన్ని అదుపు చేసుకుందుకే ఏర్పడింది. అంటే ఈ గణితశాస్త్ర సత్యం సంగీత సౌందర్యాన్ని పరిపోషిస్తూ శ్రవణ సుభగత్వంగా పరివర్తించిందన్న సత్యం మనం అవగతం చేసుకోవాలి. తద్వారా అనుభవ వశీకరణం సాధించగలుగుతోందన్న మాట. అనంతకాలాన్ని నాదలయల గ్రాహ్యశక్తితో స్వాధీనపరుచుకోగలుగుతోంది.

కాలావకాశాల గణిత ప్రభావంవల్లనే ఋతువుల మార్పు లయబద్ధంగా సాగుతుంది.

సముద్రతీరంలో లభించే గవ్వ ఎంతో అందంగా మనల్ని ఆకర్షిస్తోంది. దానికి గల కారణం అతీతమైందేమీ కాదు. గవ్వపై నిర్మాణమైన రేఖలూ ఒంపులూ గణితశాస్త్రబద్ధంగా అమరడంవల్లనే అది మనకు ఆకర్షణీయమైంది. అంటే కళా సౌందర్యానికి అంతర్గర్భితంగా శాస్త్రీయమైన సూత్రబద్ధత అధిష్ఠానంగా అమరిందని మనం తేలికగానే అర్థం చేసుకోగలుగుతాం.

చిత్రకారుల శాస్త్రీయ అవగాహన :

లియొనార్డో డావిన్సీ నిర్మించిన 'జీసస్ ఆఖరి విందు' అనే చిత్రాన్ని పరిశీలిస్తే - ఈ అంశం మరింత స్పష్టంగా ద్యోతకమవుతుంది. ఆ చిత్రంలో మానవమూర్తులు ఒక క్రమంలో సర్దబడ్డాయి. ఏ ఒక్కమూర్తీ వేరొకమూర్తిని కప్పివేయదు. దీనికై లెక్క ప్రకారం నిర్మాణం జరిగింది. ఆ చిత్రాన్ని చూసీ చూడగానే - మన దృష్టిని ఆకర్షించేది లయ ప్రాధాన్యతే! క్రీస్తు అందరికీ నడుమ కూర్చున్నాడు. అతని స్థానం మనుషుల మధ్యనే తప్ప అతీతంగా కాదని స్పష్టమవుతుంది. చిత్రింపబడిన మొత్తం హాలుకు మధ్యగా క్రీస్తు కూర్చున్నాడు. అతనికి సరిగ్గా వెనుక ఒక కిటికీ వుంది. శిష్యుల మూర్తి చిత్రాల మధ్యగల వ్యవధి — తేడా పాడాలు లేకుండా సరిగా పంపకం జరిగింది. ఈ ప్రక్రియవల్ల చూపరుల దృష్టులన్నీ — నడుమనున్న క్రీస్తుపైనే లగ్నమవుతాయి.

ఇదంతా ఆ చిత్రకారుడికి గల శాస్త్రీయ అవగాహనవల్లనే రూపొందింది. లేకపోతే సాధ్యమయ్యేదే కాదు.

కీట్సు మహాకవి చెప్పిన 'సత్యమే సౌందర్యం - సౌందర్యమే సత్యం!' అనేమాట బహుళ ప్రచారంలో వున్నదే! కాని ఈ సత్యసౌందర్యాలను కవిత్వ పారమ్యతలుగా అపార్థం చేసుకోవడమూ జరిగింది. సత్యమూ, సౌందర్యమూ భిన్నధాతువులుగా కేటాయించుకోవడం జరిగింది. కీట్సు కవి భావించిన సత్యం— శాస్త్రసమ్మత సత్యమే తప్ప అన్యం కాదు. అదే సౌందర్య పోషకమని ఆ కవి ఆంతర్యం. ఈ రెండింటి పాదార్థిక సంలీనంత లోనే పార్థివ స్వరూపం-సౌందర్యవంతంగా ఏర్పడుతుంది. అదే కీట్సు భావన. అంతేతప్ప కవి భావించిన సౌందర్యం కానీ, సత్యంకాని బ్రహ్మపదార్థాలు కావు.

సత్యమూ సౌందర్యమూ అనే రెండు ధాతువులు సమ్మేళనం చెంది వాటికగల వైయక్తిక స్వభావాలను కోల్పోతాయని కవి భావించాడు. శాస్త్రసత్యం, కళాసత్యానికి భూమికగా అమరినపుడే సౌందర్యం అనుభోక్తవ్యమవుతుంది. కీట్సు మహాకవి అభివ్యక్తం చేసిన సత్య సౌందర్యాల అనుమేళవాన్నే మన ఆలంకారికులు 'రస'మన్నారు.

దక్షిణాపథంలో మన ప్రాచీన శిల్పులు మహత్తర సౌందర్యాలు సృష్టించారు. వారి కృషి అడుగడుగునా సజీవ దర్శనమిస్తోంది. ఒక మండపాన్ని శిల్పమయంగా నిర్మించినపుడు - ఆ మండప ముఖాని కిరువైపులా రెండు బ్రహ్మాండమైన శిలా తురంగాలను సృజిస్తాడు శిల్పి. అవి శక్తిసంపన్నంగా నిలుస్తాయి. ముందు కాళ్ళు బాగా పైకెత్తి నిలబడి వుంటాయి. అలా నిలచిన గుర్రాలపై బలమైన రౌతులు చేయి ఎత్తి కూర్చుంటారు. ఆ చేతిమీద మండపం పైకప్పు ఆధారపడి నిలుస్తుంది.

ఆ మహాశిల్పికి - అలా నిలిచిన గుర్రాల గరిమనాభి ఎక్కడ కేంద్రీకృతమైందో స్పష్టంగా తెలుసు. ఆ విజ్ఞానశాస్త్ర విషయం అతనికి తెలియకపోతే - ఆ మహత్తర శిల్పాన్ని ఇన్ని వందల ఏళ్ళ తర్వాత మనం చూడగలిగేవాళ్ళమే కాదు. అథవా సమకాలికులైనా చూడలేకపోదురు.

మన శిల్పులందరికీ శిల్పంలో లయ ప్రధానమని తెలుసు. సెమిట్రీపట్ల గాఢప్రమేయం వారికుంది. మేథమేటికల్ ప్రెసిషన్ పట్ల తీవ్ర అభినివేశమూ వారికుంది — ఈ సైంటిఫిక్ జ్ఞానం వారిలో స్పష్టంగా ఉంది కనకనే - ఆ మహత్తర సౌందర్యానుభూతి మనకు లభించింది.

కళలకు శాస్త్రీయజ్ఞానం అధిష్ఠానమే :

కీట్సు కవిగాని, డావిన్సీ కాని, భారతీయ శిల్పులుగాని— సత్యమూ - సౌందర్యమూ అనే రెండు ధాతువులూ కళకు ప్రాణప్రదాలుగా పరిగణించిన వారే. ఇవి రెండూ సంలీనం కావడం ద్వారానే సృజనాత్మక కళాసౌందర్యం సాధ్యమవుతుందని గ్రహించినవారే.

శాస్త్రవేత్త సాహిత్యకళకు సంబంధించిన భాషాశైలులను ఏ విధంగా వినియోగించుకొని తాను చెప్పదలచుకొన్న శాస్త్రాంశాలను పటిష్టవంతంగా పాఠకుల కందిస్తాడో - అదేరీతిగా విజ్ఞానశాస్త్రాంశాలను తమ కళలకు భూమికలుగానో, నేపథ్యంగానో, అధిష్ఠానంగానో మలచుకొని - కళాకారుడు తన సందేశాన్ని పటిష్టవంతం చేసుకుంటాడు. పరిశీలనద్వారా ఈ యథార్థాన్ని మనం గ్రహించగలుగుతాము.

ఇంద్రియ కానుభవాల నమూనాలు వేరు వేరు శ్రేణులుగా మన హృదయానికి చేరవచ్చు. కాని తద్వారా లభించిన అనుభూతీ, ఆంతరిక దర్శనమూ ఏకీకృతమైనదే. ఫలితార్థమైన అభివ్యక్తిసైతం అవిభాజ్యమైనదే. సత్యంలోనే సౌందర్యమూ, సౌందర్యంలోనే సత్యదర్శనమూ అంతర్లీనమై భాసిస్తూ ఉంటాయి. ఈ శాస్త్రీయ అవగాహనే ప్రధానం.

నిజమైన శాస్త్రవేత్త సౌందర్యాన్ని ఇంద్రియానుభవ పరిధిలోనికి తెచ్చుకోకుండా ఉండలేడు. శాస్త్రీయ సత్యంకన్న కళాసృజన అతీతమని పరిపక్వ కళాకారుడు భావించలేడు. ప్రకృతి సౌందర్యమే శాస్త్రబద్ధమైనపుడు - కళాసృజన దానికి విదూరమో, విరుద్ధమో ఎలా కాగలుగుతుంది?

ఈ యథార్థాన్ని అవగాహన చేసుకోగలిగితే-మన చూపు మరింత నైశిత్యమవుతుంది. మనదర్శనం మరింత విస్ఫారితమూ గంభీరమూ కాగలుగుతుంది. నిరుపయోగమూ, వ్యర్థ పటాటోపమూ అగు వాగ్వాదాలజోలికీ, తర్కాలజోలికీ మనం పోనవసరంలేదు.

ఆర్టిస్టునీ సైంటిస్టునీ రెండు విభిన్న ధ్రువాలకు చెందినవారుగా కేటాయించే కురుచ చూపునుంచి మనం బయటపడగలుగుతాము. వీరిరువురూ ఒకే సత్యావిష్కరణ కోసం వేరు వేరు పంథా లవలంబిస్తున్నారు. భిన్న భిన్న నిర్దేశాలు సాధిస్తారు. వాస్తవికతా దృక్కోణాలను ఆవిష్కరించేందుకు ఒకే రీతిగా ఉత్ప్రేక్షిస్తారు. ఇరువురూ ఒకే గమ్యాన్ని అనుసరిస్తారు. సాపేక్షిక వ్యర్థాంశాలను వీరు ఒకేరీతిగా తృణీకరిస్తారు. ఆత్మాశ్రయ ఇంద్రియానుభవాలు కొంత వైవిధ్యాన్ని కలిగించవచ్చు గాక! అభివ్యక్తిమార్గాలు భిన్నించి, వైవిధ్యం భాసించవచ్చు గాక; అంతమాత్రంలో ప్రస్తుతత్వంలోగాని, ధాతుమూలంలోగాని వైరుధ్యం ఉన్నట్లు కానేకాదు.

కళలూ విజ్ఞానశాస్త్రమూ భిన్న ఆవరణలుగా విడిపోయినట్లు ద్యోతకమవుతున్నాయి. ప్రస్తుత మీ పరిస్థితి క్రమంగా పెంపొందుతోంది. పెట్టుబడిదారీ నాగరికత పైచేయికి వచ్చేసరికి, కళలూ విజ్ఞానశాస్త్రమూ భిన్న భిన్న సంస్కారాలుగా విడిపోవడం తప్పనిసరే అవుతోంది. వైయక్తిక కళారశ్మి ప్రధానమైన చేతిపరిశ్రమలూ వృత్తులూ తప్పుకొని, వాటి స్థానంలో పారిశ్రామిక యంత్రోత్పత్తి. సమష్టికృషీ పెత్తనం వహించక తప్పడంలేదు. వ్యాపారదృష్టి ప్రధానమైన స్వార్థపర పెట్టుబడిదారీ వర్గం - కళలనూ విజ్ఞాన శాస్త్రాంశాలనూ ఉపయోగించుకుంటూనే - రెండిటికీ నడుమ అఖాతం కల్పిస్తోంది.

సాంకేతిక రంగం :

విజ్ఞానశాస్త్రం పరిశుద్ధ జ్ఞానంగా ఎన్నడూ బ్రతకలేదు! దాని కృషి సాంకేతికరంగంలో ఫలితాలనూ విజయాలనూ సాధిస్తే తప్ప - దానికి క్రమవికాసం ఏర్పడదు. ఆ విజయాలు

కన్నులు మిరుమిట్లు కొల్పేవిగానూ ఉండే తీరాలి. అంటే వస్తూత్పత్తిలో ఔపయోగికతకన్న ఆకర్షణీయత ప్రధానం కావడం వాణిజ్యరంగానికి అత్యవసరం. ఆకర్షణీయతను సాధించ లేకపోతే వాణిజ్యరంగం - సాంకేతిక వస్తూత్పత్తికి కారణమైన విజ్ఞానశాస్త్రాన్నే నిరపిస్తుంది.

ఈ విషమ పరిస్థితి ఘనీభవించేకొద్దీ - వినిమయదారులైన సామాన్య మానవులు నిజమైన విలువలకు దూరం చేయబడు తున్నారు. ఈ ప్రమాదాన్ని చాలామంది మేధావులు ముందే పసిగట్టారు. ఈ దుర్వ్యవస్థ ఆరంభకాలంలోనే మహా రచయిత మార్క్‌ట్వెయిన్ యిలా హెచ్చరించాడు : "నాగరకత ఒక అనంత గుణకారంతో సాగిపోతోంది - అనవసరమైన 'అవసర' వస్తువులను ఉత్పత్తి చేసుకుంటూ బలిసిపోతోంది!" అని వెక్కిరించాడు.

నిజమే మరి. నేడు సాంకేతిక వస్తూత్పత్తి అనంతంగా పెరిగిపోతోంది. తద్వారా మన నిత్య జీవితాలకు ఎంతో సౌకర్యం కలుగుతున్నట్లే భ్రమ కొల్పుతోంది. కాని అదే మనకు శాపమూ అవుతోంది. గోటితో మీటితే జరిగే పనికి - సాంకేతిక విపణి నుంచి 'కొత్త గొడ్డలి' కాని తెచ్చుకోవలసిన స్థితి ఏర్పడుతోంది శారీరక శ్రమలో పెంపొందే సృజనాత్మకత నిరంతరాయంగా మననుంచి దూరమైపోతోంది. మన బ్రతుకు నిరాడంబరంగా సాగాలన్న వారసత్వంనుంచి ఎటో పోతున్నాం. సిద్ధకళ విస్మరింపబడింది. జీవితాన్ని ఖండ ఖండాలుగా తప్ప - ఏకాండంగా వీక్షించలేకపోతున్నాం. సమ్యగ్ స్వరూపంగా దర్శించలేక పోతున్నాం.

సామాజికులను బాహ్యమైన లేబిల్సుతోనో నంబర్లతోనో తప్ప మనుషులుగా పరిగణించలేకపోతున్నాం. మనిషికీ మనిషికీ నడుమ పెంపొందవలసిన స్వజాతీయ అంతస్సంబంధం భగ్నమై పోతోంది. వైవిధ్యం వెరుధ్యాలకు ప్రాణం పోస్తోంది.

ఈ విషమ వ్యవస్థా ఫలితంగానే కళలకూ విజ్ఞాన శాస్త్రాలకూ గల అంతస్సంబంధాలు దెబ్బ తినేశాయి. ఆ రెంటి నడుమా ప్రవర్తిల్లే అనుమేళన చెడిపోయింది!

సాంకేతిక వస్తు సముదాయం మన బ్రతుకుల్ని గడాబధించడంవల్ల సహజ మానవీయ శక్తులు సన్నగిల్లిపోతున్నాయి. 'కూనిరాగం తీయలేని మగాడూ, కుడుములు వండలేని ఆడదీ ఉండదు' అనే సామెత ఉత్తనే పుట్టింది కాదు. కాని నేడు మనం గొంతెత్తి హాయిగా పాడుకోగల శక్తినే కోల్పోతున్నాం. మనకి సంగీతాభిలాష కలగడమే తడవుగా-రేడియోలు, రికార్డు ప్లేయర్లూ పరిచారికల్లా ముందుకు వచ్చి నిల్చుంటున్నాయి. టి.వి. లో క్రికెట్ ఆట చూడటమో, ఫుట్‌బాల్ క్రీడ చూడటమో — మన హృదయాల సాహసకార్య పిపాసను సంతృప్తి పరుస్తున్నాయి.

అంటే మనం నేడు వక్రీకృత సంతృప్తితో మన దాహం చల్లార్చుకుంటున్నామే తప్ప - మనకు మనమే సాహసం చేయ లేకపోతున్నాం. గొంతెత్తి పాడుకోవడంలో లభించే ఆత్మికానందాన్నీ నిర్వృతినీ సాధించలేకపోతున్నాం. సాంకేతిక విజ్ఞానం పెంపొందడంవల్ల లభించిన సహస్ర పరికరాలన్నీ గొప్ప వరాలే కావచ్చు కాని - వ్యక్తిగత ప్రతిభావిష్కారానికి అవే తీవ్రశాపాలూ అవుతున్నాయి.

ఈ సాంకేతిక పరికరాల వ్యాప్తిద్వారా లభించే జాతీయాదాయమే పరిగణనీయ మవుతోంది తప్ప - సన్నగిల్లుతున్న సామూహిక ప్రతిభ లెక్కల కెక్కడంలేదు. ఈ పరిస్థితి ఎంత హాస్యాస్పదంగా తయారైందంటే - మన కాళ్ళు కుంపట్లోనూ మన తలలు ఫ్రిజిడేర్‌లోనూ భద్రపరచుకొనే శోచనీయావస్థ ఎదురవుతోంది! కొంచెం తీవ్రంగా ఆలోచిస్తే తప్ప - మనం అనుభవిస్తున్న ఈ విచిత్రస్థితి గురించి మనకే స్పృహ కలగదు.

శోచనీయ స్థితిపై అసమ్మతి :

ఇట్టి శోచనీయ స్థితివల్లనే - కళలు సైన్సునుంచి దూరమై పోయినట్లు స్థూలదృష్టికి కనిపిస్తోంది. ఈ రెండిటి నడుమా క్రమంగా వైరుధ్యం పెంపొందుతున్న వాస్తవమూ మన కవగత మవుతోంది. ఈ అవగాహనతోనే, ఏదో ఒక మూలనుంచి పీలగా నైనా నిరసనభావమూ వ్యక్తమవుతోంది. ఈ వైరుధ్యానికి ప్రధాన నిందితులు సైంటిస్టులేనేమో ననిపిస్తోంది.

నిజానికి వారే - సౌందర్యవంతమైన సాధనాల అంతస్సంబంధాన్ని విశ్లేషించారు. ఎదురైన సమస్యలను పరిష్క-

ఆ మహాశిల్పికి - అలా నిలిచిన గుర్రాల గరిమనాభి ఎక్కడ కేంద్రీకృతమైందో స్పష్టంగా తెలుసు. ఆ విజ్ఞానశాస్త్ర విషయం అతనికి తెలియకపోతే - ఆ మహత్తర శిల్పాన్ని ఇన్ని వందల ఏళ్ళ తర్వాత మనం చూడగలిగేవాళ్ళమే కాదు. అథవా సమకాలికులైనా చూడలేకపోదురు.

మన శిల్పులందరికీ శిల్పంలో లయ ప్రధానమని తెలుసు. సెమిట్రీపట్ల గాఢప్రమేయం వారికుంది. మేథమేటికల్ ప్రెసిషన్ పట్ల తీవ్ర అభినివేశమూ వారికుంది — ఈ సైంటిఫిక్ జ్ఞానం వారిలో స్పష్టంగా ఉంది కనకనే - ఆ మహత్తర సౌందర్యా విర్భూతి మనకు లభించింది.

## కళలకు శాస్త్రీయజ్ఞానం అదిష్ఠానమే :

కీట్సు కవిగాని, డావిన్సీ కాని, భారతీయ శిల్పులుగాని— సత్యమూ - సౌందర్యమూ అనే రెండు ధాతువులూ కళకు ప్రాణ ప్రదాలుగా పరిగణించిన వారే. ఇవి రెండూ సంలీనం కావడం ద్వారానే సృజనాత్మక కళాసౌందర్యం సాధ్యమవుతుందని గ్రహించినవారే.

శాస్త్రవేత్త సాహిత్యకళకు సంబంధించిన భాషాశైలులను ఏ విధంగా వినియోగించుకొని తాను చెప్పదలచుకొన్న శాస్త్రాంశా లను పటిష్టవంతంగా పాఠకుల కందిస్తాడో - అదేరీతిగా విజ్ఞాన శాస్త్రాంశాలను తమ కళలకు భూమికలుగానో, నేపథ్యంగానో, అధిష్ఠానంగానో మలచుకొని - కళాకారుడు తన సందేశాన్ని పటిష్టవంతం చేసుకుంటాడు. పరిశీలనద్వారా ఈ యథార్థాన్ని మనం గ్రహించగలుగుతాము.

ఐంద్రియ కానుభవాల నమూనాలు వేరు వేరు శ్రేణులుగా మన హృదయానికి చేరవచ్చు. కాని తద్వారా లభించిన అనుభూతీ, ఆంతరిక దర్శనమూ ఏకీకృతమైనదే. ఫలితార్థమైన అభివ్యక్తిసైతం అవిభాజ్యమైనదే. సత్యంలోనే సౌందర్యమూ, సౌందర్యంలోనే సత్యదర్శనమూ అంతర్లీనమై భాసిస్తూ ఉంటాయి. ఈ శాస్త్రీయ అవగాహనే ప్రధానం.

నిజమైన శాస్త్రవేత్త సౌందర్యాన్ని ఇంద్రియానుభవ పరిధి లోనికి తెచ్చుకోకుండా ఉండలేడు. శాస్త్రీయ సత్యంకన్న కళా సృజన అతీతమని పరిపక్వ కళాకారుడు భావించలేడు. ప్రకృతి సౌందర్యమే శాస్త్రబద్ధమైనపుడు - కళాసృజన దానికి విదూరమో, విరుద్ధమో ఎలా కాగలుగుతుంది?

ఈ యథార్థాన్ని అవగాహన చేసుకోగలిగితే-మన చూపు మరింత నైశిత్యమవుతుంది. మనదర్శనం మరింత విస్ఫారితమూ గంభీరమూ కాగలుగుతుంది. నిరుపయోగమూ, వ్యర్థ పటా టోపమూ అగు వాగ్వాదాలజోలికీ, తర్కాలజోలికీ మనం పోనవసరంలేదు.

ఆర్టిస్టునీ సైంటిస్టునీ రెండు విభిన్న ధ్రువాలకు చెందిన వారుగా కేటాయించే కురుచ చూపునుంచి మనం బయటపడ గలుగుతాము. వీరిరువురూ ఒకే సత్యావిష్కరణ కోసం వేరు వేరు పంథా లవలంబిస్తున్నారు. భిన్న భిన్న నిర్దేశాలు సాధి స్తారు. వాస్తవికతా దృక్కోణాలను ఆవిష్కరించేందుకు ఒకే రీతిగా ఉత్ప్రేక్షిస్తారు. ఇరువురూ ఒకే గమ్యాన్ని అనుసరిస్తారు. సాపేక్షిక వ్యర్థాంశాలను వీరు ఒకేరీతిగా తృణీకరిస్తారు. ఆత్మా శ్రయ ఇంద్రియానుభవాలు కొంత వైవిధ్యాన్ని కలిగించవచ్చు గాక! అభివ్యక్తిమార్గాలు భిన్నించి, వైవిధ్యం భాసించవచ్చు గాక; అంతమాత్రంలో ప్రస్తుతత్వంలోగాని, ధాతుమూలంలోగాని వైరుధ్యం ఉన్నట్లు కానేకాదు.

కళలూ విజ్ఞానశాస్త్రమూ భిన్న ఆవరణలుగా విడిపోయి నట్లు ద్యోతకమవుతున్నాయి. ప్రస్తుత మీ పరిస్థితి క్రమంగా పెంపొందుతోంది. పెట్టుబడిదారీ నాగరికత పైచేయికి వచ్చేసరికి, కళలూ విజ్ఞానశాస్త్రమూ భిన్న భిన్న సంస్కారాలుగా విడిపోవడం తప్పనిసరే అవుతోంది. వైయక్తిక కళారశ్మి ప్రధానమైన చేతిపరిశ్రమలూ వృత్తులూ తప్పుకొని, వాటి స్థానంలో పారిశ్రామిక యంత్రోత్పత్తీ. సమష్టికృషీ పెత్తనం వహించక తప్పడంలేదు. వ్యాపారదృష్టి ప్రధానమైన స్వార్థపర పెట్టుబడి దారీ వర్గం - కళలనూ విజ్ఞాన శాస్త్రాంశాలనూ ఉపయోగించు కుంటూనే - రెండిటికీ నడుమ అఖాతం కల్పిస్తోంది.

## సాంకేతిక రంగం :

విజ్ఞానశాస్త్రం పరిశుద్ధ జ్ఞానంగా ఎన్నడూ బ్రతకలేదు! దాని కృషి సాంకేతికరంగంలో ఫలితాలనూ విజయాలనూ సాధిస్తే తప్ప - దానికి క్రమవికాసం ఏర్పడదు. ఆ విజయాలు

రించారు. ఉపకరణాలను రూపొందించడానికీ ప్రయత్నించారు. కనుకనే వారే నేరస్థులుగా స్థూలదృష్టికి తోచడంలో అబ్బురం లేదు.

సత్యానికీ సౌందర్యానికీ నడుమ గల అంతస్సంబంధాన్ని సైంటిస్టులే ఒక సమస్యగా లేవనెత్తడం, దాన్ని పరిశోధనా గారంలో విశ్లేషించడం - సామాన్యుల దృష్టికి సైతం గోచర మయ్యేంత స్పష్టంగా వెల్లడైంది. కనక సైంటిస్టులే నేరస్థులనే ఆరోపణ చప్పున ప్రబలుతోంది.

కాని ఈ విషమ పరిస్థితికి కారణం సైంటిస్టులు కానే కాదు. వారిని అదుపుచేస్తున్న పెట్టుబడిదారీ వ్యాపార నాగరకతే అసలు కారణం! ఈ మెర్కంటెయిల్ బూర్జువాయిజీ పెద్దఎత్తున కలిగిస్తున్న ఆకర్షణా వ్యామోహమే ప్రధాన కారణం! అసలు దొంగ కనిపించకుండా నేపథ్యంలోకి తప్పుకుంటున్నాడు. మన వైజ్ఞానిక సాంకేతిక రంగాలను ఎంతో నిస్స్వార్థ జ్ఞానతృష్ణతో అభివృద్ధి పరుస్తున్న శ్రమజీవి సైంటిస్టు. అన్యాయంగా నిందితుడవుతున్నాడు!

వ్యాపార విషచక్ర విజృంభణవల్లనే - సైన్సుకూ కళలకూ గల ఆంతరిక సంబంధమూ భగ్నమవుతోంది దానికి కేంద్ర స్థానీయుడైన మానవుడ్నీ విస్మరించడం జరుగుతోంది

ఈ కారణంవల్లనే-సైన్సు ఒక్కటే ఆధునిక మానవుడికి సర్వ సౌఖ్యప్రదాతగా భ్రమకొల్పబడుతోంది. కళాసౌందర్యాన్ని ఆరాధించడం సన్నగిల్లుతోంది. కళాసృజనకోసం పరిశ్రమించడం మృగ్యమైపోతోంది. కళలు — వైజ్ఞానిక శాస్త్రాభాసలుగా పరిగణింపబడే దురదృష్ట స్థితి ఆవరిస్తోంది. ఈ పరిస్థితి ఎంత అపభ్రంశమో, మానవ హృదయానికెంత విపత్కరమో మరి కొంతకాలం సాగితే తప్ప అర్థంకాదు. తీరా అవగత మయ్యే సరికి - పరిష్కారానికి కాలాతీతమూ కావచ్చు!

ప్రాకృతిక దుశ్శక్తులను అదుపు చేయగలిగినంతవరకూ సైన్సూ సాంకేతిక విజ్ఞానమూ సమర్థనీయాలే! సందేహం లేదు. మానవ నైతిక, మనోగతమూల్యాలను ధ్వంసంచేసే స్థితికి అవి అదుపుతప్పి పెరిగిపోవడమే ప్రమాదకరం! సైన్సు పురోగ మించరాదని నేడు ఎంత జడుడైనా అనలేడు. కాని అది ముందుకు పోతున్న దారిలో సర్వాన్నీ ఛిద్రం చేసుకుం పోవడం మాత్రం విషాదకరమే!

సైన్సు పురోగతిలో యిప్పటికే ఎన్నో అమూల్య మా సహజాతాలూ, వనరులూ ధ్వంసమైపోయాయి. మరికొ వక్రీకృతమైపోతున్నాయి. 'సైన్సుతో కళలు అనుమే పొందడంవల్ల కలిగిన విషఫలితమేమో యిది' అనే అనుమా స్థూలదృష్టికి కలుగుతోంది.

అసలు స్వరూపం అది కానేకాదు; చిత్రకళా ప్రతిభ వ్యాపార ప్రకటనలకో, వాల్‌పోస్టర్ నిర్మాణానికో, చీరల డిజై అద్దకాలకో దుర్వినియోగం చేస్తున్న మర్కెంటెయి బూర్జువాయిజీ అదృశ్య హస్తమే కళామూల్యాలను విధ్వంసమె రిస్తోంది! శుద్ధకళను వ్యాపారకళగా మార్చి-ఆదరిస్తోంది!

చిన్న చేపలను పెద్దచేప మ్రింగేసి బలపడటమే సాంఘి న్యాయంగా గౌరవిస్తున్న వర్తమాన వ్యవస్థే మానవత్వంప జరుగుతున్న మహత్తర దోషానికి అసలు ముద్దాయి! ఆ దోష అటు సైన్సుదీ కాదు, ఇటు కళలదీ కాదు.

కళాకారుని అంతశ్చేతన :

నిజమైన కళాకారుని అంతశ్చేతన సైన్సుకి వ్యతిరేక కాదు; నిజమైన సైంటిస్టు హృదయం కళలకూ విదూరం కాద కాని వర్తమాన వ్యవస్థా ప్రాబల్యంవల్ల వీరిద్దరూ పరస్ప విరుద్ధంగా ఒక మౌనవిప్లవానికి ఆయత్తమవుతూండట బాధాకరం.

సైన్సు చేకూర్చే సద్యఃఫలితాలను కళాహృదయ వ్యతిరేకిస్తోంది. కళాకారుడికి ఎదురు బదురుగా సైన్సు నిలబ తున్నట్లు భ్రమాస్పదమవుతోంది. సౌందర్యవంతమైనదం సత్యం కాదని సైన్సు దబాయించదలిస్తే - కళాహృదయం తిర బడ్డంలో ఆశ్చర్యమేముంది?

కాని కళాకారుని ఆంతరంగిక పరికరంలో మోసులువా సృజనాత్మకశక్తి నిరంతర పిపాసతో సౌందర్యాన్ని సృష్టిస్తూ వుంటుంది. సైన్సు ప్రచలితం చేసే ధాష్టీకానికి వ్యతిరేకం కళాకారుని ప్రతిఘటనగా అతని కళాసృజన అభివ్యక్తమవుతూ వుంటుంది.

అచ్చమైన సైంటిస్టులంతా కళాహృదయులేనన్న పరమ సత్యం మాత్రం విస్మరింపబడకూడదు. ఐన్‌స్టయిన్ మహాశయుడు మనస్సు అలసట చెందిన వేళలలో వాయులీన వాదనలో మైమరచిపోయేవాడు. మన భాభా సంగీతవాదనంలోనో, చిత్రలేఖనంలోనో పారవశ్యం చెందేవాడు. ఇలాగే ఎందరో మహాశయులు అటు శాస్త్రవిజ్ఞానానికీ యిటు కళాపారవశ్యానికీ సమానంగానే హృదయాల నర్పించినవారున్నారు.

ఇక్బాల్ మహాకవి తానే ఒక తరంగం అన్నాడు. ఉప్పొంగకపోతే తన మనికే వ్యర్థమైపోతుందని ఆక్రోశించాడు. కవిగా తన్ను నిర్లక్ష్యం చేస్తున్న సమాజాన్ని నిరసించడమే ఈ ఆక్రోశంలోని అంతర్భావం.

పాబ్లోనెరూడా కవిత్వం గాని, పాల్‌రోబ్సన్ గానం గాని కళాకారులుగా తమ హృదయాలను బంధిస్తున్న అదృశ్య శక్తులను తిరస్కరిస్తూనే పురోగమించాయి. పికాసో చిత్రకళా జీవితమంతా వర్తమాన దుర్వ్యవస్థపై జరిపిన తిరుగుబాటుగానే అభివ్యక్తమైంది.

కళాకారుడి అంతరాత్మకు తగిలే కొరడా దెబ్బలను ప్రతిఘటిస్తూ, తన కళా హృదయాన్ని సంరక్షించుకుందుకు పడిన ఆరాటమే కళాసృజనగా వెలువడుతోంది. ధనస్వామ్య లోకం వ్యక్తంగానూ, అనభివ్యక్తంగానూ నిర్ణయిస్తున్న విధి నిషేధాలను తీవ్రంగా ద్వేషిస్తూనే పికాసో ప్రభృతి ఆధునిక కళాకారులంతా పురోగమించారు. ఆధునిక వైజ్ఞానిక శాస్త్రాంశాలను తమ కళారీతులకు అధిష్ఠానంగా అనుసంధించుకున్నారు.

ధనస్వామ్య పాలక వర్గాలకూ కళలూ తెలియవు; వాటి విలువలూ తెలియవు. కాని కళాఖండాలను ఉదారంగా ఖరీదుచేసి తమ ప్రాంగణాలను అలంకరించుకోవడమే ఒక స్టేటస్‌గా భావిస్తారు. కళాభిమానం ప్రకటించుకోవడం వారికొక భోజూ, మోజూ మాత్రమే!

ఈ ఆలోచనావృత్తాన్ని పరిపూర్ణం చేస్తూ సైన్సులోని కళ గురించీ, కళలలోని సైన్సు గురించీ మళ్ళీ మనం ఎత్తుకుంటే- మేధాపరమైన కాంతిపుంజాన్ని రసావేశ ప్రాణధాతువులతో అనుమేళన చేయడమే తరుణోపాయ మనిపిస్తుంది. సౌందర్యానుభూతి - సత్య సందర్శనానుభవంలో పర్యవసించడంలోనే పరిష్కార మేర్పడగలదనిపిస్తుంది. ఆధునిక యుగంలో ఈ రెండిటికీ గల అనుస్యూత అవినాభావ సంబంధం మన హృదయతలంలో పెంపొందక తప్పదనీ అనిపిస్తుంది. ఇటు కళాకారులలో విజ్ఞానశాస్త్ర చైతన్యమూ, అటు సైంటిస్టులలో కళా చైతన్యమూ పెంపొందినపుడే పురోగతీ, ముక్తీ!!

~~~~~~~~~~~~

# "గుర్తులు"

## శ్రీ మంజి గోపాల్

గుర్తులు గుంభనంగా నవ్వుతాయి
గుండెల్లో గునపాలు గుచ్చుతూ
బాధలు నిద్ర లేస్తాయి.

కూలిపోయిన గూళ్లన్నీ గువ్వల వాసనేస్తుంది.
ఎక్కడో ఆకాశం మధ్యలో గమ్యం తెలీక
గిరికీలు కొడుతున్న గువ్వ గుర్తు చేసుకుంటుంది;
కొమ్మలమధ్యనించి కూలిపోయిన కుటీరాన్ని

అర్థరాత్రి నిద్రపట్టక
సిగరెట్టు పొగల్లో నీడల జ్ఞాపకాల గుర్తులు
స్నానపు నబ్బులా ఒళ్ళంతా తడుముతూ పులకరింపజేస్తాయి
ముందుకు సాగిపోతుంటే
వెనకబడ్డ అడుగుల వంకర గుర్తులు వెక్కిరిస్తూ చూస్తాయి.

నువ్వు కొన్న చివరి కాలెండర్‌లో
నీ మొహాన్ని నువ్వే గుర్తుపట్టలేవు
శిశిరంలో ఆకులు విదుల్చుకున్న వృక్షంలా
నీలోంచి స్వప్నాలు జలజలా రాలిపోతాయి
చిరిగిన జేబులో పడ్డ యిపాయి నాణెంలా
నీ జీవితాన్ని పోగొట్టుకుంటావ్
నువ్వు పట్టించుకోకున్నా
ప్రతి గుర్తూ నీ వైపు గురిపెట్టబడే వుంటుంది
కొన్ని గుర్తులు చెరిపేసుకోవాలనుకున్నా
శిలాక్షరాల్లా అతుక్కునే వుంటాయ్
~~~~~~~~~~~~

# ప్రస్థానత్రయం

1

అప్పుడు నేను రెల్లు పొదను!
స్వర్ణపరాగ ధూముల్లాంటి
ఇసుక తిన్నెలమీద - నా చుట్టూ
తేట పన్నీటి ప్రవాహాలను
ప్రదక్షిణం చేయించుకుంటూ
నవ్విన ప్రతి నవ్వూ - తెల్లని పువ్వులా
నీలి నింగిలోకి ఎగరేసుకుంటూ
బ్రతికిన పసి ఎదను!

2

ఎప్పుడు 'బ్రహ్మజెముడు' నయ్యానో తెలియదు!
నా గుండ్రని ఆకుపచ్చదనంమీద
సూదిముల్లు దిగేసుకొని
అస్పృశ్యతా శాపాన్ని నాకు నేనే విధించుకొని
ఆత్మరక్షణమో - అహంకార పోషణమో తెలియక
కళ్ళు మూసుకొని - భ్రూమధ్యంలో
ఒక ప్రశ్నను వెలిగించుకొని
ఆ క్షుద్ర తపస్సుకు ఫలితంగా
ఒంటరితనాన్ని 'వరం'గా పొందాను!

3

ఇప్పుడు నేను మొగలి డొంకను!
పసితనపు సువాసనా-
గిడస బారిన మాజీ మార్దవపు
రంపపుముళ్ళూ
పొట్లం కట్టుకున్న 'పొత్తు'ను!
సరసరా పాక్కుంటూ
కృష్ణసర్పం ఒకటి
మెత్తగా మెలికలు తిరుగుతూ వచ్చి
నాలో కాపురం చేస్తోంది-
అమూర్త పరిమళ సౌందర్యానికి
అహరహం అనితరసాధ్యంగా
కాపలా కాస్తోంది!

# శేషపల్లవం

పేరు లేని చెట్టుగానే మిగిలాను
అయినా ఫరవాలేదు-
గ్రీష్మాతప పీడిత ప్రాణానికి
కొంతకాలం నీడపట్టు నయ్యానన్న తృప్తి నాది!

నా పెద్ద పెద్ద కలల కొమ్మల్ని
నాకు నీళ్లు పోసిన చేతులే నరికేశాయి
చింతించటం లేదు--
పెంచిన చేతులకే
త్రుంచే అధికారం ఉంటుందన్న
సిద్ధాంతం కాబోలు వాటిది!
పూలను రాల్చేసుకున్నాను
పాలపిట్టల పాటల్ని దులిపేసుకున్నాను
నీడనివ్వలేని మోడు ననిపించుకున్నాను
అనుభవ భారంతో అంత్యదశకు చేరుకున్నాను.

అది సరే—
ఎందుకింకా మిగిలింది ఒక చిగురు!
కొనవేలుమీద అదిమిపట్టిన
ఎర్రటి నిప్పురవ్వలా
నా పచ్చిప్రాణం మీద గుచ్చిన
విషం పూసిన గుండుసూదిలా!

శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి

శ్రీ బెల్లంకొండ రమేష్‌చంద్రబాబు

# దంతవరపు కోటయే ప్రాచీన దంతపుర నగరము

దంతవరపుకోట శ్రీకాకుళం జిల్లాలో ఆముదాల వలస నుండి హీరమండలం పోయే మార్గంలో రొట్టవలస గ్రామానికి చేరువలో ఉన్నది. నేడు దంతవరపు కోటగను దంతవక్రుని కోటగను పిలువబడుతున్న ప్రాంతమే తూర్పు గంగుల తొలి రాజధానీ నగరము దంతపురమని, పురాణాలు, జాతక కథలు, తామ్రశాసనాల ఆధారంతో చారిత్రకులు పేర్కొనడం జరిగింది. అలా పేర్కొన్న చారిత్రకులు ఎవరూ దంతవరపు కోట ప్రాంతాన్ని స్వయంగా దర్శించి ఆ ప్రాంతాన్ని గూర్చి వివరించలేదు. కాని నేడు కోట లోపల భూమిపై లభిస్తున్న శిల్పావశేషములను, భూమి పొరలలో లభిస్తున్న అతి ప్రాచీన కుండ పెంకుల ఆధారంతో జాతక కథలలో, శాసనాలలో పేర్కొనబడిన ప్రాచీన నగరము దంతపురమే ఈ దంతవరపు కోట అని నిరూపించుటయే ఈ వ్యాసోద్దేశము. అయితే నేడచట లభిస్తున్న ఆధారాలను విశ్లేషించేముందు దంతపురమును గురించి కొంత ఇక్కడ వివరించాల్సిన అవసరముంది.

దంతవరపు కోట మహాభారతంలో దంతకురముగను, బౌద్ధజాతక కథలలో దంతపురముగను, తూర్పు గంగుల తామ్ర శాసనములలో దంతాపురముగను పేర్కొనబడినది.

మహాభారతంలో రెండుమార్లు కళింగ ప్రస్తావన జరిగినది. కళింగలోని దంతకురమును పాలించే దంతవక్రుని శ్రీకృష్ణుడు సంహరించినట్లుగా మహాభారతంలోని ఉద్యోగపర్వంలో చెప్పబడింది.[1] స్థానికులు ఈ భారతగాథనే చెబుతూ ఈ కోటను దంతవక్రుని కోటగా నేటికి పిలుస్తుండటం గమనార్హం.

బౌద్ధజాతక కథలలో దంతపుర ప్రస్తావన పలుమార్లు జరిగినది. దంతపురమును పురాతనకాలంలో బ్రహ్మదత్తుడు పరిపాలించునపుడు ఖేమథేర అనే బౌద్ధాచార్యుడు బుద్ధుని ఎడమ దవడ కోరపంటిని కళింగరాజుకు ఇచ్చెననియు, దానిని దంత కుమారుడు సింహళమునకు తీసుకొని వెళ్ళువరకు అది కళింగ సీమలోనే ఉన్నదనియు బౌద్ధగాథలు తెలుపుచున్నవి.[2] మరియొక కథ ప్రకారము బుద్ధుని ధాతువును స్తూపమందుంచి నిర్మించబడుట వలన ఇది దంతపురమయినదని తెలుస్తున్నది.

క్రీ.శ. 7వ శతాబ్దంలో హుయాన్‌త్సాంగ్ కళింగను దర్శించి నాటి బౌద్ధమత పరిస్థితిని గురించి వివరిస్తూ, రాజ్యం యొక్క భౌగోళిక వర్ణన కూడా చేసినాడు. కళింగ రాజ్యం '500 లి'ల విస్తీర్ణంలో ఉంటుందని, కళింగ రాజధాని యొక్క విస్తీర్ణం '20 లి'లని పేర్కొన్నాడు.[3] కాని దంతపురమును గూర్చి పేర్కొనలేదు. ఆర్. సుబ్రహ్మణ్యంగారు, ప్లినీ పేర్కొన్న 'దండగుడ' లేద 'దండగుల'యే కళింగ రాజధాని దంతపురమై ఉండవచ్చునన్నాటు.[4]

ముప్పైకి పైగా ఉన్న ప్రాచీన తూర్పుగంగుల తామ్ర శాసనములు గంగశకాన్ని రాజులు వారి దానధర్మాలను ఉదహరిస్తున్నవి. కాని నాటి రాజకీయ విశేషాలను వెల్లడించడంలేదు. అయినా దంతపురము, శాసనములలో దంతాపురముగ పలుమార్లు ప్రస్తావించడం జరిగింది. ఆచార్య మిరాషి గంగశకం క్రీ శ. 498/9లో ప్రారంభమయినదని నిర్ణయించారు.[5] కనుక గంగరాజ్య స్థాపన అదే సంవత్సరంలో దంతపురంలోనే జరిగినదని చెప్పవచ్చును.

కళింగగంగ వంశానికి మూలపురుషుడు మొదటి ఇంద్రవర్మ. ఇతడు క్రీ.శ. 498/9 ప్రాంతములో దంతపురము రాజధానిగ రాజ్యం స్థాపించినాడు.[6] తరువాత రెండో ఇంద్రవర్మ కాలంలో రాజధాని దంతపురమునుండి కళింగనగరమునకు అనగా శ్రీముఖలింగమునకు మార్చబడినది.[7] శ్రీముఖలింగమే కళింగగంగుల మలి రాజధాని అనుటకు జి వి. రామమూర్తిగారు చక్కటి వివరణ ఇచ్చారు. ముఖలింగం శాసనములలో మధుకేశ్వరుని "కళింగావని

నగరే శ్రీ మధుకేశ్వరాయ" అని వర్ణించుటనుబట్టి ముఖలింగం-నగరికటకములున్న ప్రాంతమే గంగుల మలి రాజధానియని నిర్ధారించిరి.[8] దీనినే హర్ష్[9], వి. ఎ. స్మిత్[10], ఆర్. డి. బెనర్జి[11], ఆర్. సుబ్బారావు[12], బి. యస్. యల్. హనుమంతరావు[13], కె. సుందరం[14]గారలు కూడ సమర్థించియున్నారు.

అయితే గంగుల తొలి రాజధాని దంతపురమని పైన పేర్కొన్న చరిత్రకారులలో ఎక్కువమంది అంగీకరిస్తున్నారాళ్ళబండి సుబ్బారావుగారు సహేతుకంగా నిరూపించడం జరిగింది.[15] కాని దంతపురము ఎంతకాలం గంగుల రాజధానిగా కొనసాగిందో నిర్ణయించడం ప్రస్తుతం లభిస్తున్న శాసనాధారములతో వివరించడం సాధ్యం కాదు. అయినా రెండో ఇంద్రవర్మ క్రీ.శ. 6వ శతాబ్దం చివరివరకు దంతపురంనుండే పరిపాలించి ఆ తరువాత రాజధానిని ముఖలింగమునకు మార్చినట్లుగ చెప్పబడింది. అయితే అనంతవర్మ చోడగంగుని తామ్రశాసనాలలో పేర్కొనబడిన వంశవృక్షాన్ని పరిశీలించినట్లయితే మొదటి కామార్ణవుడు కళింగను పాలించే శబరాధిత్యుని జయించి, దంతపురమును రాజధానిగ చేసుకొన్నాడని, మహేంద్రగిరి గోకర్ణస్వామి కటాక్షంతో శంఖము, చక్రము, భేరీ, చామరములను పొందినట్లు తెలుస్తున్నది. ఈతడి తరువాత కొద్దికాలానికి రాజ్యానికి వచ్చిన రెండో కామార్ణవుడు రాజధానిని దంతపురం నుండి ముఖలింగంనకు మార్చినట్లు అచట మధుకేశ్వరునికి దేవాలయం నిర్మింపజేసినట్లు తెలుస్తున్నది.[16]

తొలి గంగుల శాసనములలో పేర్కొన్న ఇంద్రవర్మలకు, అనంతవర్మ చోడగంగుడు వంశవృక్షంలో పేర్కొన్న కామార్ణవులకు చాలా పోలికలున్నాయి. గంగులకు బిరుద నామాలతో శాసనాలు ఇవ్వడం పరిపాటే కనుక ఇంద్రవర్మ అను నామము కామార్ణవునకు బిరుదు నామమై ఉండవచ్చు - వారు బిరుద నామములతోనే తామ్రశాసనములు జారీచేసి వుండవచ్చును. కాని ఈ విషయంలో చరిత్రకారులలో భిన్న అభిప్రాయాలున్నాయి. ఏదిఏమైనా క్రీ.శ. 5వ శతాబ్ది చివరిభాగంలో గంగులు రాజ్యం స్థాపించిన నాటినుండి 6వ శతాబ్దం చివరివరకు దంతపురమే గంగుల రాజధానిగా కొనసాగినదనుటలో ఎట్టి సందేహము లేదు. కాని పరలా మూడవ వజ్రహస్తుని తామ్రశాసనం, క్రీ.శ. 1045లో దంతపురంనుండి వెలువడుటను బట్టి దంతపురం గంగుల రెండో రాజధానిగానో లేక ముఖ్యనగరంగానో కొనసాగి వుండవచ్చును.[17] అయితే అనంతవర్మ చోడగంగుడు ఉత్కళను ఆక్రమించి రాజధానిని కళింగనగరము (ముఖలింగం) నుండి వారణాసి కటకం (కటక్)నకు మార్చడంతో[18] కళింగ నగరముతోపాటు దంతపురము కూడ తన ప్రాభవాన్ని కోల్పోయి ఉండవచ్చును.

ఇప్పటివరకు వివరించిన చారిత్రక విశేషాలనుబట్టి దంతపురము ఆంధ్రదేశములోని ప్రాచీన నగరములతోబాటు ప్రసిద్ధి బడసినదని తెలియుచున్నది. కాని ఎందుచేతనో చరిత్రకారులు, పురాతత్వ శాఖవారు ఈ ప్రాచీన ప్రదేశాన్ని గూర్చిన సమగ్రమైన విషయసేకరణకు ఇంతవరకు ప్రయత్నించలేదు.

దంతవరపు కోట వంశధారానదికి అతి చేరువులో ఉన్నది. కోటకు, చుట్టూవున్న పంటభూములకు నీరందించే పైలాడ సరస్సు కొన్ని వందల ఎకరాలకు విస్తరించి కోటకు దాపునే ఉంది. కోటకు పది కిలోమీటర్ల వైశాల్యంలో ఎక్కడ చూసిన పాటిమన్నుతో నిండిన గ్రామాలు, పొలాలు కన్పిస్తాయి. కోట ఉన్న పరిసరములను, కోట లోపల కానవచ్చిన శిల్పావశేషములను పరిశీలించినచో ఇచ్చట కొన్ని వందల సంవత్సరములపాటు నాగరిక జీవనము కొనసాగినట్లుగా తెలియుచున్నది.

రమారమి 4 చ॥కి.మీ. విస్తీర్ణములో[19] వ్యాపించియున్న కోట లోపలి ప్రాంతమును పరిశీలించినచో, కోటచుట్టూ దాదాపుగా 20 అడుగుల ఎత్తుగ మేటవేసిన మట్టిగోడ, దానిచుట్టూ కందకము కలవు. కోట మధ్యనుండి పురుషోత్తమపురము పోవుటకు ప్రాచీన మార్గమున్నది. కాని ఈ మధ్యకాలంలో తారురోడ్డు వేయు నిమిత్తము మట్టి కోటగోడ వందగజాల మేరకు త్రవ్వివేసినారు. (ఛాయాచిత్రము-1). ఇక కోట లోపలి ప్రాంతమంతా పంట పొలాలుగా మార్చివేయబడినది. అక్కడక్కడ త్రవ్వబడ్డ చెఱువులు, నూతుల సహాయంతో రైతులు మెట్ట సాగు చేసుకొంటున్నారు పాటిమన్నుతో నిండియున్న పొలాలలో ఎక్కడ చూసిన కుండ పెంకులు, ఇటుకరాళ్ళ ముక్కలు కన్పిస్తున్నాయి. కోట లోపలి తూర్పు ప్రాంతం మాత్రం మిగతా ప్రాంతంకంటె ఎత్తుగా ఉన్నది. నేడు కోటలో పైకి ఎటువంటి కట్టడములు కానవచ్చుటలేదు. కాని కోట లోపల ఆరు ప్రాంతాలలో కనిపిస్తున్న శిల్పావశేషములను ఒక్కొక్కటిగా పరిశీలించుదాం.

1. కోటలో ఆగ్నేయమూల శిథిలమై కొండరాళ్ళ గుట్టగా మారిపోయిన ప్రాంతమును స్థానికులు సామాలమ్మ గుడిగా పిలుస్తున్నారు. ఇచ్చట రెండు దేవీ ప్రతిమలు, మూడు వీరుళ్ళ

విగ్రహములు వరుసగా పేర్చబడి నేటికి పూజలు అందుకుంటు న్నాయి.

చాముండి : (ఛాయాచిత్రము-2)

నడుమవరకు విరిగిపోయి ఖండికలైన చాముండి విగ్రహము అన్నింటికంటె పెద్దది. ఆ దేవి చతుర్భుజములతో 'కపాల మకుటము'తో నున్నది. కంఠాభరణములు, దండాభరణములు, కపాలములతో కూడిన యజ్ఞోపవీతమునుబట్టి, ఈ దేవిని మత్స్య పురాణములో పేర్కొనబడిన 'చాముండి' లేదా శక్తిగా గుర్తించ నగును.[20] ఇక్కడి భూముల్లో 'సామలు' (మెట్టపైరు) అనే ధాన్యం పండుటచేత ఈ దేవిని సామాలమ్మగా కొలుస్తున్నారు. శ్యామలమ్మగా పిలువబడి కాలాంతరాన సామాలమ్మగా మారి యుండవచ్చును. అయితే ఆంధ్రదేశంలో ఈ మాదిరి విగ్రహము ఇంకెచ్చటనూ వెలుగులోకి రాలేదు.

మహిష మర్దని : (చిత్రము-3)

2x3 అడుగుల రాతిఫలకముపై మలిచిన మహిష మర్దని విగ్రహము అష్టభుజములతో, కిరీట ముకుటంతోను, కంఠాభరణములు, కర్ణాభరణములు, కటి వస్త్రాభరణములు, కాళ్ళకు చేతులకు కడియములతో, కుచబంధంతో చాలా అందంగా మలచబడినది. అష్టభుజములలో శంఖం, ధనస్సు, ఖేటకం, ఎడమ చేతులలోను, చక్రము, ఖడ్గము, బాణము కుడి చేతులలోను ధరించి యుండగా ముందు చేతులలో కుడిచేయి అభయముద్రలో, ఎడమ చేయి కాట్యావలంబిత ముద్రలోను ఉన్నట్లుగా కన్పించుచున్నది. కుడి పాదము మహిష శిరముపై ఉండగా, ఎడమపాదము ద్విదళ పద్మముపై నున్నది. విగ్రహమునకు ఎడమప్రక్క క్రిందిమూల సింహముఖము చెక్కబడినది. అయితే మహిషమర్దని విగ్రహములలో ఎక్కడ కానరాని విశేషం ఏమంటే విగ్రహమునకు కుడి ప్రక్క 'జింక' నిలబడినట్లుగ మలచబడుట. గంగశైలిలో ఇంత చక్కగా మలచబడిన మహిషమర్దని విగ్రహములను కళింగసీమలో అరుదుగా చూస్తాము.

వీరుళ్ళు : ఇక మూడు వీరుళ్ళ విగ్రహములు గంగ శైలిలో మలచబడినాయి. అయితే వీటిలో వీరంగం ఆడుతున్న చెన్నవీరుడి విగ్రహం చెప్పుకోదగ్గ రీతిలో మలచబడినది.

జైనముని అజితనాథుడు : (చిత్రము-4)

(2) కోట తూర్పుగోడ మధ్య పైభాగాన తపోముద్రలోనున్న జినవిగ్రహము (2.3 అడుగులx4.4 అడుగులు) దీర్ఘ చతురస్రపు ఇసుకరాతి ఫలకంపై చెక్కబడినది. రాతి లోపంవలన విగ్రహం చాలాభాగం పాడయినది. పద్మాసనంలోనున్న జైన ముని తలపై ఛత్రము, తలకు అటు నిటు యక్షులు కానవస్తున్నారు. దిగువనున్న పీఠమునకు ఇరువైపుల సింహములద్వయం స్పష్టంగా కన్పిస్తున్నాయి. కాని వాటి వెంటే నడుమనున్న భాగము కొంత పాడయినను, సింహాసనముయొక్క వంకర తిరిగిన ముందు కాళ్ళు, వాటి నడుమ ఏనుగు నడుమ భాగం వరకు మాత్రమే కన్పిస్తున్నాయి. 'ఏనుగు' లాంఛనమును బట్టి దీనిని జైన తీర్థంకరుడైన అజితనాథుని ప్రతిమగ గుర్తించ వచ్చును. 24 తీర్థంకరులలో రెండవవాడైన అజితనాథుని గురించి ఋగ్వేదం, యజుర్వేదములలో ప్రస్తావించబడినది.[21] ఈ ప్రాంతానికి చేరువలోనే ఉన్న సంగమయ్యకొండ, పొత్తంగిలలో లభించిన జైన తీర్థంకరుల విగ్రహముల శిల్పశైలిలోనే ఈ విగ్రహము కూడా మలచబడినది. అంతేకాక ఆంధ్రదేశంలో పార్శ్వనాథుని, మహావీరుని ప్రతిమలే ఎక్కువగ కన్పిస్తుండగా, ఇక్కడ అజితనాథుని విగ్రహము లభ్యం కావడం చెప్పుకోదగ్గ విశేషమే. ఈ విగ్రహమున్న దిబ్బమీద ప్రాచీన ఇటుకరాళ్ళ పునాదులు కన్పించుటనుబట్టి ఇక్కడ జినస్తూపమో, చైత్యమో ఉండే అవకాశమున్నది. హుయాన్‌త్సాంగ్ సందర్శించేనాటికి కళింగసీమలో బౌద్ధం క్షీణదశలో ఉన్నదని కాని 100 'దేవ' ఆరాధన ప్రాంతాలు ఉన్నట్లుగా తెలుస్తున్నది.[22] 'దేవ' ఆరాధనా స్థలాలు అంటే జిన ఆలయాలేనని చారిత్రకుల అభిప్రాయం. కనుక ఇచ్చట అజితనాథుని చైత్యాలయము హుయాన్‌త్సాంగ్ దర్శించేనాటికే ఉండిఉండవచ్చును. దీనినిబట్టి, తొలి గంగరాజులు తామ్రశాసనములలో గోకర్ణేశ్వరుని ప్రస్తావన చేయకపోవడాన్ని బట్టి వారు రాజ్యానికి వచ్చిన తొలిదశలో జైనమతాన్ని ఆదరించి నట్లుగా విదితమవుతున్నది.

అయితే సింహాసనము, ఏనుగు బుద్ధునికి కూడ సంకేతాలుగ ఉపయోగించే అవకాశం లేకపోలేదు. అదీకాక అజితనాథునికి ఏనుగు మాత్రమే లాంఛనముగాని సింహాసనము కాదు. కాని దగ్గరలోనే ఉన్న బౌద్ధక్షేత్రం శాలిహుండంలోగాని[23], భారత దేశంలో ఇప్పటివరకు లభించిన బుద్ధప్రతిమల పీఠభాగంలోగాని ఈ మాదిరి లాంఛనములు కన్పించకపోవడంతో దీనిని జిన ప్రతిమగ భావించడమైనది. ఈ సమస్యకు పెద్దలు తగిన మార్గం చూపించగలరని ఆశిస్తున్నాను.

3) కోట మధ్యభాగాన పానవట్టరహిత శివలింగము కొద్దిగ ఎత్తైన ప్రాంతంలో సగం వరకు భూమిలోకి దిగబడి ఉన్నది. (చిత్రము-5)



1. తారురోడ్డు ప్రక్కనే కన్పిస్తున్న కోట గోడ ఎత్తు



2. చాముండి - సామాలమ్మ



3. మహిషమర్ధని



4. జైనముని అజితనాథుడు



5. శివలింగము

6. గోపురం యొక్క అమలభాగం





7. నూతిలో కన్పిస్తున
పాటిమట్టి పొరలు

4) పై ప్రాంతానికి కొద్దిదూరంలో దక్షిణంగా ఎత్తైన భాగంలో గంగశైలిలో ఉన్న గోపురంయొక్క 'అమల' భాగం మాత్రం భూమిలో కూరుకొనిపోయి కన్పిస్తున్నది. (చిత్రము-6)

5) పైన పేర్కొన్న ప్రాంతానికి ఉత్తరదిశలో దీర్ఘ చతురస్రాకారపు మెరకభాగంలో తూర్పుదిశవైపుకు తిరిగి ఉన్న చిన్న నంది విగ్రహము కన్పిస్తున్నది. అయితే శివలింగం, అమలభాగం, నంది విగ్రహము ఉన్న ప్రాంతాలు దగ్గర దగ్గరగా ఉండుటనుబట్టి మూడు ఒకే ఆలయమునకు చెందినవిగా భావించవచ్చును.

6) కోట గోడకు ఉత్తరాన దండుదారికి ప్రక్కనే 20 అడుగుల ఎత్తులో, కోటగోడ పైభాగాన శివాలయం పునర్నిర్మింపబడినది. ఆలయంలో ప్రాచీన శివలింగము పానమట్టం లేకుండా సిమెంటు నేలలో అమర్చబడి నేటికి పూజ లందుకొంటున్నది. ఆలయం దిగువన చుట్టూ ప్రాచీన ఇటుకరాళ్ళ కట్టడమున్నది.

ఇంతవరకు కోటలో భూమిపై కన్పిస్తున్న శిల్పావశేషములను బట్టి జైన, హిందూ దేవతారాధన, ముఖ్యంగా శక్తి, శైవారాధనలు జరిగినట్లుగ తెలియవస్తున్నది. ఈ జిన ప్రతిమ సంగమయ్య కొండలోనున్న జినప్రతిమలకంటే ప్రాచీనమైనదిగ తెలుస్తున్నది. కనుక క్రీ.శ. 6-7 శతాబ్దులనాటికీ పొత్తంగి, సంగమయ్య కొండలతోబాటుగా దంతపురములో కూడ జైనం ఉన్నదని చెప్పవచ్చును. మిగిలిన హిందూదేవతా విగ్రహములు క్రీ.శ. 12, 13 శతాబ్దంనాటి గంగశిల్పశైలిలో ఉన్నవి. కాబట్టి దంతపురము క్రీ.శ. 6వ శతాబ్దంనుండి 13వ శతాబ్దం వరకు ప్రసిద్ధ నగరంగా, కొంతకాలం రాజధానిగా కూడ కొనసాగినట్లు చెప్పవచ్చును.

అయితే పైభాగాన లభించిన ఆధారాలనుబట్టి క్రీ.శ. 6వ శతాబ్దినాటికే ప్రాచీన నగరమున్నదని చెప్పడం జరిగినది. కాని అశోకుని కాలంనాటికే గొప్ప నగరంగా ఉన్నదని చెప్పుటకు కోట లోపల భూమి అడుగు పొరలలో చాలా అనువైన ఆధారం దొరికింది. కోట లోపల సేద్యం కోసం రైతులు త్రవ్విన నూతులనేకం ఉన్నాయి. వివిధ ప్రాంతాల్లో తీసిన నూతుల లోపలి గోడలయొక్క పాటిపన్ను పొరల మందంలో ఎటువంటి తేడా లేదు. దాదాపుగా 15 నుండి 20 అడుగుల మందంతో పాటిపన్ను పొరలు కన్పిస్తుంటాయి. అవి అన్నీ కూడ వివిధ రకాలయిన కుండ పెంకులతో కూడుకొని ఉన్నాయి. రైతులు నూతులు త్రవ్వుతున్నపుడు అనేక రకాలయిన కూజాలు, మట్టిపాత్రలు, నాణెములు లభ్యమవుతున్నట్లు చెప్పారు. అయితే నేనా ప్రాంతాన్ని సందర్శించినపుడు పురుషోత్తమపురం వెళ్ళే రోడ్డుకు ఎడమప్రక్క పొలంలో నూయి త్రవ్వుతున్నారు. పరీక్షార్థం నూతిలోకి దిగి అడుగు పొరలలోనే కుండ పెంకులను కొన్నింటిని సేకరించి, వాటిని పరిశీలించగా - అందులో కొన్ని మెరుపుతో ఉన్న నల్లని కుండపెంకులు (నార్తరన్ బ్లాక్ పోలిషడ్ వేర్) ఉన్నాయి. ఉత్తర భారతదేశంలో క్రీ.పూ. 6వ శతాబ్దం నుండి నల్ల మెరుపుగల కుండలు, ముఖ్యంగా ధనవంతులు మాత్రమే ఉపయోగించేవి వాడుకలో ఉన్నట్లుగా పురాతత్త్వ శాస్త్రవేత్తలు నిర్ధారించియున్నారు. ఉత్తరభారతంలో మౌర్యపాలిత ప్రాంతాల్లో అవి ఎక్కువగా లభ్యమవుతున్నాయి. ఒరిస్సాలో శిశుపాల్‌ఘర్ లోను, ఆంధ్రలోని అమరావతి, చేబ్రోలులలో మాత్రమే అలాటివి లభించాయి.[24] కాబట్టి అశోకుని కళింగ దండయాత్రానంతరం ఈ పాత్రల వాడకం శిశుపాల్‌ఘర్‌లోను, దంతపురంలోను జరిగి వుండవచ్చును. అయితే ఈ మెరుపుతో వున్న నల్లని కుండ పెంకులతోపాటు, రౌలెటెడ్ వేర్, నలుపు-ఎరుపువి (బ్లాక్ అండ్ రెడ్ వేర్), నల్లనివి, ఎర్రనివి కూడా ఆ నూతులయొక్క గోడల పొరలలో లభించాయి. (చిత్రము-7)

శిలాశాసన, నాణె సంబంధమైన ఆధారములు ప్రస్తుతం అక్కడ లభ్యం కాకపోయినప్పటికి మట్టి అడుగు పొరలలో లభించిన ప్రాచీనమైన కుండపెంకులనుబట్టి భూమి పైభాగాన కానవస్తున్న శిల్పావశేషాలనుబట్టి దంతపురము క్రీ.పూ. 3వ శతాబ్దినుండి క్రీ.శ. 13వ శతాబ్దం వరకు మతపరంగా, రాజకీయపరంగా గొప్ప నగరంగా విలసిల్లినదని చెప్పవచ్చును. కాబట్టి ఇతిహాసాలలోను, బౌద్ధ జాతక కథలలోను, శాసనములలోను పేర్కొనబడిన దంతపురము ఈ దంతవరపు కోటయేనని నిర్ధారించవచ్చును.

పురాతత్వ శాఖవారు తగిన శ్రద్ధ తీసుకొని ఈ ప్రదేశంలో త్రవ్వకము నిర్వహించినచో ఈ నిర్ణయమును బలపరచు చారిత్రక అవశేషములు అనేకం బయల్పడగలవు.

**అధోజ్ఞాపికలు :**

1) జె. ఎ. హెచ్. ఆర్. ఎస్. 4, పార్ట్ 2, -పేజి. 73.
2) విజ్ఞాన సర్వస్వము, పే. 175, ధర్మనారాయణ్ దాస్, 'ది ఎర్లీ హిస్టరీ ఆఫ్ కళింగ', -పే. 10.
3) ఆర్. సుబ్రహమణ్యం, 'సాలిహుందం, ఎ బుద్ధిస్ట్ సైట్ ఇన్ ఆంధ్రప్రదేశ్', -పే. 13.
4) పై మాదిరి, పే. 14.
5) ఎపిగ్రాఫియా ఇండిక. 26, -పే. 326; 27, -పే. 192.
6) జె. ఎ. హెచ్. ఆర్. ఎస్. 3, -పేజీలు. 49-53.
7) పై మాదిరి. -పే. 53.
8) పై మాదిరి. 4, పార్ట్ 1. -పే. 58.
9) ఎపిగ్రాఫియా ఇండిక. 9, పేజీలు. 94-98; 17, -పేజీ. 232.
10) వి. ఎ. స్మిత్, 'ఎర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా', -పే. 498.
11) ఆర్. డి. బెనర్జి, 'హిస్టరీ ఆఫ్ ఒరిస్సా', -పే. 142.
12) జె. ఎ. హెచ్. ఆర్. ఎస్. 4, పార్ట్ 2, -పేజి 73
13) బి. యస్. ఎల్. హనుమంతరావు, 'ఆంధ్రుల చరిత్ర', -పే. 79.
14) కె. సుందరం, 'ది సింహాచలం టెంపుల్', -పే. 12.
15) జె. ఎ. హెచ్. ఆర్. ఎస్. 4, పార్ట్ 2, -పేజీలు. 71-73.
16) ఎపిగ్రాఫియా ఆంధ్రిక. 4, నెం. 6, -పే. 34.
17) సి. డి. నెం. 16 ఆఫ్ 1908-1909.
18) కె. సుందరం, 'ది సింహాచలం టెంపుల్' -పే. 17; జె. ఎ. హెచ్. ఆర్. ఎస్. 7, -పే. 75.
19) ఎ. ఎల్. బాషమ్, 'ది వండర్ దట్ వజ్ ఇండియా', పే 202, ప్లేటు. 6ఎ. అర్థశాస్త్రములో పేర్కొనబడిన విధంగా శిశుపాల్‌ఘర్ కోట నలుచదరముగ ఎటు చూసినా ఒక మైలు పొడవు ఉన్నది. అదేవిధంగా దంతవరపు కోట నిర్మాణం జరిగివుండవచ్చును.
20) భగవంత్ సహాయి, "....ఐకనోగ్రఫి", -పే. 198; యస్ నాగేశ్వరరావు, 'టెంపుల్ ఆఫ్ టిక్కావోలు' -పే. 183 (అముద్రిత సిద్ధాంత వ్యాసం)
21) బి. సి. భట్టాచార్య, 'ది జైన ఐకనోగ్రఫి', పేజి. 22; బి. యస్. ఎల్. హనుమంతరావు, 'రెలిజియన్ ఇన్ ఆంధ్ర', -పేజీ. 139.
22) కె. ఆర్. సుబ్రహమణియన్, 'ది ఎర్లీ రెలిజియస్ హిస్టరీ ఆఫ్ కళింగ', -పే. 52.
23) ఆర్. సుబ్రహమణ్యం, 'శాలిహుందం, ఎ బుద్ధిస్ట్ సైట్ ఇన్ ఆంధ్రప్రదేశ్', పేజి. 95, ప్లేటు. 30.
24) ఆర్. ఎస్. శర్మ, 'ఏన్షియంట్ ఇండియా', చాప్టర్ 12, -పే. 79.


# 'దరలు'


## శ్రీ శేషం లక్ష్మీనారాయణాచార్యులు


సామాన్యుడి అంతరంగానికి
అంతుపట్టక
నింగిలో వెలిగే తారకలు
దట్టంగా మబ్బులు ముసిరినా
భువి రాలని
(మేఘపు) చినుకులు
నవ వధువుల ఊహాహర్మ్యాలను
కూలదోసే
పెరుగుతున్న వరకట్నపు చారలు
చాలీచాలని జీతంతో
సతమతమౌతూ
చిరుద్యోగులు కొనాలనుకునే
నిత్యావసర వస్తువులనే
అగ్ని కణాలు
అలసట కనిపించనీయకుండా
అవిశ్రాంతంగా
శ్రమించినా
ఒక్కపూటైనా
కడుపునిండా దొరకని మెతుకులు.
పిపాసార్తులకు
అనతిదూరంలో
జలంలా కనబడే
ఎండమావులు
అనుక్షణం
సగటు మనిషి కందకుండా
ఆకాశ పందిరికలో
విహరించే దరలు.

# ఉంగరం

ఐరిష్ మూలం :

## బ్రయాన్ మాక్ మెహెూన్

తెలుగు అనువాదం

## కె. సుబ్రహ్మణ్యం

నా చదువు కొనసాగుతున్న రోజుల్లో వేసంగి శెలవలకి మా అమ్మమ్మవాళ్ళ ఊరుకి ఉడాయించేవాణ్ణి. మా తాతయ్యని ఎరగను.

కిఖాన్ కొండ ప్రదేశంలో టిప్పెరరి పల్లె వుంది. కొండ దిగువన. అమ్మమ్మ ఇల్లు, ఫారమ్ వున్నాయి. పుష్కలంగా లభ్యమయ్యే సూర్యకాంతివల్ల అక్కడి ప్రకృతి పచ్చదనం నేత్ర పర్వంగా కన్పట్టుతుంది. అందుకే ఆ ప్రాంతం అంటే నాకు చాలా యిష్టం.

సముద్ర తీరానికి దగ్గర్లో కెర్రీ అనే మా గ్రామం వుంది. గ్రామానికి చెందిన డజను ఫారాల్లోని పచ్చదనమంతా మా అమ్మమ్మ పల్లెలోని రోడ్డుప్రక్కల వంద గజాల పరిధిలో పిచ్చిగా పెరిగే పచ్చిక మైదానాల పచ్చదనంతో సరితూగదు. అదంతా వట్టిపోతుందే! అని బాధపడేవాణ్ణి.

కాన్ మామయ్యకు మా అమ్మమ్మ మాట వేదవాక్కు. ఫారం పెత్తనమంతా అమ్మమ్మే చూసుకుంటుంది. మామయ్యకి పెళ్ళయింది. ఓ కూతురు. ఆనీ అత్తయ్య నెమ్మదస్తురాలు. తనకంటూ పెత్తనాల బరువు, బాధ్యతా లేనందుకు అదృష్టవంతురాలిననుకుంటుంది ఆ అమాయకురాలు.

అమ్మమ్మ ఆరుగురు సంతానంలో అయిదుగురు అమ్మాయిలు. ఓ అబ్బాయి. వాళ్ళ చిన్నతనంలోనే తాతయ్య పోయాడు. అలాంటి విపత్కర పరిస్థితుల్లో అమ్మమ్మ తన గుండె రాయి చేసుకుని, ఎన్నో గడ్డు సమస్యల్ని ఎదుర్కొని, ఆర్థిక యిబ్బందుల్ని దాటుకుంటూ తన సంతానాన్ని సాకింది. రేసు గుర్రాల్ని అదుపులో పెట్టటానికి ఉపయోగించే చిన్నతరహా బెత్తం, చేపల్ని పట్టే గాలం వంచినా విరగవు. వాటి ప్రయోజనాలు విలువైనవి. రివటలా పొడవుగా వున్న అమ్మమ్మను వీటితో పోల్చవచ్చు.

ఆవిడ ఎప్పుడూ గంభీరంగా, ముఖంలో కరుకుదనంతో కనబడేది. ఆవిడకి నేనంటే వాత్సల్యం, ప్రేమ లేకపోలేదు. నవ్వు ఎరగని అమ్మమ్మను ఓతూరి నవ్వించగలిగాను. అదెలా జరిగిందంటే—

ఓ రోజున ఓ ఆసామీ తారసపడి నన్ను ఎగా దిగా చూసి— "మార్టిన్ డెర్ మొడీగారి మనవడివి నువ్వేనా?" అడిగాడు.

"ఔను." - గర్వంగా తెలూపాను. నాకో షిల్లింగ్ నాణెం ఇస్తూ—

"నీ పేరు మీ తాతయ్యగారి పేరేనా?" అన్నాడు

"కాదు. మా మామయ్య పేరే."

ఆ సంగతి అమ్మమ్మ విని మనసారా నవ్వింది. కాన్ మామయ్య సంతోషం పట్టలేక రెండు చేతుల్లో నన్ను పైకెత్తి గిర గిర తిప్పాడు. నా జుట్టు చెరిపేసి, 'రాస్కెల్' అని మురిపంగా పిలుచుకున్నాడు.

అలా వుండగా - ఓ సంఘటనవల్ల అమ్మమ్మ తనలోని ఉద్రిక్తస్థితిని ఆపుకోలేనంత ఆర్భాటం చేసేసింది ఓనాడు. కొడుకు, కోడలు, మనవడు ఎదురుగ్గానే వున్నారని, యుక్తాయుక్తాలు ఆలోచించుకోవాలనీ ఆవిడకి తట్టివుండదు. ఇప్పుడు తలుచుకుంటే అదో సిగ్గుమాలిన పని అని - అంతలో - కాదు, అదో మనస్సు ద్రవించే సంఘటన తప్ప మరేమీకాదు అని సరిపెట్టుకుంటుంటాను.

గడ్డి కోతల పని ప్రారంభమైంది. గుర్రపుబండిమీద గడ్డిమోపులు ఏపుగా పేర్పించి కళ్ళెంపట్టి గుర్రాన్ని నడిపిస్తున్నాడు మామయ్య. బండి వెనకాతల కాళ్ళు కిందకి వేలాడేసి కూర్చుని వెనక్కి వెళుతున్నట్టున్న ఫారాన్ని, బండి చక్రాల వత్తిడిలో ఏర్పడిన రిబ్బన్లలాంటి సన్నదారుల్ని చూస్తున్నాను.

ఇంటివెనక గోదాము ముందు బండి ఆపాడు మామయ్య. గోదాములో మోపులు పేర్చటానికి అనువుగా వరసగా గుంజలున్నాయి. అప్పటికే సగం గోదాం నిండిపోయి వుంది. ఓ మోపుపైన అమ్మమ్మ కూర్చుని ఫోర్క్ కర్రతో దూది పింజల్లాంటి తేలిక పరకల్ని విడదీస్తోంది. ఓ పనివాడు నేలనుండి చిన్న మోపులెత్తి పైకి అందేలా ఒడుపుగా విసురుతున్నాడు.

చప్పున అమ్మమ్మ చేస్తున్న పని కాస్తా వదిలేసి కిందకి దిగి పనివాళ్ళని బయటికి పంపించేసింది. బయట చేతులు పిసు

కుక్కుంటూ వాళ్ళు నిల్చుండిపోయారు. ఒక్కొక్క మోపుని తడుముతూ దేనికోసమో వెతుక్కుంటోంది అమ్మమ్మ. బండి మీంచి మోపుల్ని దింపే ప్రయత్నంలో వున్న తన కొడుకుతో—

"ఆ పని కాస్తా ఆపరా!- నా ఉంగరం ఎక్కడో పడిపోయింది!" అంది దిగాలుగా.

పెళ్ళి ఒప్పందం చేసుకున్నప్పుడు ఆవిడ తాతయ్యతో మార్చుకున్న ఉంగరం.

"గడ్డిలో జారి పడిపోయిందా?"

"అవున్రా."

"ఉంగరం జారకుండా పెట్టుకున్న కీపర్ - రింగు మాటేమిటి?"

"అదీ పోయింది! నా చేతివేళ్ళు బాగా సన్న బారిపోయాయి మరి."

"ఏదైనా కీడు శంకించుతున్నావా అమ్మా?" - ఆదుర్దాగా అడిగాడు మామయ్య. మధ్యలో పని ఆగిపోయినందుకు అతడికి కించగానే వుంది.

అమ్మమ్మనుండి జవాబు రాలేదు. ఇందాకటి మోపువంక గుర్రుగా చూస్తూ పైకి అంది—

"ఆ తట్టునే జారి పడివుంటుంది."

పేర్చిపెట్టిన మోపులన్నీ తిరగవేసి వెతకాలన్నమాట

"ఇంకా బోల్డు పని మిగిలివుంది. ఎలా?" - అన్నాడు మామయ్య బుర్ర గోక్కుంటూ.

అమ్మమ్మ లక్ష్యపెట్టలేదు. పనివాళ్ళని కేకేసి మోపులకి పక్కల్లోని ఆధారగుంజల్ని బలంగా కుదిపివేస్తూ వుండమని ఆజ్ఞ జారీ చేసింది

"మళ్ళీ పని మొదలెట్టాలి." గొణిగాడు మామయ్య.

"అక్కర్లేదు. తీసినవాటినల్లా మరోవేపుగా పేరుస్తూ పోతే సరిపోతుంది." - అమ్మమ్మ సమాధానం.

తెచ్చిన బండెడు మోపు అలాగే వుండిపోయింది. చిత్రంగా - వారాంతందాకా ఎక్కడి పనులు అక్కడే నిలిచిపోయాయి.

ఆ సాయంకాలం నాలుగు కావస్తోంది. అమ్మమ్మ మధ్యాహ్నంనించీ గోదాములోనే వుంది. ముంగాళ్ళమీద కూర్చుని ఒక్కొక్క పరకని తీసి నిశితంగా పరీక్షిస్తూ, మోపుని సుతారంగా తడుతూ ఓపిగ్గా తన ఉంగరం కోసం వెతుక్కుంటోంది. శ్రమ, కాలహరణంతో కూడిన పని తెల్లవారి ఆరుగంటలనుం భోజనవేళ మినహాయించి, సాయంత్రం ఆరుగంటలవరకు ఫా పనుల వేళలుగా అమ్మమ్మే నియమించింది అంటే — మ రెండు గంటల సమయం గడిస్తేనే ఆవిడ అక్కణ్ణించి కద తుందని మామయ్యకు తెలుసు మామయ్య తనతో నన ఇంటికి లాక్కెళ్ళాడు

మరుసటిరోజు మంగళవారం. క్రితంలాగే అమ్మమ్మ వెతుకులాటలో మునిగిపోయింది మామయ్య, నేను సాయ టానికి పూనుకున్నాం. అమ్మమ్మ అక్కర్లేదని ఖండిత చెప్పేసింది. అది విన్న మా మొహాలు వెలవెలబోయాయి.

"చూడండర్రా! తీరా మీరూ వెదకటం ప్రారంభిస్తే, వస్తువు దొరక్క మీరు సరిగా చూశారో లేదో అని హై పడేది నేనే. అందుకే మిమ్మల్ని ఇందులో జోక్యం కలగచేస వద్దు అంటున్నాను." - అంది ప్రసన్నంగా.

భోజనవేళకి అమ్మమ్మ ఇంటికొచ్చింది. క్లు అయిందనిపించుకుని మాటా-పలుకూ లేకుండా వెంటనే గో వేపుగా వెళ్ళిపోయింది. సాయంత్రం ఆరు దాటాకనే ఆవిడ గొచ్చింది.

బుధవారం. ష.రా. - మామూలు కార్యక్రమం. అమ మొహమంతా పాలిపోయి వుంది.

గురువారం ఉదయం అమ్మమ్మని చూస్తే కం పుట్టుకొచ్చింది. జబ్బులోంచి లేచినట్టు ఆమె వాలకం. దేహం కృశించిపోయింది. మధ్యాహ్న భోజనం చెయ్య నిరాకరించింది మామయ్య, నేనూ చాలాతడవులు టీ పట్ బలవంతాన ఆమెకి పట్టాము.

శుక్రవారమూ ఫలితశూన్యంగానే గడిచింది. ఆ భోజనాల దగ్గర ఉండబట్టలేక మామయ్య అమ్మమ్మని మ గానే మందలించాడు. ఫారం పనులు వెనకబడినా తనకు కి చింత లేదన్నాడు అతడి ఆందోళన గ్రహించింది

"నాకు ఆమాత్రం తెలుసునులేరా!" అంది జవాబు

రోజులు గడిచేకొద్దీ అమ్మమ్మ పడుతోన్న ఇంటిల్లపాదీ చూళ్ళేకపోతున్నాం. శనివారం వచ్చే వద్దంటే వినదు! మమ్మల్నీ వెతకనియ్యదు. ఆ మామయ్య, అత్తయ్య, నేనూ వంతులవారీగా వంటగది లోంచి షెడ్డులో ఆవిడ పడుతున్న పాట్లు చూస్తూ గడిపె

"ఉంగరం దొరికిందిలాగుందర్రా!" పెద్దపెట్టున అరిచేస్తూ మమ్మల్ని ఆనందంలో ముంచేశాడు మామయ్య. కానీ అది క్షణికం! అమ్మమ్మ ఇంకా అక్కడే ఏం చేస్తోంది?....

యథాతథంగా సాయంకాలం ఆరు దాటాక ఇంట్లోకొచ్చింది అమ్మమ్మ. మాకు వినపడేలా—

"కీపర్-రింగు దొరికింది" అంది నిస్తబ్దతగా.

ఆ తర్వాత ఓ గంటసేపు ఏదో పని తగిలినట్టు వంట గదిలో తచ్చాడి తిరిగి గోదామువేపు వెళ్ళింది.

చీకటిపడ్డాక అమ్మమ్మ షెడ్ లాంతరు వెలిగించుకుని పట్టుకెళ్ళింది. ఆవిడతో వాదించటానికి, అడ్డుతగలటానికి మాలో ఎవరికీ ధైర్యం చాలలేదు.

అమ్మమ్మ వెళ్ళి చాలా పొద్దుపోయింది చలి వణికిస్తోంది. రాక్‌కి తగిలించిన అమ్మమ్మ ఉన్నికోటు తీశాడు మామయ్య ఇద్దరం షెడ్డుకెళ్ళాం.

"బయట మంచు పడుతోందమ్మా!" అంటూ కోటు ఆవిడ భుజంచుట్టూ కప్పాడు మామయ్య అమ్మమ్మ నోరు మెదపలేదు.

షెడ్డు లాంతరు వెలుతురులో షెడ్డు బయట ఇద్దరం కాసేపు తచ్చాడాము. మా ఉనికి తనకు నచ్చలేదన్నట్టు ఆవిడ మావంక చురచుర చూసింది. అక్కడనుండి కదిలి ఇంట్లోకివెళ్ళి హార్త్‌ముందు చతికిలపడి చలి కాచుకుంటూ మేలుకునే వుండిపోయాం. అత్తయ్య పాపని పడుకోబెట్టి అక్కడే చేరింది.

అర్థరాత్రి అయివుంటుంది. అమ్మమ్మ లోపలికి అడుగు పెట్టింది. షెడ్ లాంతర్ వత్తిని దించి ఆర్పేసి, దాని చోట్లో పెట్టింది. మా ముందుకొచ్చి నెగడుకి దగ్గర్లో చతికిలపడుతూ-

"దొరికింది." అంది నిర్లిప్తంగా.

ఆ ఒక్కమాట చెవిన పడగానే మామయ్య కంగారుగా—

"ఆనీ!- అమ్మకి వేడిపాలు పట్రా" అన్నాడు.

అమ్మమ్మ కన్నురెప్పలార్చకుండా తన ఉంగరాన్ని కీపర్-రింగులో అమర్చుకుని కుడివేలుతో తిప్పుతూ శూన్యంలోకి చూస్తోంది....

కొద్దిసేపట్లో ఆవిడకి ఎక్కడలేని సిగ్గు ముంచుకొచ్చేసింది! తన చేతివేళ్ళు కనబడనీకుండా చప్పున ఏప్రిన్‌లో దాచేసుకుంది. ఏప్రిన్ లోపలి చేతి మణికులకి తల ఆనించింది.

"ఓ మార్టిన్!... నా మార్టిన్!...."

ఉద్వేగం తగ్గేదాకా అమ్మమ్మ రోదన వర్షపాతంలా సాగిపోయింది....

# ఊబి

## శ్రీ దాసరాజు రామారావు

ఒక మృత జీవన శరీరాన్ని మోస్తూ
ఒక భ్రమ విశ్వాసాన్ని గర్భగుడిలో పదిలపర్చుకొంటూ
కాలాన్ని పుల్లలు పుల్లలుగా విరిచేస్తూ
సువిశాల సుందరమయ జీవితక్షేత్రాన ఒక
దిష్టిబొమ్మలా నిరాశ-

కళ్లలో చూపుల సెలయేళ్లూరవు
మనసుకీ బ్రతుకుకీ ప్రసారాలుండవు
చిరిగిన షర్టు జేబులో నలిగిన రూపాయి నోటులా
జీవితం మిగుల్తుంది

గొంతు లోయలోకి మాటలమూట జారిపోతుంది
కఫం నోట్లో పచ్చి వెలక్కాయలా గడ్డకట్టి
సిరాచుక్కై-

ముందర నిలువెత్తు నిల్చిన బ్రహ్మరాక్షసిలా భయపెడ్తూ-
అడుగుతీసి అడుగు వెయ్యటానికి అడ్డగించే బద్ధకం-
ఉచ్చరించే రెండు శబ్దతీరాల మధ్య దట్టంగా విస్తరించిన
మౌన సముద్రం-

నిద్రలోనూ కలల పాటల్ని కొనుక్కోనివ్వదు
తొలకరిలో ఒళ్లు విరుచుకునే మొక్కకంకుల్ని వేడి
వేడిగా కాల్చుకోనివ్వదు

నిలబడీ నిలబడీ నిలబడ్డట్టుగానే-
కూర్చుండీ కూర్చుండీ కూర్చున్నట్టుగానే-
మంచంమీద పరుండి, ఇంటి పైకప్పులో కళ్ళు పెట్టి,
ఎక్కడెక్కడో తిరిగి వచ్చినట్టుగానే-
గొప్ప వస్తువూ అయిన, అన్నిటికీ మూలము ఐన
బ్రతుకునే మరచిపోయినట్టుగానే-

# చర్మవ్యాధులకు






## అతి గాఢంగా పనిచేసే అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్





757-TG

శ్రీ దిలావర్

# తెలంగాణా విప్లవ పోరాటం

భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా తెలంగాణా విమోచనోద్యమం సాగింది. తెలంగాణా విప్లవ పోరాటం ఉద్యమాల చరిత్రలోనే ఒక క్రొత్త అధ్యాయాన్ని సృష్టించింది ఎందరో కవులు ఆ ఉద్యమ ప్రభావంతో కావ్యాలు రాశారు. అంతగా ప్రభావితం చేసిన ఉద్యమం గురించీ, ఉద్యమానికి దారితీసిన నాటి హైదరాబాదు సంస్థానం సామాజిక రాజకీయ స్థితిగతుల గురించి ఒక విహంగ వీక్షణ చేయడం ఈ వ్యాసం ఉద్దేశం

నైజాం సంస్థానం :

ఆఖరి మొగల్ చక్రవర్తి చనిపోయింతర్వాత హైదరాబాదు సంస్థానం ఏర్పాటు చేయబడింది. బ్రిటిష్‌వాళ్ళకు నిజాం ధారాదత్తం చేసిన బేరార్, కోస్తా, రాయలసీమ పోగా మిగిలినది నిజాం సంస్థానమైంది.

"నిజాం రాష్ట్రము అని మనము వ్యవహరించుచున్న భూభాగము హైదరాబాదు రాజ్యము అనునది. ఈ రాజ్యమును క్రీ.శ. 1724 నుండి పాలించుచున్న ఆసఫ్‌జాహి వంశపు రాజులకు 'నిజాముల్ ముల్క్' అను బిరుదు మొదటినుండియు వచ్చుచున్నందున ఇచ్చటి రాజునకు సంగ్రహముగ 'నిజాము' అను శబ్దము వర్తించుచున్నది. దీని ననుసరించియే యీ రాజ్యమునకు 'నిజాం రాష్ట్రి'మను పేరు వాడుకలోకి వచ్చినది "[1] అని నిజాం రాష్ట్రమనే పేరు ఎలా వచ్చిందో తెలిపారు మాడపాటి హనుమంతరావుగారు.

తెలంగాణ ప్రాంతంలోని ఎనిమిది జిల్లాలు, మరట్వాడా ప్రాంతంలోని ఐదు జిల్లాలు, కర్ణాటక ప్రాంతంలోని మూడు జిల్లాలు కలిపి హైదరాబాదు సంస్థానం వెలిసింది. అంటే హైదరాబాదు సంస్థానం మూడు భాషా ప్రాంతాలతో కూడుకుని ఉన్నదన్నమాట

భారతదేశంలోని అన్ని సంస్థానాలకంటే ఇది చాలా పెద్దది. దాని జనాభా ఒక కోటీ అరవై లక్షలు. జనాభాలో సగంకంటే ఎక్కువమంది తెలుగు మాట్లాడేవారు. ఒక్క హైదరాబాదులో మాత్రం ఉర్దూ మాట్లాడేవారు ఎక్కువగా ఉన్నారు. అధిక సంఖ్యాకులయిన పాలితులమీద అల్ప సంఖ్యాకులయిన పాలకుల ఆధిపత్యం అన్ని రంగాల్లోనూ ఉండేది. కోర్టుల్లోనూ-పరిపాలనా వ్యవహారాల్లోనూ-అన్ని స్థాయిల్లోనూ ఉర్దూ అధికార భాషగా చెలామణీ అయ్యేది.

ప్రభుత్వ ఖజానాకు గాక నైజాం స్వంత ఖర్చుకు కూడా ప్రత్యేక ఏర్పాటు చేయబడింది

"అతని స్వంత ఖర్చుకుగాను హైదరాబాదు నగర పరిసర ప్రాంతమంతా వుండేది. దానికి "అత్రాఫ్‌బల్దా" అని పేరు ఇదిగాక వివిధ జిల్లాలలోనూ ఇరవై తాలూకాలు కూడా వుండేవి. ఇలాగ స్వంత ఖర్చుకోసం ఏర్పడిన యీ ప్రాంతాన్నంతటినీ 'సర్ఫెఖాస్' అనేవారు "[2] అని రావి నారాయణరెడ్డిగారు వీర తెలంగాణ నా అనుభవాలు-జ్ఞాపకాలు అనే పుస్తకంలో రాశారు.

నైజాంకు వచ్చే ఆదాయం గురించి, ఆ వచ్చే విధానం గురించి, రాష్ట్రి శ్రేయస్సుకు నిజాం కనీస బాధ్యత కూడా వహించని అతని అమానుషత్వం గురించి పుచ్చలపల్లి సుందరయ్యగారి మాటల్లో పరిశీలించుదాం:

"సర్ఫెఖాస్ ప్రాంతంనుండి వచ్చే ఆదాయం, లేదా కొల్లగొట్టబడిన ధనం ఏటా రెండు కోట్ల రూపాయలుండేది. ఈ ధనమంతా నైజాం కుటుంబానికి కుటుంబ పరివారానికి అయ్యే ఖర్చుల క్రిందనే వాడటం జరుగుతుండేది. ఆ పొలమంతా కూడా అతని స్వంత కమతంగానే పరిగణింపబడేది. ఆ ప్రాంతంలో ఆర్థిక, సాంఘిక ప్రయోజనం కోసంగాని, ఆ ప్రాంత ప్రజల జీవనోపాధిని అభివృద్ధి పరచడానికిగాని ఖర్చు జేయవలసిన బాధ్యత నవాబుకేమీ లేదు అందుకోసమేమైనా ఖర్చుజేస్తే, సంస్థానం యొక్క సాధారణ ఆదాయంనుండే ఖర్చు జేయడం జరిగేది. పైగా సంస్థానపు ఖజానానుండే నైజాం నవాబుకు ఏడాదికి డెబ్బై లక్షల రూపాయలు యిస్తుండేవారు."[3]

సంస్థానంలో అత్యల్ప సంఖ్యాకులు ముస్లిములే అయినా ప్రభుత్వోద్యోగాలలో అధిక సంఖ్యలో అంటే రెండు లక్షలమంది ముస్లింలు వుండేవారు. వీరు నిరంకుశంగా వ్యవహరించేవారు.

ముస్లింలు మాత్రమే పరిపాలించే వర్గం. హిందువులకంటే వారు అధికులు అనే భావాన్ని ముస్లిం ముల్లాలు ప్రచారం చేసేవారు. 'అనల్‌ముల్క్' (ముస్లింలు పరిపాలకులు) అనే భావాన్ని వ్యాప్తిలోకి తెచ్చారు. 1927లో మజ్లిస్ ఇత్తెహాద్-ఉల్-ముస్లిమీన్ అనే మతసంస్థ ఆ భావ వ్యాప్తికోసం ప్రత్యేకంగా వెలసింది. రాజు దైవాంశ సంభూతుడని "జిల్-ఉల్-అల్లా" (నైజాము దేవుని ప్రతిరూపం) అనీ ప్రచారం చేసేవారు.

ఫ్యూడల్ దోపిడీకి అసలు సిసలైన ఉదాహరణగా వుండేది నైజాం సంస్థానం. హైదరాబాదు సంస్థానంలో వున్న ఐదుకోట్ల ముప్పై లక్షల వ్యవసాయ భూమిలో మూడుకోట్ల ఎకరాల భూమి ప్రభుత్వ భూమి శిస్తు వ్యవస్థక్రింద వుండేది. ఒక కోటీ యాభై లక్షల ఎకరాల భూమి జాగిర్దారి విధానం కింద, మిగిలిన భూమి నైజాం స్వంత కమతంగా వుండేది.

నిజాం కనుసన్నల్లో మెలిగే భూస్వాముల చేతుల్లో అపారంగా భూముల కేంద్రీకరణ జరిగింది. 1930-33లో సంభవించిన ఆర్థిక సంక్షోభం మూలంగా భూస్వాములు పెద్దఎత్తున అక్రమ పద్ధతుల్లో - రైతులనుండి భూముల్ని స్వాధీనపరచుకున్నారు. రైతుల్ని అప్పుల్లో ముంచి అన్నివిధాల నిస్సహాయుల్ని చేశారు.

యుద్ధంవస్తే తనకు సహాయం చేసేందుకుగాను పైగాలకు (సాధారణంగా వీరు నిజాం బంధువర్గంలోనివారై వుంటారు). నిజాం పెద్ద పెద్ద ఎస్టేట్లను మంజూరు చేసేవాడు. ఇవిగాక జాగీర్లు, సంస్థానాలు, మక్తాలు, బంజర్లు, అగ్రహారాలు, ఈనాముల పేరిట నిజాం తన తాబేదార్లకు అపారమైన భూముల్ని దఖలు పరిచేవాడు.

పాల్వంచ, ఆత్మకూరు, జటప్రోలు, గద్వాల, వనపర్తి, దోమకొండ, సిరినేపల్లి, గోపాలపేట, రాజపేట అనేవి నిజాం రాష్ట్రంలోని కొన్ని ముఖ్య సంస్థానాలు.

వెట్టి చాకిరి :

వెట్టిచాకిరి ఫ్యూడల్ వ్యవస్థయొక్క ముఖ్య లక్షణం. పేద ప్రజానీకం ప్రభుత్వ అధికార్లకు, భూస్వాములకు ఎలాంటి ప్రతిఫలమూ లేకుండా, నిర్బంధంగా సేవలు చేయవలసి వచ్చేది.

పటేల్ పట్వారీల దగ్గరనుండి దేశపాండేలు, దేశముఖీలు, జమీందార్లు, జాగీర్దార్లు, స్థానిక అధికార్ల వరకు అంతా పేద ప్రజల శ్రమశక్తిని దౌర్జన్యంగా దోచుకునేవారు.

"తెలంగాణములోని గ్రామములందు వెట్టిచాకిరి చాల బాధాకరమైనది. పూర్వము గ్రామములు కట్టించబడిన నాటి నుండియు, గ్రామములందు నివసించు వివిధ వృత్తుల వారలకు యినాం భూములు ఇయ్యబడినవి. ఇట్టివి అనేక కులములవారు వంశపారంపర్యముగా అనుభవించుచున్నారు. మన రాజ్యమున అట్టివారిని 'బలోతాదారు'లని పేర్కొనెదరు. వారనుభవించు యినాం భూములకు 'బలోతాయినాం' అని పేరు. వీరిలో గ్రామ పారిశ్రామికులగు వడ్ల, కమ్మరివారును, పనివాండ్రగు చాకలి, మంగలి, మాదిగ, మాలవారలును చేరియున్నారు. ఇట్టివారందరి తోను ప్రతిఫలమేమియు ఇయ్యకయే పని తీసుకొనుట, గ్రామమునకు పర్యటనపై వచ్చు సర్కారు ఉద్యోగులకును, అధికారులకును మాత్రమే కాక సర్కారీ చప్రాసీలకును, ముందు చప్రాసీ ఉద్యోగమును సంపాదించగలమనుకొను ఉమీదు వారలకును, గ్రామాధికారులగు పటేలు పట్వారీలకును, దేశముఖు దేశపాండ్యాలకును అలవాటైపోయినది"[4] అని వెట్టిచాకిరి గురించి రాశారు మాడపాటి హనుమంతరావుగారు.

ప్రభుత్వ అధికార్లు దొరాకు వస్తే 'సరబరాహి' అన్న పేరుతో కావలసిన వస్తుసామగ్రి అంతా వర్తకులు ఉచితంగానే యివ్వవలసి వచ్చేది.

రైతులు గొర్రెల్ని, మేకల్ని విందు భోజనం కోసం యివ్వవలసి వచ్చేది. కూలి నాలి చేసుకునే జనం కనీసం కోడి పెట్టలనన్నా యివ్వవలసి వచ్చేది.

దొరల యిండ్లలో జరిగే పెండ్లిండ్లకు, వేడుకలకు, బంగారాల నిర్మాణానికి, కార్లు కొనుక్కునేందుకు పేద రైతాంగం విధిగా పెద్ద మొత్తాల్లో సొమ్ము చెల్లిస్తూ వుండేవారు. కూలి నాలి జనం రేయింబవళ్ళు భూస్వాముల యిండ్లలో బండచాకిరీ చేస్తూ వుండేవారు.

దొరల కచ్చడం బండ్లముందు అమానుషంగా మనుషుల్ని పరిగెత్తించేవాళ్ళు. మేనాలు, పల్లకీలు - ఎంత దూరమైనా - ఉచితంగానే మోయవలసి వచ్చేది. బట్టలు ఉతకడం, అంట్లు తోమడం, పక్కలు వేయడం, ఒళ్ళు పట్టడంలాంటి పనులన్నీ వెట్టిచాకిరీలో భాగాలే.

దొరల యిండ్లలో పనిచేసే దాసీల జీవితం మరీ దుర్భరంగా వుండేది. దొరల, దొరల బంధువుల కామానికి వారు బలి అయ్యేవారు. వారికి పుట్టేవారు కూడా గడీలలో మగ్గిపోవలసిందే. ఆడబాపల వ్యవస్థ గడీలలో పుట్టి పెరిగిందే.

ఏ కారణం చేతనైనా ఎవరైనా వెట్టిచాకిరీ చేయలేకపోతే అతి భయంకరంగా శిక్షించేవారు. కోళ్ళ గుదులు వేయించేవారు వీపులమీద బండలెత్తేవారు. ఎండలో నుంచోబెట్టేవారు. చెట్ల కొమ్మలకు తలకిందులుగా వేళ్ళాడదీసేవారు.

"ఆ విధంగా వెట్టి విధానం, తెలంగాణా ప్రజల జీవిత విధానాన్ని అట్టడుగు స్థాయికి దిగజార్చింది. కేవలం బానిసత్వం లోకి నెట్టింది. మానవుని ఆత్మగౌరవాన్నది పూర్తిగా ధ్వంసం చేసింది...."[5] అన్న సుందరయ్యగారి మాటలు ఆనాటి వెట్టి విధానం ఎంత దారుణంగా వుండేదో స్పష్టం చేస్తున్నాయి.

తెలంగాణ సామాన్య జనం ఆర్థికంగా, సామాజికంగా, మానసికంగా కృంగిపోయారు. మధ్యయుగాలను తలపించే క్రూరమైన ఫ్యూడల్ వ్యవస్థతో అన్నివిధాలా అణగారిపోయారు.

ఆంధ్ర జనసంఘం .

ఈ పరిస్థితిలో విద్య జనసామాన్యానికి అందుబాటులో లేకుండా పోయింది. నిరక్షరాస్యత ప్రబలింది. ఎవరైనా చదువు కోవాలనుకుంటే సుదూర ప్రాంతాల పట్టణాలకు వెళ్ళాల్సిందే. అదయినా ఉర్దూ మీడియం పాఠశాలలే. తెలుగుదేశంలో తెలుగు ప్రజలకు తెలుగు నేర్చుకునే అవకాశం లేకుండా పోయింది.

క్రమంగా తెలుగుకు మాన్యత లేకుండా పోయింది. సభల్లో సమావేశాల్లో, అధికార వ్యవహారాల్లో ఆంధ్రేతర భాషలే చెలామణి అయ్యేవి. 'తెలంగీ బేఢంగీ' అని తెలుగును అవహాస్యం చేసేవారు.

ఈ నేపథ్యంలో తెలంగాణా ఆంధ్రోద్యమం మొదట ఒక సాంస్కృతికోద్యమంగా ప్రారంభమయింది.

1922 నవంబరు 21 తేదీన హైదరాబాదులోని గౌలిగూడ వివేకవర్ధనీ థియేటర్‌లో కర్వే అధ్యక్షతన ఒక హిందూ సంఘ సంస్కార మహాసభ జరిగింది.

ఆ సంఘటనను మాడపాటి హనుమంతరావుగారు ఇలా వివరించారు. "౭.౭ దై ౧౩౩౧ ఫ (౧౧, ౧౨ నవంబరు ౧౯౨౨ తేదులలో హైదరాబాదు పట్టణమున నిజాం రాష్ట్ర సంఘ సంస్కార మహాసభ సమావేశమయ్యెను దానికి విఖ్యాత చరిత్రుడును మహిళా విశ్వవిద్యాలయ స్థాపకుడునగు కర్వే పండితుడు అగ్రసనాధిపత్యము వహించెను వారి యధ్యక్షోపన్యాసములో చాలాభాగము మహారాష్ట్రములోను, కొంత ఇంగ్లీషులోను ఉండెను. ఇది ఆంధ్రులకు కొందరికి మనస్తాప కారణమైనది. రెండు దినములు అనేక తీర్మానములు అంగీకరింపబడినవి. వాని పైన జరిగిన ఉపన్యాసములు, ఇంగ్లీషులోను, ఉర్దూలోను, మహారాష్ట్రములోను ఉండెను. నగరములోని సుప్రసిద్ధ ఆంధ్ర న్యాయవాది శ్రీ ఆలంపల్లి వేంకట రామారావుగారు, ఒక తీర్మానముపైన తెనుగులో నుపన్యసించ నారంభించగా, సభాసదులు ముఖ్యముగా మహారాష్ట్రులు — విననొల్లక చప్పట్లు చరచి ఉపన్యాసకుడు ప్రసంగమునాపి కూర్చుండునట్లు చేసిరి! తెలంగాణములోని ప్రధాన నగరమున, ఆంధ్రులు బహుళ సంఖ్యాకులుగా నున్న రాజధాని నగరమున, ఆంధ్రభాషలో నుపన్యాసము జరుగుట అసంభవమగుట సభలోనున్న పలువు రాంధ్రులను దుఃఖితుల జేసెను సభాకార్యములు పూర్తికాకముందే వారు వెడలిపోయిరి"[6]

ఆంధ్రులు తమ ఆత్మగౌరవం కాపాడుకొనేందుకు, తమ భాషా సంస్కృతులను కాపాడుకొనేందుకు ఉద్యమించవలసిన చారిత్రక అవసరానికి ఆ సంఘటన అంకురార్పణ చేసింది.

ఆ రాత్రే ఆంధ్రోద్యమం ప్రారంభించే సంకల్పంతో టేకుమాల రంగారావుగారింట సమావేశమై ఆంధ్ర జనసంఘాన్ని స్థాపించారు. రావుబహదూర్ శ్యామలరెడ్డి, మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, మందుముల నరసింహారావు, ఆదిరాజు వీరభద్రరావు, పందిటి రామస్వామినాయుడు, మిట్లా లక్ష్మినర్సయ్య, అర్. రాజగోపాలరెడ్డి మొ॥వారు ఈ సంఘస్థాపనకు కృషిచేశారు.

ఈ సంఘం తెలంగాణాలో సాంస్కృతిక ఉద్యమానికి నాంది పలికింది. ఆంధ్ర భాషాభివృద్ధికి కృషిచేసింది. తెలుగువారు ఒకరినొకరు గౌరవించుకునేట్టు చేసింది. ఐకమత్యాన్ని ప్రబోధించింది తెలుగు నేర్చుకునే విద్యార్థుల్ని ప్రోత్సహించింది.

గ్రంథాలయోద్యమం :

ఆంధ్ర జనసంఘం చేపట్టిన సాంస్కృతిక ఉద్యమంలో భాగమే గ్రంథాలయోద్యమం. అయితే ఆనాటి పరిస్థితుల్లో ఉద్యమ స్థాయిలో గ్రంథాలయాలను నడపడమంటే సామాన్య విషయం కాదు. పైగా తెలుగువారి ఆత్మాభిమానాన్ని, సంస్కృతిని నిలబెట్టుకుందుకు ఉద్దేశించిన గ్రంథాలయోద్యమం - జనాన్ని చైతన్యవంతం చేసే విప్లవకేంద్రంగా మారింది

ఆ రోజుల్లో ఏ ఉద్యమం నడపాలన్నా ప్రభుత్వం నుండి ఎన్నో అడ్డంకులు ఎదురయ్యేవి. అడుగడుగునా అధికార్లు అభ్యంతరపెట్టేవారు. ఇది విద్యా ఉద్యమమయినా పాలకులకును అనుమానంగానే వుండేది. అయితే వారు అనుమానపడటంలో

పొరపాటు ఏమీలేదు. ఎంచేతనంటే ఏ ఉద్యమమూ లేని ఆరోజుల్లో గ్రంథాలయోద్యమం అన్ని ఉద్యమాలకు పుట్టినిల్లు అయింది. రాజకీయోద్యమం లేవదీయాలన్నా - తిరుగుబాటు చేయాలన్నా ప్రజలు విపరీతంగా భయపడుతున్న రోజులవి. గ్రంథాలయాల్లో విద్యాబోధన, పత్రికా పఠనం మొ॥ జరుగుతుండేవి. కాబట్టి ప్రజలు నిర్భయంగా పాల్గొనేవారు క్రమంగా యీ గ్రంథాలయాలే రాజకీయ చర్చావేదిక లయ్యాయి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసే రాజకీయ శిక్షణా తరగతులయ్యాయి

నాటి గ్రంథాలయోద్యమం గురించి "గ్రంథాలయోద్యమం హైదరాబాదు సంస్థానంలో ప్రత్యేక ప్రయోజనాన్ని, విలువలను చేకూర్చుకున్నది. ప్రజా ఉద్యమాలు, ప్రజా సంస్థలు ఆవిర్భవించకుండాను, ఆవిర్భవించినవాటిని ఆరంభంలోనే అణచివేయడానికే బ్రిటిషు ప్రభుత్వాన్ని మించి నిరంకుశ నైజాము ప్రభుత్వము దమననీతిని ఉపయోగించేది. కనీసం నలుగురు ఒకచోట కూర్చొని గ్రంథాలయ రూపాన్ని సంతరించుకోడానికి సయితం ప్రభుత్వం అనుమతి అవసరమయ్యేది ..."[7] అంటూ గాయత్రి గారు వివరించారు.

ప్రజాసామాన్యంలో నైజాం వ్యతిరేకతను పెంపొందించేందుకు, జాతీయ భావాలను నాటేందుకు, ప్రజల్ని మంచి దేశభక్తులుగా తయారుచేసేందుకు ఈ గ్రంథాలయాలు ఎంతగానో తోడ్పడ్డాయి.

"మా గ్రంథాలయానికి, మా గ్రంథాలయోద్యమానికి గ్రంథాలు అవసరం లేదు భవనాలు అవసరం లేదు. దేశం కోసం పరితపించే ప్రాణి ఒకడుంటాడు. వాడే గ్రంథాలయం."[8] అన్న మాడపాటి హనుమంతరావుగారి మాటల్లో నాటి గ్రంథాలయం పాత్ర ఏమిటో అర్థమవుతున్నది.

ఆంధ్ర మహాసభలతోబాటు గ్రంథాలయాల మహాసభలు కూడా జరుగుతుండేవి. కొన్ని సభలకు ప్రభుత్వం అనుమతి నిచ్చేది కాదు. అయినా పట్టుదలతో సభలు జరిపి గ్రంథాలయోద్యమం ప్రఖ్యాతినీ, ప్రతిష్టనూ ఆర్జించింది.

గ్రంథాలయోద్యమానికి ప్రోత్సాహమిచ్చిన గ్రంథమాలల సేవ కూడా మరువరానిది. తెలుగునాట ప్రారంభింపబడిన తొలి గ్రంథమాల 1906లో హైదరాబాదులో స్థాపింపబడిన విజ్ఞాన చంద్రికా గ్రంథమాల. కొమర్రాజు లక్ష్మణరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, రావిచెట్టు రంగారావు, అయ్యదేవర కాళేశ్వరరావు, రాజానాయని వెంకట రంగారావు గారలు దీని స్థాపకులు ఈ గ్రంథమాల దేశ చరిత్రలు, జీవిత చరిత్రలు, చారిత్రక నవలలు జనసామాన్యం కోసం ప్రచురించేది. పురాణాలు, ప్రబంధాలు కూడా సామాన్య జనానికి అందుబాటులోకి తేవడం లక్ష్యంగా పెట్టుకున్న సంస్థ యిది.

విశేషించి కొమర్రాజుగారు చేసిన సేవలు ప్రశంసనీయమైనవి. దేవులపల్లి రామానుజరావుగారు వారి సేవలనిలా రాశారు.

"లక్ష్మణరావుగారు మహారాష్ట్ర దేశమున విద్యాభ్యాసము చేసి, మహారాష్ట్ర భాషలో ప్రావీణ్యము గడించి, అక్కడ జరుగుచున్న వాఙ్మయ కృషిని అవగాహన చేసికొనిన ఆంగ్ల విద్యాధికులు. లక్ష్మణరావుగారు హైదరాబాదులోని ప్రత్యేక పరిస్థితులను పరిశీలించి, వాఙ్మయ వికాసానికి మూడు ముఖ్యమైన మార్గములను జూపించినారు. ఒకటి గ్రంథాలయోద్యమము. ఊరూర గ్రంథాలయాలను స్థాపించి నిరక్షరాస్యత అజ్ఞానములందు మునిగియున్న ప్రజలకు విజ్ఞానము ప్రసాదించి, మన సాహిత్యపు రుచులను ప్రజలకు తెలియజేయవలసిన ఆవశ్యకతను గ్రహించి లక్ష్మణరావుగారు ఈ ఉద్యమానికి బలమైన పునాదులు వేసిరి. స్వయముగా హనుమకొండలో రాజరాజ నరేంద్ర భాషానిలయము, హైదరాబాదులో కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయములను స్థాపించిరి."[9]

1938లో వట్టికోట ఆళ్వారు స్వామిగారు దేశోద్ధారక గ్రంధమాలను స్థాపించారు. కథలు, కావ్యాలు, వైజ్ఞానిక గ్రంథాలు, జీవిత చరిత్రలు ఈ గ్రంధమాల తరపున ప్రచురింపబడ్డాయి.

1923లో కృషి ప్రచారిణి గ్రంధమాల సూర్యాపేటలో స్థాపించబడింది. మానుకోట తాలూకా ఇనుగుర్తిలో (1926) ఒద్దిరాజు సోదరులు విజ్ఞాన ప్రచారిణి గ్రంథమాలను స్థాపించారు.

1945లో మాడపాటి హనుమంతరావుగారి ప్రోత్సాహంతో ఆంధ్ర చంద్రికా గ్రంధమాల ప్రారంభమైంది.

సామాన్య జనాన్ని విద్యావంతుల్ని చేయడానికి ప్రారంభింపబడిన గ్రంథాలయోద్యమానికి యీ గ్రంధమాలలు ప్రచురించిన పుస్తకాలు ఎంతో ఉపయుక్తమయ్యాయి.

ఆ తర్వాత ఎన్నదగిన పాత్ర పత్రికలది. నిర్బంధాలూ, నిషేధాలూ ఉన్నా - నాటి తెలంగాణాలో జరుగుతున్న దౌర్జన్యాలను సంబంధించిన వార్తలను, ఉద్రూలలూగించే సంపాదకీయాలను నిర్భయంగా ప్రచురించిన గోల్కొండ పత్రిక - సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వంలో అనన్య సామాన్యమైన సేవ లందించింది. ఇది 1926లో ప్రారంభమైంది.

నల్లగొండనుండి (1922) నీలగిరి పత్రిక వెలువడేది. ఒద్దిరాజు సోదరులు ఇనుగుర్తినుంచి ఒక పత్రికను నడిపేవారు. తెలుగు పత్రిక, సుజాత, శోభ, భాగ్యనగర్, సారధి, ఆంధ్రాభ్యుదయము మొ॥ పత్రికలన్నీ తెలంగాణాలో భాషావికాసానికి విశేష కృషి జరిపాయి.

ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వహించే సాహిత్య కార్యక్రమాలు తరచుగా గ్రంధాలయాలలోనే జరుగుతుండేవి. ఆ విధంగా పరిషత్తు కార్యకలాపాలు కూడా పరోక్షంగా గ్రంథాలయోద్యమానికి చేయూత నిచ్చాయి.

అంతర్జాతీయ పరిస్థితులు :

తెలంగాణా నిజాం నిరంకుశ పాలనక్రింద మగ్గుతున్న రోజుల్లోనే అంతర్జాతీయ పరిస్థితులు కూడా పెనుమార్పుకు లోనయ్యాయి. ఆ మార్పు ప్రభావం ప్రపంచ దేశాల ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాలను ఒక కుదుపు కుదిపింది. దాంతో సహజంగానే ప్రపంచ సాహిత్యం కూడా ఒక కొత్తమలుపు తిరిగింది. భారతీయ రచయితలమీద కూడా ఆ మార్పు ప్రభావం గాఢంగా పడింది.

1917 అక్టోబర్‌లో రష్యన్ జారిస్టు నిరంకుశత్వానికి వ్యతిరేకంగా జరిగిన సోషలిస్టు మహావిప్లవం మానవజాతి చరిత్రలో ఒక కొత్త అధ్యాయాన్ని సృష్టించింది. పీడిత ప్రపంచ ప్రజలలో స్వాతంత్ర్యేచ్ఛను రగిలించింది.

అయినా ఫాసిజం, నాజిజం, సామ్రాజ్యవాదం అన్న పేర్లతో ప్రపంచానికి ప్రమాదం పొంచే వుంది.

జర్మనీలో ఒక సామాన్య సైనికుడైన హిట్లర్ క్రమంగా నియంతగా మారాడు. జర్మనీలోని ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని కూలదోసి బలీయమైన శక్తిగా రూపొందాడు బలమైన సైన్యాన్ని కూడగట్టుకున్నాడు. మొదటి ప్రపంచయుద్ధంలో జర్మనీ ఓటమి అతనిలో ప్రతీకార జ్వాలలను రేపింది కమ్యూనిస్టు వ్యతిరేకతను నిలువెల్లా నింపుకొన్నాడు. కమ్యూనిస్టు వ్యతిరేక భావాలను దేశమంతటా ప్రచారం చేశాడు. జాత్యహంకారాన్ని అణువు అణువునా కలిగివున్న హిట్లర్ ప్రపంచాధిపత్యం కోసం కలలు కనడం మొదలెట్టాడు.

ఇటలీలో ముసోలినీ కూడా ఇదేతరహా నియంతగా రంగంలోకి దూకి యూరప్‌లో గణనీయమైన శక్తిగా రూపొందాడు.

మరోవేపు సామ్రాజ్యవాదంతో జపాను కూడా ప్రమాదకరంగా తయారయింది. ఆసియానంతటినీ కబళించాలన్నది దాని ధ్యేయం.

ఫాసిజం, నాజిజంల కుయుక్తులకు, అప్రజాస్వామిక విధానాలకు, ప్రపంచాధిపత్యం చేయాలనే కోరికకు స్పెయిన్‌తో జరిగిన సంఘటనలు మంచి ఉదాహరణలు. స్పెయిన్‌లోని పెట్టుబడిదారులు, భూస్వాములు, మతగురువుల కూటమికి వ్యతిరేకంగా వామపక్ష ఐక్యసంఘటన ఎన్నికల్లో పోటీచేసి గెలుపొందింది వామపక్ష విధానాలకు అనుగుణంగా సోషలిస్టు కార్యక్రమాల అమలుకు ప్రయత్నించింది. అభివృద్ధి నిరోధకులకు యిది గిట్టలేదు. వీరికి జనరల్ ఫ్రాంకో నాయకత్వం వహించాడు. ఇటలీ జర్మనీలు స్పెయిన్‌లోని ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని కూలదోసేందుకు జనరల్ ఫ్రాంకోకు మద్దతు నిచ్చారు. ఆర్థికంగా, సైనికంగా సహాయం చేశారు. ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలు స్పెయిన్ వామపక్ష ఐక్య సంఘటనకు మద్దతుగా ఒక బ్రిగేడు పంపించాయి. ఈ బ్రిగేడులో దేశ దేశాలకు చెందిన కార్మికులు, మేధావులు వున్నారు. కాడ్‌వెల్ లాంటి మేధావులు, రచయితలూ యీ స్పెయిన్ విముక్తి పోరాటంలో పాల్గొన్నారు. వారు వీరోచితంగా పోరాడి ప్రాణాలర్పించారు. మూడు సంవత్సరాల అంతర్యుద్ధం తర్వాత అధికారం విప్లవ ప్రతీఘాతకుల హస్తగతం అయింది.

ప్రజాస్వామిక దేశాలని వాడుకపడ్డ ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాలు పైకి తటస్థంగా కనిపించినా పరోక్షంగా జనరల్ ఫ్రాంకోకు సహాయపడ్డాయి.

కమ్యూనిస్టు వ్యతిరేకతతో వున్న ఇంగ్లాండు, ఫ్రాన్సు, అమెరికా - హిట్లరును ఎలాగైనా సోవియట్ యూనియన్‌మీదికి ఉసికొల్పాలని ఆశించాయి. మ్యూనిక్ ఒడంబడిక ద్వారా జెకోస్లావేకియాను హిట్లరుకు ధారాదత్తం చేయడం ఆ ప్రయత్నంలో భాగమే.

1939లో హిట్లర్ పోలెండు మీద దాడి చేయడంతో సామ్రాజ్యవాదుల ఆశలు అడియాశలయ్యాయి. పైపెచ్చు హిట్లర్ తమమీద కూడా విరుచుకు పడవచ్చునన్న భావం ఇంగ్లాండు, ఫ్రాన్సు, అమెరికాలను భయభ్రాంతుల్ని చేసింది.

1935లో ఇటలీ అబిసీనియా దేశంమీద దాడి చేసింది. 1937లో జపాను మంచూరియా నాక్రమించుకున్నది. 1938లో జర్మనీ ఆస్ట్రియాను, జకొస్లేవేకియాను ఆక్రమించుకున్నది. ఈ పరిస్థితులన్నీ ద్వితీయ ప్రపంచ యుద్ధానికి దారితీశాయి.

చైనా, ఈజిప్టు, పాలస్టయిన్, ఇరాన్, క్యూబా, ఫిలిప్పైన్స దీవులు, మొరాకో, లిబియా దేశాల్లో వలసవాద, సామ్రాజ్యవాద వ్యతిరేకత పెల్లుబికింది.

రెండు ప్రపంచ యుద్ధాలు ప్రపంచాన్ని అనేక రంగాల్లో కుదిపివేశాయి. ముఖ్యంగా పెట్టుబడిదారీ దేశాలను ఆర్థిక సంక్షోభం అతలా కుతలం చేసింది. నిరుద్యోగ సమస్య, ఆహార సమస్య, యువతలో నిరాశా నిస్పృహలకు గురిచేసింది. అధిక ధరలు శ్రామికులను మధ్యతరగతి కుటుంబీకులను కృంగదీశాయి. అయితే సోషలిస్టు దేశాలు ఆర్థిక సంక్షోభానికి గురి కాకపోవడం—ప్రణాళికాబద్ధంగా సోవియట్ యూనియన్ పురోగమించడం ప్రజాతంత్రవాదుల్ని, మేధావుల్ని ఆకర్షించింది. అనేకమంది వామపక్షంవేపు మొగ్గడం ప్రారంభమైంది

చివరకు ఇంగ్లాండు కూడా యుద్ధంలోకి దిగవలసి వచ్చింది. మొదట సామ్రాజ్యవాద కూటమిలో ఉండటంవలన భారతీయులు బ్రిటిషు తరపున యుద్ధంలో పాల్గొనడానికి విముఖత చూపించారు బెంగాల్ విభజన, జలియన్‌వాలాబాగ్ ఉదంతం భారతీయుల్లో బ్రిటిషువారిపట్ల అంతకంతకు తీవ్ర వ్యతిరేకతను పెంపొందించాయి. శాసనోల్లంఘన ఉద్యమం, వందేమాతరం ఉద్యమం, ఉప్పు సత్యాగ్రహం మొ॥వానితో జాతీయోద్యమం తీవ్రరూపం దాల్చింది. దేశభక్తులతో జైళ్ళు నిండిపోయాయి.

స్వాతంత్ర్యోద్యమ నాయకులు కొందరు, సామ్రాజ్యవాదులతో సాగించే రాజీ బేరాలూ, రాయబారాలు ఉద్రేకులైన యువకులకు నచ్చలేదు. జైళ్ళలో అలాంటి అసంతృప్తివాదులకు కమ్యూనిస్టులు రాజకీయ శిక్షణా తరగతులు నిర్వహించారు. అసంతృప్తి ప్రబలిన యువత ప్రత్యామ్నాయంగా మార్క్సిజాన్ని అధ్యయనం చేయసాగింది. (1925 నాటికే భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ స్థాపించబడింది.) భావసామీప్యం కలిగిన సోషలిస్టులు, కమ్యూనిస్టులూ కలిసి కాంగ్రెసు సోషలిస్టు పార్టీని ఏర్పాటు చేశారు. ట్రేడ్ యూనియన్లు, రైతు సంఘాలు కూడా ఏర్పాటయ్యాయి.

"1930 తర్వాత యూరపులోని పెట్టుబడిదారీ దేశములలో కలిగిన ఆర్థిక సంక్షోభము బూర్జువా వర్గపు పునాదులనే పెల్లగించి వేసినది. దానికి పర్యవసానంగా పెట్టుబడిదారీ దేశములోని కార్మికోద్యమము, భారతదేశమువంటి వలస రాజ్యములలోని జాతీయోద్యమము చైతన్య సందీప్తమైనవి. సోవియట్ రష్యాలోని సామ్యవాద వ్యవస్థయొక్క దినదినాభ్యుదయం ప్రపంచ ప్రజలందరిలో విప్లవాత్మకమైన పరివర్తనము కలిగించినది. భారతదేశములో 1934లోనే మార్క్సు ప్రభావము గల కాంగ్రెసులోని వామపక్షీయులు 'కాంగ్రెసు సోషలిస్టు పార్టీ'ని స్థాపించిరి."[10] అన్న డా॥ నారాయణరెడ్డిగారి మాటలు పై విషయాన్ని బలపరుస్తున్నాయి.

తెలంగాణాలోని యువకులు కూడా ఆ రెండవ ప్రపంచ యుద్ధానంతర ప్రభావానికి లోనయ్యారు. వారిలో పత్రికా పఠనాసక్తి పెరిగింది. ఫాసిజం, నాజిజంలను గురించి ఆలోచించసాగారు వారిలో సోషలిస్టు భావాలు చోటు చేసుకున్నాయి. హైదరాబాదులో కొందరు యువకులు కలిసి "కామ్రేడ్స్ అసోసియేషన్" స్థాపించారు. క్రమంగా 1939 చివరలో ఇది "నిజాం సంస్థాన కమ్యూనిస్టు కమిటీ" నిర్మాణానికి దారి తీసింది.

దీనికితోడు స్పెయిన్‌లో పర్యటించిన నెహ్రూ ఫాసిజం నిజస్వరూపం గురించి దేశంలో పెద్దఎత్తున ప్రచారం చేశారు. 1935లో నెహ్రూ లక్నో కాంగ్రెసు సభలో సోషలిస్టు భావాలతో ప్రచారం చేసిన అధ్యక్షోపన్యాసం గొప్ప సంచలనం సృష్టించింది. అభ్యుదయ భావాలున్న యువకులు బాహాటంగానే సోషలిస్టు భావాలు ప్రచారం చేయడం మొదలెట్టారు.

ఆ విధంగా తెలంగాణలో ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టులూ కలిసి పని చేయడానికి అభ్యంతరం లేకపోయింది.

ఆంధ్ర మహాసభ :

ఇంతవరకూ సంఘ సంస్కరణలతో, సాంస్కృతిక పురోగమనంతో తృప్తిపడుతున్న ఆంధ్ర జనసంఘం రాజకీయాలలోకి దిగవలసి వచ్చింది. నిజాంను రాజకీయంగా ఎదుర్కొనేందుకు మూడు భాషా ప్రాంతాలవారు విడివిడిగా కొన్ని సంస్థలను ఏర్పాటు చేసుకున్నారు. తెలుగువారు 'ఆంధ్ర మహాసభను' మరాఠీవారు 'మహారాష్ట్ర పరిషత్తును' కర్ణాటక ప్రాంతం వారు 'కర్ణాటక మండలి'ని నెలకొల్పుకున్నారు.

"శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, తదితరుల నాయకత్వాన 1928లో ఆంధ్ర మహాసభ ఏర్పాటు చేయబడింది. దాని ప్రథమ మహాసభ మెదక్ జిల్లా జోగిపేటలో 1930లో శ్రీ సురవరం ప్రతాపరెడ్డి అధ్యక్షతన జరిగింది. పరిపాలనా యంత్రాంగంలో కొన్ని సంస్కరణలు చేయాలనీ, కొన్ని పౌర హక్కులనుభవించడానికి అవకాశం కల్పించాలని ఆ మహాసభలో తీర్మానాలు చేయబడుతుండేవి. పీడకులకు వ్యతిరేకంగా గాని, నైజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా గాని ప్రజలను సమీకరించి పోరాటాలు నడపడానికి ప్రయత్నం మాత్రం చేయలేదు. అయితే

హైదరాబాదు సంస్థానంలో ఆడాడున్న దారుణమైన, దుర్భర మైన నిర్బంధ పరిస్థితులలో ఆంధ్ర మహాసభ ప్రజలలో పెంపొందుతున్న ప్రజాతంత్ర భావాలకు, వాంఛలకు వేదికగా, కేంద్రంగా రూపొందింది."[11] ఆనాడు ఆంధ్ర మహాసభ నిర్వ హించిన పాత్రను సుందరయ్యగారు తమ పుస్తకంలో రాశారు.

నాటి ఆంధ్ర మహాసభల నిర్వహణ, తీర్మానాలు - ఎలా ఉండేయో తెలుసుకునేందుకు హనుమంతరావుగారి యీ వివరణ ఉపయోగపడుతుంది.

"అంగీకరింపబడిన ౩౨ తీర్మానములలో ఎక్కువ భాగము విద్యకును సంఘ సంస్కరణకును సంబంధించినవి. మొట్ట మొదటిదగు నీ మహాసభలో సంఘ సంస్కరణ విషయము ఎక్కువగా దృష్టి నాకర్షించినట్లు కానవచ్చుచున్నది. ఆ కాల మున, హైదరాబాదు శాసనసభలో అతి బాల్యవివాహమును నిషే ధించునట్టియు, వితంతూద్వాహము నంగీకరించునట్టియు, రెండు చిత్తుశాసనములు చర్చలో నుండినందున వానికి సంబంధించిన అనుకూల తీర్మానములు సభలో చర్చింపబడినవి. వానిని పూర్వా చార పరాయణులగు పండితులు కొందరు ప్రతిఘటించిరి దేశ భక్త వామన నాయకుగారు మహాసభ తుది సమావేశము వరకు ఉండి, పూర్వాచార పరాయణులకు నచ్చజెప్పి, యువజనుల కోరికలకు తగిన విధమున కొంత మితవాద పద్ధతిలో తీర్మానము లంగీకరింపజేసిరి. వీరి సహాయము అమూల్యమని చెప్ప వచ్చును."[12]

(హరిజన నాయకుడు శ్రీ భాగ్యరెడ్డిగారు, అంటరానితన మును తొలగించాలని, ఆది హిందువుల విద్యాసౌకర్యాలు మెరుగు పడేందుకు ప్రయత్నించాలని ఒక తీర్మానము ప్రవేశపెట్టాడు. అది ఛాందసులకు నచ్చలేదు).

ఇలా మొత్తం పంద్రెండు ఆంధ్ర మహాసభలు తెలంగాణా లోని వివిధ జిల్లాలలో జరిగాయి. ఆంధ్ర మహాసభ సాంస్కృ తిక స్వభావం, సంస్కరణ స్వభావం మారి క్రమంగా విస్తృత మైన రాజకీయ సంస్థగా రూపుదిద్దుకున్నది. అయితే దీనిలోని అభ్యుదయ కాముకవర్గం మితవాదులతో కలిసి ఎంతోకాలం పని చేయలేకపోయారు. శ్రీ రావి నారాయణరెడ్డి, శ్రీ బద్దం ఎల్లారెడ్డి లాంటివారు ఒక బలమైన వర్గంగా రూపొంది 1940-42 వరకు తమ అనుయాయులతో సహా కమ్యూనిస్టు ఉద్యమంలో చేరారు.

అభ్యుదయ దృక్పథం గల వీరు ఆంధ్ర మహాసభను ఎంతగానో ప్రభావితం చేశారు. ఉదారవాద సంస్థగా వుంటూ వచ్చిన ఆంధ్ర మహాసభను నైజాం వ్యతిరేక సమైక్య సమరశీల ప్రజాసంస్థగా, నైజాముకు వ్యతిరేకంగా యువజనులను, రైతు లను, వ్యాపారస్తులను, చేతివృత్తులవారిని మధ్యతరగతి వర్గా లను నడిపే ఐక్య సంఘటనగా మార్చివేశారు.

పదకొండవ ఆంధ్ర మహాసభ 1944లో భువనగిరిలో జరి గింది. మితవాదులు ఈ సభలో పాల్గొనక చీలిపోయారు. అంత కంతకూ అభ్యుదయ కాముకుల ప్రాబల్యం హెచ్చవడంవల్ల ఆంధ్ర మహాసభ ఐక్యసంఘటనగా కొనసాగలేకపోయింది.

మితవాదుల నిష్క్రమణ గురించి రావి నారాయణరెడ్డిగారు యిలా వివరించారు.

"ఆంధ్ర మహాసభ నిర్మాణంలోనూ ఇతర కార్యక్రమాల నిర్వహణలోను తమ పూర్తి కాలాన్ని వినియోగించే కార్యకర్తలు వందల సంఖ్యలో ముందుకు వచ్చారు. దీన్ని చూసిన ఆంధ్ర మహాసభ మితవాద నాయకులకు కంపరం పుట్టింది. ఆంధ్ర మహాసభలో అప్పటికి వారికి టెక్నికల్‌గా మెజారిటీ వుంది. దాని సాయంతో వారు కమ్యూనిస్టులను మహాసభనుంచి బహిష్క రించాలనుకున్నారు. కాని అది వారికి సాధ్యం కాలేదు.... ఎన్ని కలు జరిగితే తమ దారుణ ఓటమి ఖాయమని గుర్తించారు. ఎన్నికలను వాయిదా వేయడానికి ప్రయత్నించారు. అది వారికి వశం కాలేదు. అలాంటి పరిస్థితుల్లో గత్యంతరం లేక వారు ఆంధ్ర మహాసభనుంచి నిష్క్రమించాలని నిశ్చయించు కున్నారు."[13]

సాంస్కృతిక ఉద్యమ లక్ష్యంగా ఆవిర్భవించిన ఆంధ్ర జనసంఘం క్రమంగా తన పరిధిని విస్తరించుకొని సంస్కరణో ద్యమంగా రూపొంది, విస్తృత రాజకీయ సంస్థ ఆంధ్ర మహా సభగా ఎదిగి తెలంగాణా ప్రజల చైతన్యం కోసం ప్రశంసనీయ మైన సేవలందించింది. చివరకు మితవాదులతో మిగిలిన సంస్థ 1946లో స్టేట్ కాంగ్రెస్‌లో విలీనమై తెలంగాణా విమోచ నోద్యమం చేపట్టింది.

"సంఘం" కార్యకలాపాలు :

కాశిం రజ్వీ నాయకత్వాన రజాకార్ సైన్యం ఏర్పడింది. మతోన్మాదులైన రజాకార్లు విచ్చలవిడిగా దాడులు చేస్తూ వుండే వారు. జంబియాలు, నాటు తుపాకులు, బల్లాలు, రైఫిళ్ళు మొ॥ ఆయుధాలతో, పట్టణాలు స్థావరాలు ఏర్పాటు చేసుకొని గ్రామీణ ప్రాంతాలకు అల్లకల్లోలం చేసే వారు. మరోపక్క నిజాం పోలీసుల దుండగాలకు అంతులేకుండా వుండేది.




ఈ ప్రజాకంటకులను సంఘటితంగా ఎదిరించేందుకు ఘం' ఏర్పాటయింది. లాఠీలు, కర్రలు ధరించిన సంఘం మ గ్రామాల్లో వ్యాపించింది. గ్రామీణ ప్రజల్లో ఆత్మస్థైర్యం గించి, దుండగుల్ని ధైర్యంగా ఎదిరించేది సంఘం.

ఒక గ్రామంలో 'సంఘం' ఉన్నదంటే ఆ గ్రామప్రజలు మకు రక్షణ ఉన్నదని భావించేవారు సంఘం ఉన్న గ్రామం లోకి ప్రవేశించాలంటే రజాకార్లకు గాని, నిజాం పోలీసులకు గాని, భూస్వాముల గూండాలకు గానీ గుండె దడ పుట్టుకొచ్చేది.

సంఘం కార్యకర్తలు గ్రామంనుండి వెళ్ళింతర్వాత రజాకార్లు, పోలీసులు వచ్చి గ్రామీణులను అనేక బాధలు పెట్టేవారు. సంఘానికి ఆశ్రయమిచ్చినందుకు ప్రజల్ని హింసించేవారు. సంఘం ఆచూకీ తెలపవలసిందని చిత్రహింసలు పెట్టేవారు.

భూస్వాముల దౌర్జన్యం నానాటికి ఎక్కువ కాజొచ్చింది. అక్రమ వసూళ్ళు, హెచ్చు వడ్డీ, వెట్టిచాకిరీలతోబాటు దౌర్జన్యంగా భూముల ఆక్రమణ కూడా మొదలయింది.

ఈ అక్రమ భూస్వాధీనం తెలంగాణాలో వ్యవసాయ తిరుగుబాటుకు దాంతోబాటు సాయుధ పోరాటానికి దారితీసింది. ఈ తిరుగుబాటుకు నాంది పలికింది. అయిలమ్మ అనే రజకస్త్రీ పొలం ఉదంతం.

జనగామకు చెందిన దేశముఖ్ విసునూరు రామచంద్రారెడ్డి ప్రజాకంటకునిగా, క్రూరునిగా ప్రసిద్ధి పొందాడు. సంఘాన్ని బలపరిచే కార్యకర్త అయిలమ్మ అనే చాకలి స్త్రీ పొలంలోని పంటను కాజేయాలని పథకం వేశాడు. గూండాలను పంపి అంతకుముందే గ్రామంలో భయభ్రాంతుల్ని సృష్టించాడు. ఇక తనకు అడ్డం ఎవరు రారని భావించాడు.

సాహసోపేతమైన ఆనాటి ప్రజల తిరుగుబాటును కామ్రేడు సుందరయ్యగారు యిలా వివరించారు:

"అయిలమ్మ పొలంలో పంట కోసుకురమ్మని ఆడ, మగ నౌకర్లను వందమందిని, వందమంది గూండాలను పంపించాడు. అప్పుడు సంఘ నాయకులు 28మంది వాలంటీర్లతో బయలుదేరారు. ప్రాణాలకు తెగించి, కర్రలు చేతబట్టుకొని, నినాదాలిచ్చుకొంటూ వెళ్ళి గూండాలపై దాడి చేసారు. ఈ వాలంటీర్లు కర్రలు చేతబూని, ఒక వ్యూహం ప్రకారం నడుస్తూండటం జూచి, వారి ముఖాలలో కానవస్తున్న దృఢ నిశ్చయాన్ని గాంచి గూండాలు బ్రతుకుజీవుడా అంటూ పలాయనం చిత్తగించారు. ఇంకెవ్వరూ మిగలలేదు. వాలంటీర్లే పంట కోసి అయిలమ్మ యింటికి పంపించారు. ఆ రాత్రే విసునూరునుండి పోలీసులు దిగారు. అయినా అయిలమ్మ ఇంటి ... ధాన్యాన్ని ముట్టుకొనటానికి సాహసించలేదు. ఈ సంఘటన ప్రజలను ఉత్తేజపరిచింది."[14]

పేరుమోసిన విసునూరు భూస్వామిపై ప్రజలు సాధించిన తొలి విజయంగా ప్రజలు ఈ కథను చెప్పుకునేవారు. మొత్తం తెలంగాణాలోనే ఈ కథ గొప్ప సంచలనాన్ని కలిగించింది.

తెలంగాణా ప్రజలలో ఉత్తేజాన్ని, ఉద్రేకాన్ని, విప్లవాన్ని రగిలించిన మరొక ఉదాహరణ దొడ్డి కొమరయ్య ఆత్మార్పణ. అయిలమ్మ పొలంలో దేశముఖ్‌కు వూహించని ఓటమి ఎదురవడంతో బాగా రెచ్చిపోయాడు. పగ సాధించాలన్న ఉన్మాదంతో సంఘ నాయకుల్ని హత్య చేసేందుకు పథకం వేశాడు. అనేక మంది ప్రజలపై కేసులు బనాయించాడు. 15 మందిని అరెస్టు చేయించాడు. పోలీసుల సహకారంతో కడవెండి నాయకులను చంపించాలని వ్యూహం పన్నాడు.

1946 జూలై 4వ తేదీన గూండాలకు బాగా సారాయి పోయించి సంఘ నాయకుల యిండ్లమీదికి దాడి చేయండని పంపించాడు. బాగా తాగిన గూండాలు యిండ్లపై రాళ్ళు రువ్వడం మొదలెట్టారు. ప్రజలు లాఠీలు, వడిసెలలు చేతబూని ప్రతిఘటించారు. గూండాలు ప్రజలపై కాల్పులు జరిపారు. ప్రజావెల్లువకు నాయకత్వం వహిస్తున్న దొడ్డి కొమరయ్య పొట్ట లోంచి తూటా దూసుకుపోయి అక్కడికక్కడే మృతిజెందాడు. రక్తానికి రక్తం అంటూ ప్రజలు నినాదాలు యిచ్చుకుంటూ దేశముఖ్ భవనాన్ని చుట్టుముట్టారు ప్రజలు. భూస్వామికి, గూండాలకు 60మంది రిజర్వు పోలీసులు వచ్చి రక్షణ కల్పించారు.

"కొమరయ్య మరణం, అమరత్వం తెలంగాణా రైతాంగంలో నిద్రాణమై వున్న ఆగ్రహాన్ని ప్రజ్వరిల్లజేసింది. నల్గొండ జిల్లాలోని అన్ని తాలూకాలలో ప్రజలు ఒక్కుమ్మడిగా విజృంభించారు. జిల్లా అంతటా జరిగే అన్ని సభలలోనూ, ప్రదర్శనలలోనూ, ఈ అమర వీరునికి జోహార్లర్పించే పాట పాడటం జరుగుతుండేది. కర్రలు, వడిసెలలు ధరించిన ప్రజలు ఒక గ్రామానికి జెందినవారు మరొక గ్రామానికి వెళ్ళి వస్తూ ఉత్తేజం కలుగజేసేవారు. వారు ఉమ్మడిగా భూస్వామి గడీముందు బహిరంగసభ జరిపేవారు. ఎర్రజెండా ఆవిష్కరించేవారు. 'ఇక్కడ సంఘం ఏర్పాటు చేయబడింది. వెట్టి, అక్రమ నిర్బంధ వసూళ్ళు, బేదఖళ్ళు ఇంకెంతమాత్రం సాగవు' అని ప్రకటించేవారు. భూస్వామిగాని, దేశముఖ్‌గాని సంఘంయొక్క

ఈ ఉత్తర్వులను అమలుజరపకపోతే అతనిని సాంఘిక బహిష్కారానికి గురి చేసేవాడు. అతని పొలాలలో ఎవరూ పని చేయటానికి వీలులేదు. క్షురకర్మలు గానీ, రజకులు గాని ఇంటి పనివాళ్ళు గాని, ఇతర పనివాళ్ళు గానీ ఎవరూ అతనికి ఏ పని చేయటానికి వీలులేదు ..."[15] అని కొమరయ్య మరణం నిద్రాణమైన తెలంగాణాలో ఎంతటి చైతన్యాన్ని రగిలించిందో వర్ణించారు సుందరయ్యగారు.

గెరిల్లా సాయుధ పోరాటం :

పూర్వంలా యిప్పుడు రజాకార్లూ, పోలీసులూ, అధికార్లూ- నిర్బంధ లెవీ వసూళ్ళు చేస్తున్నా, అక్రమంగా పన్నులు వసూలు చేస్తున్నా, వెట్టిచాకిరి చేయించుకుంటున్నా, భూముల్ని స్వాధీన పరచుకుంటున్నా - చూస్తూ ఊరోక్కవడంలేదు ప్రజలు. సంఘం సహాయంతో తిరగబడుతున్నారు.

అయినా గూండాల, రజాకార్ల, పోలీసుల కిరాతక చర్యలు అంతకంతకూ ఎక్కువ కావడం మొదలెట్టాయి. గ్రామాలపై దాడులు ఎక్కువయ్యాయి. స్త్రీలను చెరచడం, అవమానం చెయ్యడం, ఇండ్లు తగలబెట్టడం నిత్యకృత్యమయింది. ప్రజల్ని బెదిరించి కొట్టి హింసించేవారు. వీరిని ఎదురోక్కవడానికి కేవలం కర్రలు సరిపోవని గ్రహించింది సంఘం సాయుధ గెరిల్లా పోరాటాలు అవసరమని త్వరలోనే గ్రహించారు.

ఆయుధ సేకరణ కోసం అన్ని విధాలా ప్రయత్నించారు బర్మార్లు, షాటుగన్లు, రైఫిళ్ళు సేకరించడం ప్రారంభమైంది. కేంపులమీద మెరుపుదాడి చేసి ఆయుధాలను లాక్కునేవారు. దేశ్‌ముఖ్‌లనుండి, తుపాకులు, రైఫిళ్ళు స్వాధీనం చేసుకునేవారు. పోలీసు, కస్టమ్స్ కేంద్రాలపైన, రైల్వే రక్షణ పోలీసులపైన దాడిచేసి ఆయుధాలను లాక్కునేవారు.

దుండగులను పటిష్టంగా ఎదుర్కొనేందుకు మొదట జిల్లా గెరిల్లా దళాలు ఏర్పాటయ్యాయి. ఆయుధాలన్నీ జిల్లా దళాలవద్ద ఉండేవి. దుండగులు గ్రామీణుల్ని బాధలు పెట్టేప్పుడు ఎదుర్కొనేందుకు గ్రామదళాల వద్ద ఆయుధాలు ఉండేవి కావు. అందువల్ల తాలూకా దళాలను ఏర్పాటుచేసి ఆయుధాలు అందించారు.

గెరిల్లా దళాలలో చేర్చుకునే ముందు ప్రతి సభ్యుడు ప్రమాణ స్వీకారం చేయవలసి ఉండేది.

"నేను గెరిల్లా బలగంలో చేరుతున్నాను. దోపిడీదారుల పాలనను అంతంజేసి ప్రజారాజ్యం స్థాపించటానికి నేను దృఢ నిశ్చయంతో ప్రతిన బూనుతున్నాను. శత్రువుపై పోరాడి నిర్మూలించడం, ప్రజలకు సహాయపడటం నా ఏకైక కర్తవ్యం. ఆయుధాలు ప్రాణంకంటే విలువయినవి. ఆయుధాలు సంపాదించటంలో, వాటిని కాపాడటంలో ప్రాణాన్నర్పించటానికైనా సంసిద్ధుడనై వున్నాను. నేనెన్నడూ పిరికితనాన్ని ప్రదర్శించి శత్రువుముందు తలవంచను. అమరవీరుల ఆదర్శాన్ని పాటిస్తాను. అరుణపతాకం ఎదుట చేసీ ప్రమాణం తీసుకుంటున్నాను"[16] అని ప్రతి సభ్యుడూ ప్రమాణం చేయవలసి ఉండేదని సుందరయ్యగారు తెలిపారు.

పై ప్రమాణాన్నిబట్టి గెరిల్లాదళ సభ్యులు ఎలాంటి ధైర్యసాహసాలు కలిగివుండాలో, ఎంతటి గుండె నిబ్బరం కలిగివుండాలో, ఎంతటి త్యాగాలు చేయవలసి ఉంటుందో తెలుస్తున్నది

కంపెనీ స్థాయిలో దళాలకు సరియైన శిక్షణ లేకపోవడం వల్ల, సరియైన సమన్వయం కుదరకపోవడంవల్ల గెరిల్లా దళాలను నిర్మించవలసి వచ్చింది. పోరాటానికి కావలసిన సాంకేతిక నైపుణ్యం పెంపొందించేందుకు గెరిల్లాలకు శిక్షణ యిచ్చారు. వివిధ దళాలమధ్య సమన్వయం, దాడులు జరిపేప్పుడు వ్యూహ రచన, ఆయుధ-మానవ శక్తుల సమన్వయం, ఆధునిక ఆయుధాలను ఉపయోగించే పద్ధతులు-ఆహార సరఫరా, ఎత్తుగడలు మొ॥ విషయాలలో గెరిల్లా దళాలకు శిక్షణ యిచ్చేవారు.

గెరిల్లా దళాలు మూడు విధాలుగా నిర్మింపబడ్డాయి.

(1) గ్రామదళాలు :

ఈ దళానికి చెందినవారు - ఆయా గ్రామాలకు చెందిన యువకులు. వీరు స్థానికంగా ఉంటూ రజాకార్లను పోలీసులను ఎదుర్కొనేవారు ప్రజల్లో పోరాటంపట్ల విముఖత కలుగకుండా చూసేవారు. స్థానిక భూస్వాముల్ని, అధికారుల్ని ఒక కంట కనిపెడుతూ ఉండేవారు. పరిమిత ఆయుధాలతో శత్రువును ఎదుర్కొనేవారు.

(2) నిర్మూలన దళాలు :

నిర్మూలన దళాలు ఎవరో తెలియకుండా రహస్యంగా వుండేవారు. ఈ దళంలో అన్నిరకాల వృత్తిపనులవారూ ఉండేవారు. శత్రువుల రాకలను గమనించి, పారలు పలుగులు మొ॥ పరికరాలతో రహదార్లకు గండ్లు పెట్టేవారు గోతులు త్రవ్వేవారు. శత్రువుల వాహనాలు రాకుండా చేసేవారు.

(3) గెరిల్లా దళాలు :

ఈ దళ సభ్యులు గ్రామాల్లో కాకుండా రహస్య స్థావరాల్లో పూర్తికాలం పనిచేస్తూ వుండేవారు. ఆధునిక ఆయుధాలను చేపట్టి

శత్రువుని ఎదుర్కొనేందుకు అన్నివేళలా సంసిద్ధులై వుండేవారు. శత్రువునుండి ప్రజలను కాపాడేవారు. గ్రామ దళాలకు ఈ దళాలకు మధ్య చక్కని అవగాహన ఉండేది. ఎత్తుగడలు వేయడంలో, వ్యూహరచనలో, రంగంలోకి దూకి పోరాడటంలో నిపుణులై ఉండేవారు.

ప్రజల రక్షణ కోసం ప్రాణాలకు తెగించి ఎన్నో సాయుధ చర్యలు జరిపారు. గెరిల్లా దళాల సాయుధ పోరాటం శత్రువుకు దడ పుట్టించేది. గెరిల్లాలు అనేక పోలీసు క్యాంపులను ముట్టడించి విజయం సాధించారు. ప్రజలలో భద్రతా భావం కల్పించి వారికి అండగా నిలిచారు. ఈ సాయుధ పోరాటం కేవలం తెలంగాణా విమోచన కోసమేగాక తర్వాత - అంటే స్వాతంత్ర్యం వచ్చింతర్వాత - పోలీసు యాక్షన్ పిదప కూడా కొనసాగించవలసి వచ్చింది.

భూమి సమస్యలు :

ఒకవేపు పోరాటాలు కొనసాగిస్తూనే మరోవేపు ప్రజల ఆస్తిపాస్తులకు భద్రత కల్పించవలసి ఉన్నది. ప్రధానంగా రైతుల్ని బాధించే భూ సమస్యల్ని పరిష్కరించవలసి ఉన్నది. ఆనాడు ప్రజల జీవితంలో ప్రధాన పాత్ర వహించాయి యీ భూమి సమస్యలు.

భూముల సమస్యల గురించి రావి నారాయణరెడ్డిగారు యిలా రాశారు.

"ఈ కాలంలోనే కొన్ని గ్రామాలలో భూముల సమస్యలు తలెత్తాయి. ఇవి మూడు విధాలైన సమస్యలు. ఒకటి: బంజరు భూములు దున్నుకునేవారికి పంచాలని. రెండు: తరతరాలనుంచి సాగు చేసుకునే భూములనుంచి కౌల్దార్ల దొరలు బేదఖలు చేస్తున్నారు. మూడు: అప్పుల పేరుతోను, ఇతర కారణాలతోను రైతులను పూర్తి అన్యాయంగా కాజేస్తున్న సమస్య. ఇవి ఆనాటి ప్రధాన భూసమస్యలు."[17]

ఉద్యమం మొదట కొన్ని ప్రాథమిక సౌకర్యాల కోసం, వెట్టిచాకిరి రద్దుకోసం, నిర్బంధ వసూళ్ళు చేయకుండా ఉండటం కోసం, చిత్రహింసలకు వ్యతిరేకంగా, అత్యాచారాలకు వ్యతిరేకంగా - విద్యా సంస్కృతుల కోసం - బాధ్యతాయుత పాలన కోసం సాగినా క్రమంగా అది భూమి కోసం - భుక్తి కోసం సాయుధ విమోచన పోరాటంగా మారింది.

"దున్నేవారికే భూమి"-

అన్న నినాదం శక్తివంతమైన ఉద్యమం ఫలితంగానే బయలుదేరింది. పేదరైతులకు యిచ్చిన అప్పుమీద వడ్డీలకు వడ్డీలు పెంచి రైతులు ఆ అప్పును తీర్చలేని పరిస్థితి కల్పించి వారినుండి భూస్వాములు భూములను లాక్కునేవారు. కౌలుకు భూమి సాగుచేసుకుంటున్న రైతులు కౌలు చెల్లించడంలేదనే నెపంతో భూములు స్వాధీనం చేసుకొబడేవి. కొన్ని భూముల్ని ఏ కారణం లేకుండానే - రైతుల్ని బేదఖల్ చేసి భూస్వాములు దౌర్జన్యంగా భూముల్ని సొంతం చేసుకునేవారు. భూస్వాములచేత అన్యాయంగా ఆక్రమింపబడిన భూముల్ని తిరిగి స్వాధీనం చేసుకుంటు 'దున్నేవారికే భూమి' అన్న నినాదంతో ప్రజాశక్తి ఉద్యమ రూపంలో పోరాటం సాగించింది. దీనికి ఆంధ్ర మహాసభతోపాటు ముఖ్యంగా కమ్యూనిస్టుల తోడ్పాటు ఎంతగానో ఉంది.

"ఈ కమ్యూనిస్టులవద్ద ఏ ఇంద్రజాలమున్నదో, ఏ మహామంత్రమున్నదో గాని, "ఏ బానిసోడ్ని దొర, నీ ముందు సాష్టాంగపడితా, నీ పాదాలకు మొక్కుతా" అంటూండేవాళ్ళను వీరులుగా మలచారు. మట్టిలోనుండి మహావీరులను సృష్టించారు."[18] అని సురవరం ప్రతాపరెడ్డిగారు ప్రశంసించినట్టు తమ పుస్తకంలో పేర్కొన్నారు సుందరయ్యగారు.

బంజరు భూముల సమస్య మరొకటి :

భూస్వాములు చేసే అన్యాయాలతో, అక్రమాలతో పేద రైతులు, వ్యవసాయ కార్మికులు విసిగిపోయారు. భూస్వాముల నుండి వైదొలగి బ్రతకాలంటే సొంతంగా సాగు చేసుకునేందుకు భూములు కావాలి అదీగాక భూమి వుంటే పరపతి వుంటుంది. అప్పు పుడుతుంది పంట చేతికి రాగానే అప్పు తీర్చగలమన్న ధైర్యముంటుంది. సాంఘికంగా ఆనాడు భూమి కలిగి వుండటం గౌరవప్రదం కూడా. అందుకే భూదాహంతో ఉన్న వ్యవసాయ కార్మికులు, కూలీలు, భూస్వాముల ఆధీనంలో వున్న బంజరు భూములను, ఫారెస్టు ప్రాంతంలో ఉన్న బంజరు భూములను ఆక్రమించుకున్నారు. అయితే బంజరు భూములు ఆక్రమించకుండా ఎన్ని అడ్డంకులు భూస్వాములు కల్పించినా ప్రజల శక్తి ముందు అవి ఎందుకూ కొరగాలేదు.

భూస్వాముల మిగులు భూముల ఆక్రమణ సమస్య ఇంకొకటి

ఆనాడు హైదరాబాదు ప్రభుత్వం విధించిన భూగరిష్ఠ పరిమితికి లోబడి, అనేక భూస్వాములకు చెందిన మిగులు భూముల్ని రైతులు ఆక్రమించాలని నిర్ణయించుకున్నారు. బంజరు భూముల ఆక్రమణలతో తమ అవసరాలు తీరని రైతులు ఇందుకు పూనుకున్నారు. అయితే మిగులు భూముల్ని అప్పటికే చాలా భాగం కౌలుదార్లకు అమ్మడం జరిగింది. భూదాహం తీరని గ్రామీణ ప్రజలు, అమ్మగా మిగిలిన భూముల్ని సులభంగా ఆక్రమించుకోగలిగారు.

భూమిని ప్రాణంతో సమానంగా చూసుకునే రైతులు భూస్వాముల దౌర్జన్యాలకు లొంగలేదు. బేదఖళ్ళకు భయపడ లేదు. "తనది" అన్న భావం రైతును వీరోచితంగా పోరాడేట్టు చేసేది.

భూస్వాముల దౌర్జన్యానికి వ్యతిరేకంగా - తన భూమి కోసం ప్రాణం పోయేదాకా పోరాడిన వృద్ధరైతు ఉదంతం ఒకటి 'వీర తెలంగాణా విప్లవ పోరాటం'లో వర్ణింపబడింది

"హుజూర్ నగర్ తాలూకా కోమట్లగూడెం గ్రామంలో వృద్ధ రైతు ఒకరు, భూమిని భూస్వామికి చెందినదిగా అంగీక రించ నిరాకరించినందుకూ, 'ఈ భూమి నాది' అని తుదకంటా అంటూనే వుండటంవంటి ఉదాహరణనుండి, భూదాహం ఎంతగా ఉన్నదీ, తెలంగాణా రైతులు ఎంతటి పట్టుదలతో ఈ పోరాటం సాగించిందీ విదితమవుతుంది...." [19]

ఆ ముసలివాణ్ణి చెద పురుగులు తినేసేవరకూ మూడు రోజులపాటు కాళ్ళు చేతులూ కట్టి పుట్టమీద పుంచారట అతడు స్పృహ తప్పేవరకూ, 'ఈ భూమి నాది' అని నిర్విరామంగా అంటూనే వున్నాడట.

ఉద్యమ ఉపసంహారణ :

1947 ఆగస్టు 15వ తేదీన దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. సంస్థానాల విలీనీకరణోద్యమం మొదలయింది. మొదట విలీనీ కరణకు ఒప్పుకోని నిజాం చివరకు భారత యూనియన్‌లో కలిసిపోక తప్పలేదు. ఆ తర్వాత భయంకరమైన పోలీసు యాక్షన్ జరగడం సాయుధ పోరాటం కొనసాగటం జరిగింది. రజాకార్లను అణచే నెపంతో పోలీసులు మారణహోమం సృష్టించారు. కమ్యూనిస్టులు గెరిల్లా పోరాట పంథాలో ఎదుర్కొన్నారు.

1948 సెప్టెంబరునాటి సాయుధ పోరాటం ఖమ్మం, కరీంనగర్, నల్లగొండ, వరంగల్ ప్రాంతాలలో ఉధృతంగా వ్యాపించింది.

ఎన్నో త్యాగాలుచేసి స్వాధీనం చేసుకున్న భూముల్ని తిరిగి భూస్వాముల కొప్పగించాలని భారత సైన్యం చేసిన ప్రయత్నాలకు వ్యతిరేకంగా సాయుధ పోరాటం కొనసాగించ వలసి వచ్చింది

వెట్టిచాకిరి, అక్రమ నిర్బంధ వసూళ్ళు, భూములనుండి బేదఖళ్ళు, అధిక వడ్డీలు, అధికారుల లంచగొండితనం, దోపిడీ, దౌర్జన్యం, హింసలనుండి బానిసత్వంనుండి - విముక్తి కోసం సాగి వీరోచిత సాయుధ పోరాటం ఆ లక్ష్యాలను సాధించి ఏ పోలీసు యాక్షన్ తర్వాత సాయుధ పోరాటం ఉపసంహరింపబడింది

పాదసూచికలు :

1) తెలంగాణా ఆంధ్రోద్యమము (మొదటి భాగం) -మాడపాటి హనుమంతరావు, -పుట. 1.
2) వీర తెలంగాణా నా అనుభవాలు - జ్ఞాపకాలు... -రావి నారాయణరెడ్డి, -పుట. 11.
3) వీర తెలంగాణా విప్లవ పోరాటం-పుచ్చలపల్లి సుందరయ్య -పుట. 28
4) తెలంగాణా ఆంధ్రోద్యమము -మాడపాటి హనుమంతరావు -పుట. ౫౮.
5) వీర తెలంగాణా విప్లవ పోరాటం -కామ్రేడ్ సుందరయ్య -పుట. 33.
6) తెలంగాణా ఆంధ్రోద్యమము -మాడపాటి హనుమంతరావు -పుట ౧౭.
7) తెలంగాణాలో గ్రంథాలయోద్యమం - సాధించిన అపూర్వ ప్రగతి, ఆంధ్రజ్యోతి - దినపత్రిక, 8.12.1968. -పుట 11.
8) ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమం — డా॥ వెలగా వెంకటప్పయ్య, -పుట. 94.
9) సారస్వత వ్యాసములు-హైదరాబాదులో ఆంధ్ర సారస్వత వికాసము - (మొదటి సంపుటము) దేవులపల్లి రామానుజ రావు, -పుట. 450
10) ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు : ప్రయోగ ములు -డా॥ సి. నారాయణరెడ్డి, -పుట. 522.
11) వీర తెలంగాణా విప్లవ పోరాటం -కామ్రేడ్ సుందరయ్య -పుట. 38.
12) తెలంగాణా ఆంధ్రోద్యమము రెండవ భాగము -మాడపాటి హనుమంతరావు, -పుట. ౧౦
13) వీర తెలంగాణా నా అనుభవాలు - జ్ఞాపకాలు — రావి నారాయణ రెడ్డి, -పుట 35.
14) వీర తెలంగాణా విప్లవపోరాటం -కామ్రేడ్ సుందరయ్య -పుట 57.
15) వీర తెలంగాణా విప్లవ పోరాటం -కామ్రేడ్ సుందరయ్య -పుట 60.
16) వీర తెలంగాణా విప్లవ పోరాటం -కామ్రేడ్ సుందరయ్య -పుట. 93.
17) వీర తెలంగాణా నా అనుభవాలు - జ్ఞాపకాలు — రావి నారాయణరెడ్డి. -పుట. 56
18) వీర తెలంగాణా విప్లవ పోరాటం -కామ్రేడ్ సుందరయ్య -పుట. 143.
19) వీర తెలంగాణా విప్లవ పోరాటం -కామ్రేడ్ సుందరయ్య -పుట. 153.

## శారీరక రాజ్యంలో...!

సంపూర్ణ అంగాభివృద్ధి విహీనమైనను
'బాల్యరాజు'
పరిపాలనా విధానం - సౌఖ్యకరం
నిత్యకళ్యాణం పచ్చతోరణం - మధురయుగం!
సర్వాంగ వికాస విలసితమైన
'యౌవనరాజు'
పరిపాలనా సౌభాగ్యమేమో
వర్ణనాతీతం!
మూడు పువ్వులు - ఆరు కాయలు - సువర్ణ యుగం!
సమస్త అంగ వినాశమైన
'ఓ రారాజు'
పరిపాలనా క్రమమేమో
దుర్భరం!
కరవులు - కాటకాలు - క్షీణయుగం!

## చంద్రబాబు నాయకుడు!

చల్లని నవ్వులతో మచ్చు చల్లుతూ
చుక్క కన్నెలతో మజా ఉడాయిస్తూ
అందిన జుట్టు, అందకున్న కాళ్ళు
పట్టుకుంటూ
కలవాని బావమరిదయి
ఆకాశ దేశానికి రాజయిన మాయలాడు!
వేలకొలది నడకలతో చమకాయిస్తూ
రవితేజములతో దర్జా చలాయిస్తూ
గురువుకే పంగనామం పెట్టి
సుధాంశునిగా కీర్తికెక్కిన జాణరకాడు!
పిన్నలకూ పెద్దలకూ
ప్రీతి కలిగిస్తూ
నూలుపోగుల ముడుపు లందుకుంటూ
దోషాకరుడయి
కళానిధిగా దండాలందుకుంటున్న నేర్పుకాడు!

## మనిషిని...!

ప్రేమికునిగా మార్చి
తన మనస్సులోనే
బంధించుకొంటుంది
పదిలంగా - "వనిత"!
రససిద్ధునిగా మార్చి
ఉర్వీజనుల
నోళ్ళకెక్కిస్తుంటుంది
బహిరంగంగా - "కవిత"!

## ...కావాలోయ్ నేడు!

పోటెత్తిన సప్తసముద్రాల్నే
కాగిదాలుగా
ఉదయ సూర్యబింబాన్నే
శాయిదవితిగా
కాళికా నాళికనే
పాళీగా
సృష్టి చేసుకొని
'ఘాటెక్కిన గంధక ధూమం'
'రగులుకొనే రాక్షసిబొగ్గు పొడి'
'బుగులుకొనే బుక్కా గుండాను'
కలగలిపిన
వైప్లవ్య గీతాల్ని రచిస్తూ
త్రాచుల్లాగా, రేచుల్లాగా
జనసందోహాన్ని
చెలరేగింపజేస్తూ
'మరో ప్రపంచానికి' గొనివెళ్ళే
"కవి రాక్షసులే కావాలోయ్ నేడు"!
శనిదేవత రథచక్రపు టిరుసులలో పడి
నలిగిపోతున్న
ఈ లోకాన్ని ఉద్ధరింపటానికి!

## కృష్ణ పక్షమపిరమ్యం!

తారకలాటి
కవితాసుందరి
కురుల్లోని
కాటుక కళ్ళల్లోని
నొసటి కస్తురి బొట్టులోని
చెక్కిలి అగరు చుక్కలోని
మరకతశ్యామ దేహంలోని
"వంపు_సొంపులు"
పుచ్చుకొన్నది గనుకే
నీ కావ్యం
మహాకవి
"కృష్ణపక్షమైనను"
జిగేల్‌మంటూ వగలొలికిస్తున్నది
కవిచంద్రుల హృదయాల్లో!

## మనవారు!

అన్నమయ్య త్యాగయ్యలను
నన్నుతించటంలో ఘనులు!
కాని
అన్నమయ్యా అంటే
ఓ రెండు మెతుకులేసి
త్యాగయ్యలు కానేరని హీనులు!

## గుండె - చెట్టు!

ఇంతకాలం
"జ్ఞాపకాల నీడలకు" చోటిచ్చి
ఇప్పుడు
ముసలితనం పైబడగానే
దాని తాపానికి జడిసి
దూపటిల్లినట్లుగా
వాటినన్నింటిని త్రాగి
నన్ను
"నీడలేనివాణ్ణిగా" చేస్తున్నది!

## సఖ్యుబిళ్ళ!

జగతిని నిర్మాలిన్యం గావించిన
కరుణ
"రామాయణం" — !

## అగ్గిపుల్ల!

ధరిత్రినే అంటించిన
పగ
"భారతం"— !

## సుత్తెలు - కొడవళ్ళు!

పురాణ కవులు "యజ్ఞోపవీతాలు"!
ప్రబంధ కవులు "శ్రీగంధపు చెక్కలు!"
ఆధునిక కవులు "సుత్తెలు_కొడవళ్ళు"!

## నన్నయ్య!

తెలుగుభాషా కర్పూరాన్ని
ధగధగ వెలిగింపజేసి
బుగ బుగల్ని
అబ్ధిపర్యంతం
అభివ్యాపింపజేసిన
"హారతి పళ్ళెం"!

## "తిక్కన"

హరహరులను
అద్వైతమూర్తిగా
శ్రీమహాభారత సౌధంలో
నిబంధించిన
"తలుపు గొళ్ళెం"!

## ఎఱ్ఱన!

ఆద్యులు చూపిన
జాడల్లో
అడకువగా
కదను తొక్కిన
"గుఱ్ఱపుకళ్ళెం"!

శ్రీ కె. కిశోరుబాబు; శ్రీ కె. అశోకుబాబు

శ్రీ కపిలవాయి లింగమూర్తి

# తెలుగు శతకాలు: యతి ప్రాసల పరిశీలనం

శతక వాఙ్మయం తెలుగులో విస్తరించి పుష్టినందినంతగా మరే వాఙ్మయంలోను జరుగలేదనటం అతిశయోక్తి గాదు.

ప్రారంభంలో దేవతాస్తుతితో మొదలైన ఈ శాఖ రాను రాను నీతి, శృంగార, వైరాగ్య, అధిక్షేప, హాస్యాది వివిధ విషయాల నెన్నిటినో తనలో నిముడ్చుకుని ఇంతింతై వటుడింతయై అన్నట్లు ఈనాడు విశ్వరూపం ధరించిందికాని వీనిలో వస్తువైవిధ్యం వచ్చినంతగా ఛందోవైవిధ్యం రాలేదు.

సంస్కృతంలో లయాత్మకమైన వివిధ వృత్తాలలో రచింపబడిన పెక్కు దేవతా స్తుతులున్నవి. సంఖ్యా విషయంలో కాకున్నా మకుట నియమంలో మన శతకాలకవి మార్గదర్శకమైనవి కాని వానిలో వచ్చినంత వృత్తవైవిధ్యం తెలుగులో రాలేదు.

మకుటం అన్నపుడది శతకాలకు తరచుగా చివరనే నిలుస్తుంది కాని మందపాటి రామకృష్ణకవి తన శ్రీరామ శతకాన్ని నిడుదవోలు సుందరంపంతులుగారు తమ హరహర శంభో శతకాన్ని మకుటంతోనే ప్రారంభించి నిర్వహించినారు. టంగుటూరి సుబ్బకవి కోదండరామ శతకాన్ని "వీరా కోదండ రామ వినుతవిరామ, వరదా కోదండరామ వరశుభనామా" అని కంద చతుర్థపాదంలో మొదటి గణం పిమ్మట మకుటాన్ని నిబంధించి రచించినాడు. ఇట్టిదే తిరుపతివారు ప్రచురించిన శ్రీ వెంకటేశ్వర లఘు కృతులలో ఒక వెంకటేశ్వర శతకం ఉంది.

తెలుగు కవులు శతక రచన రెండు దశలలో చేపట్టినారు. ప్రారంభంలో కవితాభ్యాసం కొఱకు రచింపబడినవి కొన్ని అయితే విస్తృతమైన లోకజ్ఞానం పొంది మనఃపరిపాకం కలిగిన పిమ్మట తనలో జీర్ణమైపోతున్న విషయాన్ని లోకానికి తెలుపటానికి రచింపబడినవి మరికొన్ని. వీనినడుమ భక్తుడు భగవంతునికి ఆత్మసమర్పణ చేసికొని చెప్పినవి మరికొన్ని.

ఈనాడీ మూడువిధాల శతకాలపై సాహిత్య చరిత్రలు వచ్చినవికాని అవి శతకాలను వస్తువైవిధ్యాన్నిబట్టియే వివేచించినవి. ఛందోవైవిధ్యాన్ని వాని యతి ప్రాసలను గుఱించి వివేచన జరుగలేదు. ఛందో వివేచన జరిగితే కవులా శతకానికి ఆ వృత్తాన్నే ఎందుకు ఎన్నుకున్నారన్న విషయం పాఠకులకు అవగతమయ్యేది. అంతేకాక తెలుగు కవుల చేతిలో ఏ పద్యం ఎక్కువగా నడిచింది కూడా తెలిసేది.

యతి ప్రాసల పరిశీలన జరిగినపుడు వాని విస్తృతి ఏ విధంగా జరిగింది, కవుల చేతిలో ఏయే యతులు ఎక్కువగా తిరిగినవి కూడా అవగతమయ్యేది.

మన శతకాలను వృత్తరీతిగానే కాక మకుటరీతిగా కూడా పరిశీలించవలసి ఉంది. అది పద్యాన్ని ఏ విధంగా నియమించిందో తెలుస్తుంది. మకుటం పద్యంలో యతి స్థానం దాటిన పిమ్మట ఒదిగితేనే కాని లేకుంటె అది యతిస్థానాన్ని, పాదం మొత్తం ఆక్రమించినపుడు వృత్తాన్నే కాక దాని ప్రాసను గూడ ఒకే రాటకు కట్టివేస్తుంది.

మకుటం యతి స్థానంనుండి విరిగినపుడు లేదా చివరి పాదాన్ని పూర్తిగా ఆక్రమించినపుడు ఆ పద్యం నడక ధారాళంగా ఉండి పఠితకు సుగమం అవుతుంది కాని కవికి మాత్రం యతి ప్రాసలతో సర్కసు చేయవలసి వస్తుంది. అంతేకాక అది యతి నుండి విరిగితే ఒకవిధంగా, దాన్ని దాటి విరిగితే మరోవిధంగా, పాదం పూర్తిగా వ్యాపించినపుడొకవిధంగా, దాన్ని దాటి పైపాదం లోనికి చొచ్చి ఉన్నపుడొకవిధంగా పద్యగమకం మారుతుంది.

పద్యంలో యతి ఎట్లా విరిగినా అది శబ్దాన్ని అనుసరించి విరిగితేనే అందం, చదవటానికి గూడా సొగసు కాని లేకుంటే ఆ పద్యం నడక కుంటక తప్పదు. చూడండి-

1. పదనమద్దేవమునికదం-బలలితాంబ! లలితాస్తోత్ర సీస శతకం - శిష్టుసర్వశాస్త్రి

2. దాస, పోష బిరుదాంక రఘుకులాం - బుధిశశాంక! భద్రాది రామశతకం భల్లా పేరయకవి.

3. రక్షణ పరాయణుండనా - రాయణుండ! దశావతార సీసాలు, సత్యవోలు భగవత్కవి అనే మకుటాలు.

1. వారిరుహబంధు సుతమిత్ర-వాయుపుత్ర! వాయుపుత్ర శతకం. శిష్టు కృష్ణమూర్తి

2. విజితపరయూధ కాశికా-విశ్వనాధ! విశ్వేశ్వర శతకం. వేల్పూరి విస్సన్నకవి.

అనే మకుటాలంత సరళంగా శ్రావ్యంగా వినిపించవు.

1. శత్రుసంహార వెంకటా-చలవిహార! -శత్రుసంహార శతకం

2. వెల్లూరి వెంకటాచలరమణా! -సుభాషిత త్రిశతి.

అనే మకుటాలలో ఈనాడు చలంగారి పేరుచేత శత్రు సంహార శతకంయొక్క విరుపు మనకు పరిచితంగానే అనిపించినా న్యాయానికది రెండవదానివలె టకార దీర్ఘంపైనుండి విరగటమే శ్రావ్యం. కాబట్టి మకుటాన్ని నిబంధించేటపుడు కవికి ఈ దృష్టి అవసరం.

మన శతకాలను మకుటం యతినుండి విరిగినవానిని యతి శతకాలని, పాదం మొత్తం ఆక్రమించినవానిని ఏకప్రాస శతకాలని రెండుగా వింగడించవచ్చు. అటువంటి కొన్ని శతకాలను గురించి తెలుపటమే ఈ వ్యాసంయొక్క ఉద్దేశం.

తెలుగు కవిత్వానికి గణనియమం సంస్కృతంనుండి, యతి తమిళం నుండి, ప్రాస కన్నడం నుండి సంక్రమించినవని ఆధునికుల మతం.

ఆద్యోవళి ర్ద్వితీయోవర్ణః ప్రాస్తోఽత్ర పాదపాదేషు
స్వస్వచరణేషు పూర్వః ప్రాసస్సర్వేష్వపుచైక ఏవస్యాత్.

అని చింతామణి యతి ప్రాసలను నిర్వచించింది.

చరణ చరణమునకాద్య-క్షరములు వళులయ్యె నవియె క్రమమున దత్త
చ్చరణములలోన జెప్పన-యిరవున బొందింపవలయు నెల్ల కృతులలోన్

అని అప్పకవి చెప్పినాడు.

యతికి స్వరమైత్రి హల్మైత్రి రెండూ అవసరం. ప్రాసకు స్వరమైత్రి అక్కరలేదు. కాని హల్మైత్రి అంగీకరింపబడలేదు. ఆ కారణంగా ప్రాసకంటె యతి భూమికి బాగా విస్తరించింది

ఏకప్రాస శతకాలు కవులు ప్రయత్నపూర్వకంగా రచించినవే కాని యతి శతకాలావిధంగా అనటానికి వీలులేదు. అవి కవులచేత యాదృచ్ఛికంగానే శతక వాఙ్మయంలో విస్తరిల్లినవి అనవలసి ఉంది.

యతులలో స్వరవళులు, వ్యంజనాక్షర విరతులు అని రెండు భేదాలున్నవి. స్వరవళులు అచ్చులకు సంబంధించినవి. అచ్చులు తెలుగు పద్యాలలో కొన్నింట సంధివశంగా, మరి కొన్నింట స్వతంత్రంగా యతిస్థానంలో నిలిచినవి. సంధిగతంగా ఉన్నవన్నీ సాధారణంగా సంస్కృతశబ్దాలలోనే ఉన్నవి. తెలుగు పలుకుబడులలోనే అజాదులు స్వతంత్రంగా ఉండి కనిపిస్తవి.

మన అచ్చులలో మొదటిది అకారం. దానికి స్వరవళులలో ఐజాలు, సరసవళిలో యహలు చెల్లుతవి. ఇంతవరకు వచ్చిన శతకాలలో మనకు అకారం ఒక్కటే యతిస్థానంలో ఎక్కువగా కనిపిస్తుంది.

మంగళాద్రి నృసింహ, మహిషాసురమర్దని, వెంకటనగాధిపతి, అమృతాంజన, అల్లామాలిక్, ఆత్మారామ శతకాలు దీనికి ఉదాహరణంగా ఉన్నవి. వీనిలో అది మంగళ+అద్రి, మహిష+అసుర, వెంకటనగ+అధిపతి, అని మొదటి మూడు శతకాలలో సవర్ణదీర్ఘంలో ఉంది. తక్కినవాని మకుటాలలో స్వతంత్రంగా ఆద్యక్షరమై నిలిచిరేది.

యతి స్థానంలో ఇకారానికి ఈదులవాయి రామస్వామి శతకం, ఎకారానికి ఎఱగుడికన్న శతకం ఉదాహరణంగా ఉన్నవి.

యతిలో ఇకారేకారాలు పరస్పర మిత్రాలు కాబట్టి పై రెండిటి యతులు ఒకేతీరుగా నడిచినవి. తెలుగు పలుకుబడులలో స్థాన ప్రయత్నాన్ని అనుసరించి యకారం ఎకారానికి బదులుగా వినిపిస్తుంది. ఎల్లయ్యకు యల్లయ్య అని, ఎఱ్ఱయను యఱ్ఱయ అని వాడు వ్యవహరిస్తుంటారు. అందుచేత ఎఱగుడికన్న శతకంలో కవి ఎకారానికి యకారాన్ని గూడ యతిగా చెల్లించినాడు. ప్రాచీన తాళప్రతులలో యిప్పటికి యింకా యిటువంటి ప్రయోగాలు కనిపిస్తూనే ఉంటవి.

ఇవి తప్ప తక్కిన అచ్చులలో శతకాలు రాలేదు.

వ్యంజనాలు యతి స్థానంలో ప్రాణి విరామాలపేర పరస్పరం మూడు విధాలుగా చెల్లుతూ ఉంటవి. ఉదా:- క-కై కౌ; కి-కృ కె; కు-కృ,కొ.

ఈ ప్రాణి విరామాలతోపాటు యతికి వ్యంజనమైత్రి కూడ ఉండవలె కాని త్రిపురసుందరి శతకంలో శ్రీనివాసకవి మకుటానికి ఈ యతి నియమాన్ని పాటించలేదు. త్రిపురసుందరి, యాదిపురీ నివాసినీ! అనేది దీని మకుటం, ఇందులో "సు" యతి స్థానంలో ఉంది. కవి దానికి వ్యంజనమైత్రిని మాత్రమే పాటించి మకుటంలో పూర్వపదాన్ని వేసినాడు. ఇది ఉత్పల శతకం, పంచపాది కూడాను.

లక్షణ శిరోమణి వ్యంజన నియమం లేకుండ కేవలం స్వరమైత్రిలో దేశీయమనే ఒక యతిని చెప్పింది కాని ఈ శ్రీనివాస కవిగారి యతి దానికి విరుద్ధంగా ఉంది. అందుచేత దీన్ని యిక్కడ చెప్పినాను ఏమైనా యతికి వ్యంజనమైత్రి ఉన్నపుడే అది యతిగా ముద్రపడుతుంది.

సామాన్యంగా కవులు ప్రారంభించిన అక్షరాన్నే మళ్ళీ యతి స్థానంలో నిలుపటానికి చూస్తారు. అపుడు దాన్ని సవర్ణ యతి అనవచ్చు. అది సాధ్యం కానపుడే దాని మైత్రిని గురించి ఆలోచించవలసి ఉంటుంది.

వర్గాక్షరాలు బిందుపూర్వకాలై తమ అనునాసికాలకు, అది లేనపుడు అనునాసికాన్ని విడిచి తక్కినవానికి మిత్రమవుతవి. లక్షణశాస్త్రంలో వీనికి వ్యంజనాక్షర విరతులని వ్యవహారం.

మొదటివర్గంలో కకారానికి స్వవర్గజాలే కాక విశేషవశితో ఙకారం, సాదృశ్య సంబంధవడితో క్షకారం చెల్లుతవి.

గొట్టుముక్కల రాజగోపాల, మగటపల్లి కామయ, కవి చౌడప్ప, గోపబాల, తరికొండ నృసింహ, రుద్రకోటీశ్వర శతకాలు కకారయతికి ఉదాహరణాలుగా ఉన్నవి. వీనిలో చివరి రెండు శతకాలు తప్ప కకారం అన్నిటిలో అత్వసహితంగానే ఉంది.

పద్యంలోని యతి స్థానం పదాదిగాని, పదమధ్యంగాని, పదాంతంగాని ఏదైనా కావచ్చు కాని అది పదాది అయినపుడే ఆ విరుపులో సరసత్వం ఉంటుంది.

రాజగోపాల శతకంలో గొట్టుముక్కల పురౌకా! రాజ గోపాలకా! అని ఈలాగే రఘువీర శతకంలో రఘువీరా! జానకీ నాయకా!" అనే మకుటాలలో యతి స్థానాలు పదాంతాలలో నిలిచినవి. ఇది లాక్షణిక దోషం కాకున్నా పద్యాన్ని ఎత్తుగడల ప్రకారం విరిచి చదువుకునేఅపుడే విరుపులు శ్రావ్యంగా భాసించవు.

ఏ పేరైనా యతి స్థానంలో సొంత అక్షరాలను విడువ కుండా ఇతరాలను కలుపుకోకుండా విరిగినపుడే అది సొగసు. దాని అందం పదం తప్పి విరిగినపుడు రాదు కాబట్టి యతి స్థానం సమాన మధ్యగతమైనపుడది శబ్దాదియై ఉండటం మంచిది.

తరికొండ నృసింహ శతకంలో "కొండ" అనే పదం పైనుండి విరుగుతుంది. అందుచేత తరికొండలో పూర్వపదం యతి పూర్వానికి కలిపినా ఇక్కడ కొండ అని విరగటంలో అశ్రావ్యత కనిపించదు. ఈలాగే "రుద్రకోటీశ శివా!" అనే మకుటం గల రుద్రకోటీశ శతకం శ్రీకాకుళ పురేశుని పై రచింప బడింది.

ఇది కంద శతకం. చతుర్థ చరణంలోని అర్థపాదం "కోటీశ శివా!" అని విరుగుతుంది. ఈ విరుపులో దోషమేదీ లేదు కాని పాదాదిలోగల శ్రీకాకుళం శ్రీకా-కుళ అని విరుగుతూ కొన్ని పద్యాలలో అది "కుళపురం" అవుతుంది కాబట్టి విపరీతార్థాన్ని కలిగించే విరుపులెప్పుడైనా పద్యంలో దొర్లకుండా చూడవలసి ఉంది.

ఇదే వర్గం - కవర్గం - లో గకారానికి గువ్వలచెన్న, ఙకారానికి జ్ఞాన ప్రసూనాంబ శతకాలు ఒక్కొక్కటి ఉదాహర ణంగా ఉన్నవి

కకారానికి ఙకారం విశేషవశితో చెల్లినా యతిస్థానంలో నిలిచినపుడు కకారం వేరు, ఙకారం వేరు. ఙకారానికి విశేష వశిలో కవర్గం, బిందు యతితో బిందుపూర్వకమైన చవర్గం రెండూ చెల్లుతవి.

చవర్గానికి శషసలు క్షకారం కూడా చెల్లుతవి. ఈ వర్గంలో చిలుత వజీరు, చెల్లయ్యమ్మారావు శతకాలు రెండు మాత్రమే కనిపిస్తున్నవి. ఈ రెండు కంద శతకాలు. మకుటం అర్థపాదం నుండి చక్కగా విరుగుతుంది.

టవర్గం యతిలో నిలిచిన శతకాలింకా యింతవరకు కని పించలేదు బిందుపూర్వకాలైనపుడు ట త వర్గాలు రెండూ అనుస్వార సంబంధంతో పరస్పరం మిత్రాలౌతవి. తవర్గంలో రఘుకులతిలక, వెంకటేశ్వర శతకాలు తకారానికి, ధీరధీ, దాశరధీ, సాధుమేధానిధీ శతకాలు ధధలకు, నఖగర్తపురాంజ నేయ, నాగబ్రహ్మ శతకాలు నకారానికి ఉదాహరణంగా ఉన్నవి.

ఈ శతకాలలోని తథదధలు బిందుపూర్వకాలు కావు కాబట్టి ఈ శతకాలలోని వర్గజ యతి తప్ప అనుస్వార సంబంధ యతికి ప్రసక్తి కలుగలేదు.

గోరుగుంతల ఆంజనేయ శతకంలో "నఖగర్తపురాంజనేయ, నతజనగేయా!" అని మకుటం పాదాన్ని పూర్తిగా ఆక్ర

మించింది. అందువల్ల సవర్ణసంధి తప్ప యిక్కడ మరో యతికి అవకాశం లేదు. నాగబ్రహ్మ శతకం కందకృతి. మకుటం దీనిలో చతుర్థపాదంలో అర్థపాదంగా విరుగుతుంది. సంస్కృతంలో "మోనుస్వారః" అనే సూత్రంచేత కొన్ని స్థలాలలో నకారానికి మకారం అవుతుంది. దాన్ని అనుసరించి ఈ కవి నమలకే కాక బిందుపూర్వకమైన అంతస్థోష్మలను గూడా యతిగా చెల్లించినాడు.

ఇక చివరిదైన పవర్గం యతిలో నిలిచిన శతకాలలో శివముకుంద, రంగశాయి దక్షపురి భీమేశ్వర, ఆర్తరక్షామణి, దేవచూడామణి శతకాలు కనిపిస్తున్నవి.

శివముకుంద; పరమానందా-రంగశాయి మన ప్రాలగలందు అనే మొదటి రెండు శతకాల మకుటాలలోని పకారం బిందు పూర్వకంగాదు కాబట్టి వీనిలోగూడ వర్గజ యతులే పాటింపబడినవి. దీనికి అభేద వర్గంలో వకారం కూడ చెల్లుతుంది.

దక్షపురి భీమేశ్వర శతకంలో దక్షపురభీమేశా! అని మకుటం పురశబ్దంలో విరుగుతుంది.

పకారం ఉత్వసహితమైనపుడు దానికి బోలిక వడిననుసరించి మువర్ణకం ముకార యతిననుసరించి ముపర్ణం చెల్లుతవి.

బకారానికి బలపదరి శతకం ఒక్కటే ఉదాహరణంగా ఉంది కాని అదిపు డలభ్యం.

ఈ వర్గంలో - పవర్గం - ఆర్తరక్షామణి, దేవ చూడామణి శతకాలు రెండు శ్రీరామ సంబోధనాత్మకాలు. రామా! ఆర్తరక్షామణీ! రామా దేవచూడామణీ! అని మకుటం రామశబ్దంలోని మకారంపైనుండి విరుగుతుంది.

ఇట్లా సంబోధనాంతం యతిస్థానంగా నిలిచినపుడు ప్లుత వడిననుసరించి దానికి మరో ప్లుతం, లేదా ఆ ప్లుతస్వరం గూడా యతిగా చెల్లుతవి. అంతేకాక వీనిలో యతిస్థానం మకారం కాబట్టి దీనికి బిందుయతితో పవర్గం, మవర్ణ విరామంతో బిందుపూర్వకమైన అంతస్థోష్మాలు చెల్లుతవి.

వర్గపంచకం పిమ్మట చెప్పదగినవి అంతస్థాలు. వీనిలో యకారానికి ఉద్దండరాయ, రేఫానికి రఘువీర, లకారానికి లక్ష్మీనృసింహ, ఎలకూచి బాలసరస్వతి కృత సుభాషిత త్రిశతి, వకారానికి రమాధీశ్వర, విక్రమదేవ, కందుల చినవెంకన్న శతకాలు ఉదాహరణంగా ఉన్నవి.

ఉద్దండరాయ శతక మకుటం పూర్వపదవ్యాపి. మద్దాలి యుద్దండరా, యజయశ్రీ సువిధేయ! భక్తజనగేయా! నిత్యభాగ్యోదయా! అని యీ మకుటం యకారాంత్య ప్రాసతో సంఘటింపబడింది. వృత్త శతకాలలో యింత పెద్ద మకుటం అరుదు.

రఘువీర శతకంలో ఒంటిమిట్ట రఘువీరా! జానకీనాయకా! అనేది మకుటం, దీనిలో యతి రఘువీరా! అనే సంబోధనాంతంలో ఉంది. ఇది సంబోధనాంతం కాబట్టి దీనికి ప్లుత యతిలో అకారం అభేద యతిలో లకారం చెల్లుతవి.

లకారానికి రేఫకు చెల్లిన లక్షణమే చెల్లుతుంది. రేఫకు శకటరేఫం చెల్లదు కాని లకారాని దొడ్డలకారం చెల్లుతుంది. దానితోపాటు కవిగారీ శతకంలో అఖండ యతినిగూడ పాటించినారు.

వకారానికి విక్రమదేవ - కందుల చినవెంకన్న శతకాలు రెండుదాహరణంగా ఉన్నవి. వీని మకుటం యతి స్థానంనుండి విరుగుతుంది.

వకారానికి అభేద యతిలో బకారం, అభేదవర్గంలో పకారం, సంభావనావడిలో మకారం చెల్లుతవి.

ఊష్మలలో శకారానికి శిఖినరసింహ శతకం ఒక్కటే ఉదాహరణంగా ఉంది. ఇది చిన్న హోబలంలో ఉండే నరసింహునిపై రచింపబడింది.

శకారానికి అభేద యతిలో సకారం ఊష్మవిక్రాంతిలో షకారం సరసపళిలో చఛజఝలు చెల్లుతవి.

షకారం యతిలో ఉన్న శతకాలింతవరకు కనిపించలేదు. సకారానికి సత్యనారాయణ, సత్యవ్రతి, సంజీవరాయ, సంపగిమన్న, సిరిసిరిమువ్వ శతకాలు వచ్చినవి. యతిలో శకారానికి చెల్లిన నియమాలే దీనికిగూడ చెల్లుతవి.

ఊష్మలలో హకారం యతిగా వచ్చిన శతకాలున్నవి గాని అది యతి స్థానంలో నిలిచిన శతకాలు యింకా రాలేదు.

సంయుక్త యతులు :

వ్యంజనాక్షర విరతులలో సామాన్యయతులు సంయుక్తాక్షర యతులని రెండు భేదాలున్నవి.

హల్లు మరో అక్షరంతో కలిసినపుడది సంయుక్తం అనబడుతుంది. సంయుక్తలేఖనంలో ప్రస్తుతం మన తెలుగులో చిన్న తిరకాసుంది. మనం సగం మాత్రమే పలికే అక్షరాన్ని పూర్తిగాను పూర్తిగా పలికేదాన్ని వత్తురూపంలో సగంగాను వ్రాస్తున్నాము. ఈ విషయంలో దేవనాగరి లిపి సక్రమంగా ఉంది.

సంయుక్తాక్షరం యతిలో ఉన్నపుడు దానిలో పూర్ణాక్షరానికి గాని లేదా తక్కినదానికిగాని యతి వేయవచ్చు. ఈ విషయంలో ఇది సామాన్య యతికంటె సులభం అనిపించినా ప్రతిదానికి మనకు సంయుక్తాక్షరాలతో కూడిన పదజాలం లభ్యం కాదు. అందుచేత సంయుక్త యతులలో వచ్చిన శతకాలు చాలాలేవు.

తిరుమల శ్రీ వెంకటేశ, భ్రమరాంబా చెన్నమల్లేశ్వర—భర్గాపార్వతీవల్లభా! అని మూడు శతకాలు మాత్రమే ఈ యతులలో కనిపిస్తున్నవి.

తిరుమల శ్రీ వెంకటేశ త్రిదశాధీశా! - అనే మకుటంలో "త్రి" భ్రమరాంబా చెన్నమల్లేశ్వరా! అనే మకుటంలో "భ్ర" భర్గా! పార్వతీవల్లభా! - అనే మకుటంలో "ర్గ" అనే సంయుక్తాలు యతి స్థానాలలో ఉన్నవి.

సంయుక్తాలలో శ్రీకారానికి మిక్కిలి ప్రాముఖ్యం ఉంది. అది కావ్యాలలో కృత్యాదినే కాక, దేవతా వాచకాలకు, మహా పురుష నామాలకు కూడా ముందు నిలుస్తుంది. అందుచేత శ్రీకార యతిలో గోపాల, సకలేశ్వర, శ్రీ కాళహస్తీశ్వర, శ్రీరంగేశ్వర, సూర్యనారాయణ, పురుషోత్తమదేశిక, వేణుగోపాల శతకాలిప్పటికి కనిపిస్తున్నవి.

శ్రీకారంలో శకారం, రేఫం రెండూ ఉన్నవి కాబట్టి దీని పరిధి చాలా విస్తృతంగా ఉంది.

దేవకీనందన శతకంలో కృష్ణా! దేవకీనందనా! అనేది మకుటం. దీనిలో ఋకారంతో కూడిన షకారం యతి స్థానంలో నిలిచి ఋకారం షకారం యతిలో లేని లోటును తీర్చుతుంది.

## 1. కొన్ని యతి శతకాలు :

| శతకం పేరు | వృత్తం | యతి | కవి పేరు |
|---|---|---|---|
| 1) మంగళాద్రి నృసింహ | కం | అ | తాడేపల్లి పానకాలరాయకవి |
| 2) మహిషాసురమర్దని | చ | అ | దిట్టకవి రామచంద్రకవి |
| 3) వెంకట నగాధిపతి | ఉ | అ | మంచెళ్ల కృష్ణకవి |
| 4) సుభాషిత త్రిశతి | కం | అ | ఎల్లూరి నరసింగకవి |
| 5) అమృతాంజన | కం | అ | కరినారాయణాచార్యులు |
| 6) అల్లామాలిక్ | ఉ | అ | దావూదు కవి |
| 7) ఆత్మారామ | కం | ఆ | పరశురామపంతుల లింగమూర్తి |
| 8) ఈదులవాయి రామస్వామి | ఉ | ఈ | పరశురామపంతుల రామమూర్తి |
| 9) ఎఱగుడికన్న | కం | ఎ | ఎరగుడి కన్నయ |
| 10) ..........భీమలింగ | కం | క | మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి |
| 11) కవి చౌడప్ప | కం | క | కవిచౌడప్ప |
| 12) ..........గోపబాల | కం | క | మోదుకూరి అమరకవి |
| 13) గొట్టుముక్కల రాజగోపాల | శా | కా | దిట్టకవి రామచంద్రకవి |
| 14) మగటపల్లి కామయ | కం | కా | పచ్చమెట్ట పాపయకవి |
| 15) యదువంశభూషణ | ఉ | కృ | జూలూరి అప్పయ |
| 16) తరికొండ నృసింహ | చం | కొ | తరికొండ వెంకమ్మ |
| 17) రుద్రకోటీశ్వర | కం | కో | పెట్ల జగన్నాధాచార్యులు |
| 18) గువ్వలచెన్న | కం | గు | గువ్వలచెన్న |
| 19) చంద్రాభరణ | కం | చ | చక్రపాణి రంగనాధుడు |
| 20) చిరుతవజీరు | కం | చి | పూసపాటి వీరపరాజు |
| 21) చెల్లయ్యామ్మారావు | కం | చె | కొత్తపల్లి లచ్చయ్య |
| 22) శ్రీరామజోగారాయ | కం | జొ | మండరామస్వామి |
| 23) రఘుకులతిలక | కం | త | దిట్టకవి రామచంద్రకవి |

| శతకం పేరు | వృత్తం | యతి | కవి పేరు |
|---|---|---|---|
| 24) వెంకటేశ్వర | చ | తి | ఉడుమూరి సూరపరాజు |
| 25) ధీరధీ | చ | ద | మోదుకూరి శంకరకవి |
| 26) దాశరధీ | ఉ | దా | కంచెర్ల గోపన్న |
| 27) హుసేన్‌దాసు | తే | దా | గంగనపల్లి హుసేన్‌దాసు |
| 28) సాధుమేధానిధి | శా | ధ | పుష్పగిరి తిమ్మన |
| 29) ఆంజనేయ | కం | న | అయ్యలరాజు నారాయణామాత్యుడు |
| 30) నరసింహ | కం | న | మద్దాలి గురుస్వామి |
| 31) శనైశ్చర | చ | నా | ఘటికాద్రికవి |
| 32) నాగబ్రహ్మ | కం | నా | శంకరగిరిరెడ్డి |
| 33) పంచముఖేశ | కం | ప | అమలాపురం సన్యాసి |
| 34) శివముకుంద | కం | ప | పరమానందయతి |
| 35) రంగశాయి | ఉ | పా | మంచెళ్ల కృష్ణకవి |
| 36) తింత్రిణీగర్తపుర - పట్టాభిరామ | కం | పా | కానుకొలను నాయనప్ప |
| 37) తాబేటి మేటి | ఉ | పి | పణతుల లక్ష్మీనరసయ్య |
| 38) దక్షపురి భీమేశ్వర | కం | పు | వడ్డాది తిమ్మరాజు |
| 39) ........రాజరాజేశ్వరి | శా | మ | శౌనక కృష్ణయార్యుడు |
| 40) ఆర్తరక్షామణి | మ | మా | వడ్డాది సుబ్బరాయకవి |
| 41) వీరశంకర | ఉ | మ | వెలవెల శంభుమూర్తి |
| 42) రామాదేవ చూడామణి | శా | మా | కోటికలపూడి కోదండరామకవి |
| 43) రాజకంఠీరవ | మ | మా | బృందావనం లక్ష్మణదేశికులు |
| 44) ఉద్దండరాయ | చ | య | దిట్టకవి రామచంద్రకవి |
| 45) రఘువీర | చ | రా | అయ్యలరాజు త్రిపురాంతకుడు |
| 46) రామానుజ | శా | రా | శాంతలూరి తిరుమలార్యుడు |
| 47) రాజవతంస | కం | రా | కొటికలపూడి కోదండరామకవి |
| 48) లక్ష్మీనృసింహ | శా | ల | పాటూరి లక్ష్మీనృసింహకవి |
| 49) ... ....మల్లభూపాలీయం | శా. మ. | ల్లా | ఎలకూచి బాలసరస్వతి |
| 50) విక్రమదేవ | కం | వి | పెనుమత్స సత్యనారాయణ |
| 51) వెంకటరమణ | కం | వె | రత్నమాంబ |
| 52) కందుల చినవెంకన్న | కం | వె | రేగులగడ్డ సాంబకవి |
| 53) శిఖినరసింహ | కం | శి | |
| 54) సత్యనారాయణ | శా | స | దేవులపల్లి తమ్మన్నశాస్త్రి |
| 55) సత్యవ్రతి | కం | స | నిడుదవోలు సుందరంపంతులు |
| 56) సంజీవరాయ | కం | స | కాకర్ల సుబ్బయ్యపంతులు |
| 57) కృష్ణసచివ | కం | స | ముమ్మడి మల్లనార్యుడు |
| 58) సంపగి మన్న | కం | స | పరమానంద యతి |
| 59) పార్థసారధి | కం | సా | కింకరు కన్నయ్య |
| 60) సిరిసిరిమువ్వ | కం | సి | శ్రీ శ్రీ |
| 61) కారుకొండ నరసింహ | మ | హ | సుభద్రార్యుడు |

## 1. కొన్ని సంయుక్త యతి శతకాలు :

| | | | |
|---|---|---|---|
| 1) జ్ఞానప్రసూనాంబ | శా | జ్ఞా | శిష్టుసర్వశాస్త్రి |
| 2) తిరుమల శ్రీ వెంకటేశ | కం | త్రి | భజిమెళ్ల భగవచ్ఛాస్త్రి |
| 3) బ్రహ్మపురీశ | కం | బ్ర | పారనంది విశ్వేశ్వరశాస్త్రి |
| 4) భ్రమరాంబా చెన్నమల్లేశ్వర | మ | భ్ర | ఇవటూరిసానందారాధ్యులు |
| 5) భర్గా పార్వతీవల్లభా | మ | ర్గా | కూచిమంచి తిమ్మకవి |
| 6) సూర్య | శా | ర్యా | బొడ్డపాటి పేరయ |
| 7) గోపాల | కం | శ్రీ | కందుకూరి వీరేశలింగంపంతులు |
| 8) సకలేశ్వర | శా | శ్రీ | దేవులపల్లి తమ్మన్నశాస్త్రి |
| 9) శ్రీ కాళహస్తీశ్వర | శా | శ్రీ | ధూర్జటి |
| 10) " | శా | శ్రీ | నాగపూడి కుప్పుస్వామయ్య |
| 11) శ్రీరంగేశ్వర | మ | శ్రీ | తాండవకృష్ణదాసు |
| 12) శ్రీ సూర్యనారాయణ | మ | శ్రీ | వరాహ వెంకట నృసింహకవి |
| 13) పురుషోత్తమదేశిక | ఉ | శ్రీ | అల్లూరి పుండరీకాక్షుడు |
| 14) వేణుగోపాల | శా | శ్రీ | కొటికెలపూడి కోదండరామకవి |

ప్రాస శతకాలు :

పద్య పాదంలోని రెండవ అక్షరానికి "ప్రాస" అని వ్యవహారం. "ప్రకృష్టో విన్యాసః ప్రాసః" స్థానవిశేషాన్ని ఎఱిగి చక్కగా కూర్చే సమానాక్షర విన్యాసం ప్రాస అనబడుతుంది అని చెప్పబడింది. దీనికి హల్మైత్రియేగాని అచ్చు మైత్రితో నిమిత్తంలేదు.

పద్యంలో యిది సుకర-దుష్కర-అభేద ప్రాసలని మూడు విధాలుగా ఉంటుంది. ప్రాస స్థానంలో సామాన్యమైన అక్షరాలున్నపుడు దాన్ని సుకర ప్రాస అని, సంయుక్తాలు విసర్గ పూర్వకాలు ఉన్నపుడు దుష్కర ప్రాస అని, లక్షణ శాస్త్రాన్ననుసరించి అభేదాక్షరా లున్నపుడు అభేదప్రాస అని పిలుస్తుంటారు.

అప్పకవీయం, సుకరప్రాసలో ద్విప్రాస, త్రిప్రాస, చతుష్ప్రాస అనే భేదాలు చెప్పింది. ఇవన్నీ పద్యప్రాసలు.

ఇక పద ప్రాసలలో అంత్యప్రాస-అనుప్రాస అని మళ్ళీ రెండు భేదాలున్నవి. ఈ ప్రాసలకు పూర్వాక్షర నియమం ఉంటుంది. అది గురువైనపుడు ఏకాక్షరంగా, లఘువైనపుడు అక్షరద్వయంగా పాటింపబడుతుంది.

అంత్యప్రాస పద్యపాదాలకు చివరన మాత్రమే కూర్చబడుతుంది. ఇది జాత్యుపజాతులలో ఎక్కువగా కనిపిస్తుంది. కేశవస్వామి శతకం అంత్యప్రాసలకు ఒక చక్కని ఉదాహరణం. ఆంధ్రజ్యోతిలో ప్రస్తుతం దేవీప్రియగారి నడుస్తున్న వ్యాఖ్యానాలు అంత్యప్రాసలకు మంచి ఉదాహరణాలుగా ఉన్నవి.

అనుప్రాస పద్యంలో పదాల ననుసరించి ఉంటుంది. ప్రారంభంలో పద్యం ఎటువంటి సంబోధనతో లేదా ఎటువంటి క్రియతో ఎత్తుకుంటారో యిక పద్యాన్నంతా అటువంటి అంత్యప్రాసలు గల పదాలతోనే నడుపవలసి ఉంటుంది. ఇది మొదటి పదాన్ని అనుసరించి నడిచే ప్రాస కాబట్టి అనుప్రాస అనబడుతుంది. ఆంధ్ర సాహిత్యంలో ఈ ప్రాసలకు పోతనగారిని చెప్పిన పిమ్మటనే యితరులను చెప్పవలసి ఉంటుంది. అవి ఆయన పద్యాలలోని చివరి పాదాలలో ముక్తాయింపులుగా నాద సౌందర్యాన్ని నింపుతూ ఉంటవి.

తెలుగు పద్యాలకు యతులకంటె ప్రాసలే ఎక్కువ శోభాకరంగా ఉంటవి. అవి ఎంత చక్కగా పాటిస్తే పద్యంయొక్క అల్లిక అంత చిక్కగాను చక్కగాను కనిపిస్తుంది. అందుచేత ఆలంకారికులు ప్రాసను ఒక శబ్దాలంకారంగా అంగీకరించినారు.

వృషాధిప-దాశరథి-భక్త చింతామణి (కూచిమంచి సోమసుందరంగారిది) శతకాలలోని పద్యాలు ఈ అనుప్రాసలకు చక్కని ఉదాహరణాలుగా ఉన్నవి.

ప్రాస స్థానంలో ఎప్పుడైనా హల్లులేగాని అచ్చులు నిలువవు. కవిజనాశ్రయంలో రేచన స్వరమైత్రిని చెప్పే అపుడు మాత్రం-

అఆ ఐఔలకుమరి - ఇఈలు ఋౠరసహితౌ ఏలఌనే
ఉఊ ర్దమలోనాదబడి - ఒఓలకు వళ్ళగున్ నయోన్నతచరితా!

అని అచ్చులను ప్రాసస్థానంలో నిలిపి ఒక పద్యం రచించినాడు.

మన హల్లులలో మొదటిది క వర్గం. దీనిలో సామాన్యమైన కకార ప్రాసతో యింతవరకు ఏ శతకం కనిపించలేదు. పుసులూరి సోమరాజు ద్విత్వకకార ప్రాసతో నందనందన శతకం రచించినాడు. చక్కదనంబు జూడ మనసైనది చూపుము నంద నందనా! అనేది దీని మకుటం, ఈ కవిగారిది గోపికామార్గం.

అయ్యలరాజు నారాయణామాత్యుడు నఖగర్త పురాంజనేయ, నతజనగేయా! అనే మకుటంతో గోరుగుంతల ఆంజనేయ స్వామిపై ఒక శతకం చెప్పినాడు. ఇది మహాప్రాణ ప్రాసతో నిర్వహింపబడింది.

గకార ప్రాసతో నేను క్రీ.శ. 1972లో పండరినాథ విఠల శతకం రచించినాను. ఇది ఉత్పల శతకం. ఈ వర్గంలో యిక తక్కినవానితో శతకాలు రాలేదు.

రెండవదైన చవర్గంలో దిట్టకవి రామచంద్రకవి ఉద్దండ రాయ శతకం రచించినాడు. ఇది జకార ప్రాసతో నిర్వహింపబడిన మత్తేభ శతకం.

చవర్గంలో యిక తక్కిన అక్షరాలతో ఏ శతకం రాలేదు. టవర్గంలో డకార ప్రాసతో గంట్యాడ మల్లికార్జున శతకం ఒకటి వచ్చింది. ఇది ఉత్పల శతకం. గం, ట్యాడనగాధివాస! నమదర్జున శంకర! మల్లికార్జునా! అనేది దీని మకుటం. ఈ వర్గంలో గూడ యిక తక్కినవానితో శతకాలు రాలేదు.

తవర్గంలో సత్యవ్రతి శతకం ఒక్కటే కనిపిస్తుంది. విజయనగర సంస్థాన మహారాజు ఆనంద గజపతిగారొకపుడు తన ఆస్థాన పండితులకు "సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్" అనే సమస్య నిచ్చిరట. ఈ సమస్యను పూరించుచు శతాధికులు శతకములు రచించిరట.

వారిలో తురగా వెంకటాచలకవి, భాగవతుల రామమూర్తి, నిడుదవోలు సోమసుందరముపంతులు, ముడుంబై నరసింహాచార్యులు, శ్రీరాజామణిసెట్టి, ఆదిభట్ట నారాయణదాసు, మేడేపల్లి వెంకటరమణాచార్యులు మొదలైన ప్రసిద్ధులెందరో ఉన్నారట కాని అందరి శతకాలు ముద్రణ కాలేదు. ఈ వర్గంలో యిక తక్కినవాన్నిపై గూడ శతకాలు రాలేదు కాని అనునాసిక ప్రాస మాత్రం ఈ వర్గాక్షరంనుండే ప్రారంభమవుతుంది.

షకార ప్రాసకు అనుభవరసిక శతకం ప్రధమోదాహరణంగా ఉంది. ఇదిగూడ విజయనగర సంస్థాన మహారాజాగారిచ్చిన సమస్యా శతకమే. అనుభవ రసికుండెఱుంగు-సనూటొప్పు గదా! అనే ఈ సమస్యను గ్రహించి ఆయన ఆస్థాన పండితుడు కర్నూలు నరహరి రాజామణిసెట్టిగారీ శతకాన్ని రచించినారు. ఇదే ప్రాసతో పోకూరి కాశీపతిగారిది హనుమత్ప్రభు శతకం మరొకటి ఉంది

ద్విత్వ నకార ప్రాసతో మన్నెంకొండ వెంకటేశ్వరునిపై పోకూరి కాశీపతిగారిది ఒకటి, దోకూరి బాలబ్రహ్మచారిగారివి రెండు శతకాలు వచ్చినవి.

అయిదవదైన పవర్గంలో గూడ ఏ శతకాలు రాలేదు. మకార ప్రాసతో పావులూరి మల్లనగారి భద్రాద్రి రామశతకం ఒక్కటి మాత్రం వచ్చింది ఇది కంద శతకం.

వర్గాక్షరాల పిమ్మట చెప్పదగినవి అంతస్థాలు. వానిలో మధ్యాక్షరాలు రెండు మాత్రమే ప్రాసలో ఎక్కువగా కనిపిస్తున్నవి. వానిలో

వెంకటేశ్వర, ఏకప్రాస కంద, పురుషముఖ్య, చిరవిభవ, గుండభూపతి, ధనంజయ మహారాజ, తిరుమలశ్రీ వెంకటేశ, గోపాల, హరశంభో, గ్రహరాజ, గుండ్లపల్లి చెన్నరాయ, శ్రీరామ అనే శతకాలు మాత్రమే యింతవరకూ నా దృష్టి కందినవి అందనివింకెన్ని యున్నవో!

దీనిలో వెంకటేశ్వర - పురుషముఖ్య, చిరవిభవ అనే మూడు మాత్రమే వృత్తశతకాలు. తక్కినవన్ని కందాలు.

పై వృత్తాలు గూడ చంపకోత్పలాలేగాని సంస్కృతాలు కావు. ఈ శతకాలనుబట్టి తెలుగు కవుల చేతిలో రేఫ ప్రాస సిరప్రాయంగా నడిచిందని చెప్పవచ్చు.

రేఫం పిమ్మట రెండవ స్థానం అభేద న్యాయాన్ననుసరించి లకారానికి చెందుతుంది.

గౌరీరమణ, భద్రాచలధామ, తాబేటిమేటి, రుద్రకోటీశ్వర, వెంకటేశ్వర లలితా పుష్పమాల అనే శతకాలు లకారప్రాసకుదాహరణంగా ఉన్నవి. వీనిలో తాబేటిమేటి ఉత్పలశతకం, తా, బేలల మేటి రమ్యమృదువివరహ్రుత్తటి హోమసత్తటీ, అనే మకుటం గల ఈ శతకం ఏకప్రాసకు ఏకయతికి గూడా ఉదాహరణంగా ఉంది.

అంతస్థాల పిమ్మట చెప్పదగినవి ఊష్మాలు. వీనిలో హకారం దుష్కరప్రాస క్రిందనే లెక్క. వీనిలో సకార

ప్రాసతో శ్రీ శంభూ! సింహాచల విహార అనే రెండు శతకాలు మాత్రమే కనిపిస్తున్నవి. అవి కంద రచనలు.

అనేకప్రాస శతకాలు :

వీనిలో ద్విప్రాస-త్రిప్రాస-చతుష్ప్రాస అనే భేదాలు అప్పకవి చెప్పినాడు. పోతనగారి భాగవతంలోని దశమస్కంధం పూర్వభాగంలో ఈ ప్రాస చిత్రాలు మిక్కిలిగా ఉన్నవి.

నూరు పద్యాలను ఏకప్రాసతో నిర్వహించటమే కష్టం కనుక అనేక ప్రాస శతకరచన సామాన్యంగాదు మరి.

ముఖలింగ, ఉప్పాడ మల్లేశ్వర, రాజరాజేశ్వర, ముకుంద శతకాలు యింతవరకు ద్విప్రాస శతకాలుగా కనిపిస్తున్నవి.

కొమ్మద్ది సుబ్బయకవి తన శ్రీరామ శతకాన్ని త్రిప్రాస ఘటితంగా రచించినాడు. ఇది ఇంతవరకు ఒక్కటే త్రిప్రాస శతకంగా ఉంది.

సరికొండ లక్ష్మీనరసింహదాసు ఈ త్రిప్రాసను తన గుండాల రామలింగ శతకంలో ఒకేచోటగాక ఆది మధ్యాంతాలలో అనగా మూడు స్థానాలలో ఘటించి రచించినాడు. పద్య రచనలో యిది మరో కొత్త ప్రయోగం అనవచ్చు.

దుష్కరప్రాస శతకాలు :

ప్రాస స్థానం విసర్గపూర్వకమైనా సంయుక్తాలతో కూడిఉన్నా అది దుష్కర ప్రాస అనబడుతుంది.

శతక కవులలో అమలాపురం సన్యాసి ప్రసిద్ధుడు. ఆయన శివ శతకాన్ని, కొత్తపల్లి అచ్చయ్యగారు సూర్య శతకాన్ని దుష్కరప్రాసలో నిర్వహించినారు. కొత్తపల్లి పిచ్చయ్యగారు తన శతకంలో కఠినమైన సంయుక్తాలను గూడ ఎన్నుకొని అవలీలగా నిర్వహించి తానీ శతకాన్ని క్రొత్తదనంతో రచించినానని చెప్పుకున్నాడు.

మరికొన్ని ప్రాసలు :

అల్లక సత్యదాసు సత్యలింగేశ్వర శతకాన్ని అభేద ప్రాసలతో రచించినాడు. పరశురామపంతుల రామమూర్తి తన ఈదులవాయి రామశతకం కకారం మొదలుకొని వర్గాక్షరాలన్నిటిలో పద్యరచన చేసి శతకాలలో క్రొత్తమార్గం త్రొక్కినాడు. ఇటీవల మా మిత్రుడు శ్రీ ఎం. రంగారావుగారు మామిళ్లపల్లి నృసింహస్వామిపై "నరహరి" అనే అక్షరాలు తీసికొని ఒక్కొక్క అక్షర ప్రాసతో ఒక పద్యంగా యిరువదేడు ఆవృత్తులు రచించి మరో క్రొత్తమార్గం త్రొక్కినాడు.

ఆటవెలదిని ప్రాసతో వ్రాస్తే అది పవడగీతి అవుతుంది. మిత్రుడు బిజనపల్లి లక్ష్మీకాంతంగారు పగడాలమాల రచించినపుడు ఆటవెలదులు చాలామంది వ్రాసినారు కాబట్టి నీవు వానిని ప్రాసతో రచించు. దీనికి "పవడమాల" అని పేరు పెట్టు అని చెప్పినాను. ఆయన తన పుస్తకానికా పేరుమాత్రం పెట్టినాడు గాని పద్యాలకు ప్రాస వేయలేదు.

మన శతకాలను యతిప్రాసల దృష్టితో పరిశీలించినపుడు ఇంకా ఎన్నెన్నో విశేషాలు తెలిసే అవకాశం ఉంది. నేను స్థాలీపులాకన్యాయంగా ఈ వ్యాసంలో కొన్ని మాత్రమే చూపినాను. ఈలాగే తరువాతి వ్యాసంలో వృత్తవిశేషాలను గురించి గూడా కొంత చెబుతాను.

## 1. కొన్ని యేకప్రాస శతకాలు

| శతకం పేరు | వృత్తం | ప్రాస | కవి పేరు |
|---|---|---|---|
| 1) నందనందన | ఉ | క్క | పుసులూరి సోమరాజు |
| 2) గోరుగుంతలాంజనేయ | కం | ఖ | అయ్యలరాజు నారాయణామాత్యుడు |
| 3) పండరినాథవిఠ్ఠల | ఉ | గ | కపిలవాయి లింగమూర్తి |
| 4) ఉద్దండరాయ | మ | జ | దిట్టకవి రామచంద్రకవి |
| 5) గంట్యాడ మల్లికార్జున | ఉ | డ | నిష్ఠల ఉపమాక వెంకటేశ్వరుడు |
| 6) సత్యవ్రతి | కం | త | సమస్యాపూరణ శతకాలు |
| 7) రాఘవ | శా | త | మిక్కిలి మల్లికార్జునకవి |
| 8) అనుభవరసిక | కం | న | కర్నూలు నరహరిరాజామణిసెట్టి |
| 9) హనుమత్ప్రభు | కం | న | పోకూరు కాశీపతి |

| | శతకం పేరు | వృత్తం | ప్రాస | కవి పేరు |
|---|---|---|---|---|
| 10) | మన్నెముకొండ వెంకటేశ్వర | ఉ | న్న | బోకూరు కాశీపతి |
| 11) | | కం | న్న | దోకూరు బాలబ్రహ్మచారి |
| 12) | భద్రాద్రిరామ | కం | మ | పావులూరి మల్లన |
| 13) | వెంకటేశ్వర | చ | ర | ఉదుమూరి సూరపరాజు |
| 14) | ఏకప్రాసకంద (శ్రీరామ) | కం | ర | మందపాటి రామకృష్ణకవి |
| 15) | పురుషముఖ్య | ఉ | ర | మంచెళ్ల కృష్ణకవి |
| 16) | చిరవిభవ | చ | ర | కూచిమంచి తిమ్మకవి |
| 17) | గుండభూపతి | కం | ర | తాడికొండ మల్లనారాధ్యుడు |
| 18) | ధనంజయ మహారాజ | కం | ర | పణతుల బ్రహ్మన్నకవి |
| 19) | తిరుమల శ్రీ వెంకటేశ | కం | ర | భజమెల్ల భగవచ్ఛాస్త్రి |
| 20) | గోపాల | కం | ర | కందుకూరి వీరేశలింగంపంతులు |
| 21) | హరహరశంభో | కం | ర | నిడుదవోలు సుందరంపంతులు |
| 22) | గ్రహరాజ | కం | ర | సరికొండ లక్ష్మీనరసింహరాజు |
| 23) | గుండాల రామలింగ | | ర | ,, ,, |
| 24) | గుండ్లపల్లి చెన్నరాయ | కం | ర | ,, ,, |
| 25) | గౌరీరమణ | కం | ల | అమలాపురం సన్యాసి |
| 26) | భద్రాచలధామ | కం | ల | ప్రయాగ కామేశ్వరకవి |
| 27) | తాబేటి మేటి | ఉ | ల | వంతుల లక్ష్మీనరసయ్య |
| 28) | లలితా పుష్పమాల | ? | ల | రత్నాకరం వెంకటేశ్వర్లు |
| 29) | రుద్రకోటీశ్వర | కం | ల | పెట్ల జగన్నాథాచార్యులు |
| 30) | శ్రీశంభు | కం | స | రాజా మృత్యుంజయ మహారాజ |
| 31) | సింహాచల విహార | కం | స | నిడుదవోలు సుందరంపంతులు |

## 2. అనేక ప్రాస శతకాలు

| శతకం పేరు | వృత్తం | ప్రాస | కవి పేరు |
|---|---|---|---|
| మల్లలింగ | కం | ద్విప్రాస | అమలాపురం సన్యాసి |
| ఉప్పాడ మల్లేశ్వర | - | ద్విప్రాస | శృంగారకవి సర్వారాయడు |
| రాజరాజేశ్వర | - | ద్విప్రాస | చింతలపాటి నరసింహ దీక్షితులు |
| ముకుంద | - | ద్విప్రాస | |
| శ్రీరామ | | త్రిప్రాస | కొమ్మద్ది సుబ్బయకవి |
| ×× | ×× | ×× | ×× |
| సత్యలింగేశ్వర | కం | అభేదాక్షర ప్రాస | అల్లక సత్యదాసు |
| ఈదులవాయిరామ | | వ్యంజనాక్షర ప్రాస | పరశురామపంతుల రామమూర్తి |

## 3. దుష్కరప్రాస శతకాలు

| | | | |
|---|---|---|---|
| సూర్య | కం | సంయుక్తప్రాస | కొత్తపల్లి అచ్చయకవి |
| శివ | కం | దుష్కరప్రాస | అమలాపురం సన్యాసి |



# బాల్యం ఓ వసంత పరిమళవీచిక

నా బాల్యం
ఎంత మధురమైంది
మధురస్వప్నంలా
హృదయంలో నిలిచిపోయింది
అమ్మ పెట్టిన
ఆవకాయ పెరుగన్నం తిని
పుస్తకాల సంచి బుజాన వేసుకొని
పొరుగూరి పెద్దబడికి నడచిపోయిన రోజులు
పచ్చ పచ్చని జొన్న చేల మధ్యనుంచి
పరిమళించే అడవిపూల పొనాదుల మధ్యనుంచి
విశాలంగా పరచుకొని పారే వాగునీళ్ళల్లోంచి
చిరుగుట్టల లోయల్లోంచి
చిట్టడవుల దారుల్లోంచి
బడికి నడచిపోయిన రోజులు

చెరువుల్లో ఒంటికాలి జపంచేసే కొంగల్ని చూస్తూ
కొమ్మలపై కువకువలాడే గువ్వలజంటల్ని పరికిస్తూ
పూచిన మావితోటల్లో కోయిలల పాటల్ని వింటూ
ఈ చెట్టుపైనుంచి ఆ చెట్టుపైకి ఎగురుతూ ఇకిలించే
కోతుల్ని వీక్షిస్తూ
బడికి నడచిపోయిన రోజులు
వాన వచ్చినప్పుడల్లా దారిమధ్యన చింతలకింద
దాక్కొంటూ
ప్రమోదం కలిగినప్పుడల్లా బట్టలు విప్పేసి వాగులో
జలకాలాడుకుంటూ
కొన్నాళ్ళు జమీందారు తోటలో రాలిన ;
ప
ఇంకొన్నాళ్ళు చెలకల్లో కంచెల్లో ఎగబడి రే.
రాల
బడికి నడచిపోయిన రోజులు
ఇంటికి రాగానే
అలసివచ్చిన నన్ను
అమ్మ ఒళ్ళోకి తీసుకొని
చల్లగా ముద్దుపెట్టుకొని
జేబునిండా పప్పులు, పెట్టి
ఆడుకోపొమ్మన్న రోజులు
నేను పొరుగూరి బడికి
నడచిపోయిన ఆ రోజులు
మధురమైనవి
మరపురానివి.

అమ్మ పెట్టిన
ఆవకాయ పెరుగన్నం తిని
పుస్తకాల సంచి బుజాన వేసుకొని
పొరుగూరి పెద్దబడికి నడచిపోయిన
నాబా ల్యం ఎంత మధురమైంది!
మధురస్వప్నంలా హృదయంలో నిలిచిపోయింది
బాల్యం
నా హృదయంలో కలకాలం సురభిళించె
ఓ వసంత పరిమళ వీచిక.

**శ్రీ తిరువగరి**

# ముసురు

## శ్రీ ఆదిత్య

వర్షం. బ్రహ్మాండమైన వర్షం, హోరుమంటున్న శీతల గాలితో ఝోరుమంటూ కురుస్తున్నది. ఆకాశఖాండం ముక్కలుగా పగిలినట్టుంది. భూగ్రహంలోని జలభాగమంతా మేఘాలై కుండపోతగా, వేగంగా కురుస్తున్నట్టున్నది. వారం రోజులుగా ఎడతెరిపి లేకుండా కురుస్తున్నది.

వాగులు వరదలతో పొంగివస్తున్నై, ఊళ్ళను తుడిచిపెట్టుకుంటూ. చెట్లు వర్షపు వేగానికి తుఫానుగాలి తాకిడికి కూకటివేళ్ళతోసహా కూలిపోతున్నై. వాయుదేవుడు, వరుణదేవుడు గర్జిస్తూ తమ శక్తినంతా ప్రదర్శిస్తున్నారు.

ప్రకృతి విలయతాండవం చేస్తున్నది పరమ బీభత్సంగా. ఫెళ ఫెళమంటూ ఉరుములు, తళ తళమంటూ వజ్రాయుధాల్లాంటి మెరుపులు.

అది, జలాలు లోకాల్ని ముంచెత్తుతున్న - గుండెలు అవిసిపోయేలా అదరగొట్టే - పైశాచిక నిశిరాత్రి.

"నది పొంగివస్తున్నది. ఊరు మునిగిపోతుంది!" ఎవరో పొలికేక పెడుతున్నారు - నది ఒడ్డున ఉన్న ఆ ఊళ్ళో.

—"ఊరు మునిగిపోతుంది. అందరూ చచ్చిపోతారు! పై ఊళ్ళన్ని కొట్టుకుపోయినై. నది ఉధృతంగా పొంగివస్తున్నది." అంటూ "నా కొడుకో! వా అయ్యో! అందరూ గుట్టకేసి పదండి!" అనే కేకలు - ఆర్తనాదాలు - హాహాకారాలు - అరుపులు - పెడబొబ్బలు, ఆ వర్షపుహోరును చీల్చుకుంటూ వినవస్తున్నాయి.

ఊరికి దూరంగా ఒక ఇల్లు. అందులో అతడు నివసిస్తాడు. అతనిగురించి ఎక్కువగా తెలీదు. అర్థంకాని మనిషి. కొంతమంది తన్ని తాగుబోతు, పచ్చి వ్యభిచారి అంటారు. కొందరతన్ని దొంగ, బందిపోటు అంటారు. విప్లవకారి, ప్రమాదకారి అంటారు. మరికొందరతన్ని పిచ్చివాడని కూడ అంటారు.

ఏది ఏమైనా అతనిగురించి చాలామంది పట్టించుకోరు. అనవసర, అప్రస్తుతవ్యక్తి. అతనితో ప్రత్యేకంగా పరిచయమున్నవాళ్ళు లేరక్కడ. అతని గురించిన అభిప్రాయాలన్నీ ప్రశ్నార్థకాలే! అతడు విస్కీ పెగ్గు కొట్టి, బాటిల్ క్రింద పెట్టాడు. సీసా దాదాపు ఖాళీ అయింది. సిగరెట్ వెలిగించాడు. గట్టిగా రెండు దమ్ములు లాగాడు. తృప్తిగా తల పంకించాడు. కొంతసేపు ఈలపాట పాడాడు హుషారుగా, ఆత్మానందంలో మునిగిపోయినట్టుగా.

అలా కొంతసేపయాక అతనిలో హఠాత్తుగా మార్పు వచ్చింది, చలనం కలిగింది. దిగ్గున కుర్చీలోంచి లేచి తలుపుకేసి నడిచాడు. తలుపుతీసి బయటికి చూశాడు.

హోరున వర్షం. అంతా చీకటి. నల్లదనం - మంచులో చల్లదనంలో నల్లదనం. చిక్కటి చీకటి, రాకాసిబొగ్గులా. ఏమీ కన్పించడంలేదు. కంటితో పని లేనట్టుంది, చర్మంతో, చెవులతో పని. రివ్వుమని వీస్తున్నది చల్లటి తుఫానుగాలి. తళుక్కున మెరుపు మెరిసింది. ఆ వెలుగులో, తన ఇంటిముందటి వేపచెట్టు ఫెళ్ళుమంటూ కూలిపోవడం కొద్ది క్షణాలసేపు స్పష్టంగా కనిపించింది. కనుచూపుమేర దృష్టి సారించాడు. అంతా జలమయమై బాట కన్పించటంలేదు. తొండం లావుతో పడుతున్న వర్షపుధార, అక్కడక్కడ కూలిపోయిన చెట్లు అతని దృష్టికి అందాయి. చెవులు రిక్కించాడు. ప్రజలు చేస్తున్న అరుపులు లీలగా వినపడ్డాయి.

అలానే, అక్కడే నిలబడి చూడనారంభించాడు. ఎంతసేపు నిలబడ్డాడో అతనికే తెలియదు. హఠాత్తుగా వర్షపుజోరు తగ్గినట్టనిపించింది. ఔను, వర్షం కాస్త తగ్గింది, గాలి మరీ ఉధృతమయింది. ఏదో నిశ్చయించి తల పంకించాడు. లోపలికి నడిచాడు వెనక్కి తిరిగి. డ్రెస్ వేసుకొని స్వెట్టరు ధరించాడు. పైన రెయిన్‌కోటు కప్పుకున్నాడు. కాళ్ళకు గమ్ బూట్లు వేసుకున్నాడు. చలి తాకకుండా చెవులమీదుగా కప్పే టోపీ పెట్టుకున్నాడు. ఓ చేతిలో టార్చిలైటు, మరో చేతిలో ఇనుప చేతికర్ర. మరో రెండు పెగ్గులు పుచ్చుకొని, బయటపడ్డాడు.

గేటుదాటి బయట అడుగుపెట్టాడు. 'బుస్సు' మంది, విరిగి పడ్డ వేపకొమ్మల్లోంచి పడగ విప్పిన త్రాచుపాము. కాలు తన మీద పడడంవల్ల రెచ్చిపోయి పడగవిప్పి ఏ క్షణాన్నైనా కాటు వేయడానికి సిద్ధంగా వుంది. అతని కర్ర పట్టుకున్న చేయి గాల్లోకి

లేచింది. విసురుగా పామును తాకింది కర్ర. ఆ దెబ్బకు పాము ఎగిరిపోయి, ఎక్కడో నీళ్ళల్లో 'ఫట్'మంటూ పడిపోయింది

అడుగులోతు నీళ్ళలోంచి అడుగులు గబగబా లేపి ఏదేస్తూ నడక సాగించాడు నదివేపు. మధ్యమధ్య గట్టుపైనుండి నడిచాడు, చెట్ల కొమ్మల్లోంచి చల్లగాలికి చచ్చిపడ్డ పక్షుల్ని ఎగరదన్నుతూ. అతను దూరమవుతున్నకొద్దీ ప్రజల అరుపులు అతని కర్ణపుటాలను మృదువుగా స్పృశిస్తూ, రానురాను లీలగా, ఆ తర్వాత పూర్తిగా అందకుండా పోయినై.

బదబదమంటూ నీళ్ళచప్పుడు అడుగు వేస్తున్నప్పుడల్లా. వాన చినుకులు రెయిన్ కోటుమీద, టపటపమంటూ రాళ్ళలాగా విసురుగా పడుతున్నాయి. 'ఛజ్' మంటూ వర్షం. రివ్వుమంటూ ఈదరగాలి. టోపీని చెవులమీదుగా తిరిగి సర్దుకున్నాడు. టార్చిలోంచి వస్తున్న వెలుగు కిరణాలు చీకటిని చీల్చుకుంటూ ప్రసరిస్తున్నాయి. అతను ఆ వెలుగులో దారి చూసుకుంటూ నడుస్తున్నాడు. ఆ సమయంలో అతన్ని చూసేవాళ్ళకు, భయం కలిగిస్తూ పిచ్చివాడనిపిస్తాడనడంలో సందేహం లేదు.

ఆశ్చర్యానందకరంగా క్రమంగా వర్షపుజోరు ఇంకా తగ్గింది. కొంచెం వేగంతో మాత్రమే కురుస్తున్నది. అతను మరింత ఉత్తేజంగా నడవనారంభించాడు హుషారుగా. అతని మస్తిష్కంలో ఏదో ఆలోచన ఆదేవనిగా సుళ్ళు తిరుగుతున్నది.

ఒకసారి టార్చి వెలుగులో పరిసరాలు పరికించాడు. పొలాలన్నీ ఉండవలసిన ప్రదేశమంతా జలమయం. బాట ప్రక్కనున్న చెట్లు కూలిపోయి, తను నడుస్తున్న కట్టకు అడ్డంగా పడివున్నాయి. కాలక్షేపం కోసం తను అప్పుడప్పుడు వచ్చికూర్చునే, దూరాన వున్న గండశిల సగంవరకు మునిగిపోయింది. దానికి కొంత దూరాన ప్రక్కన వున్న - అందరికీ పవిత్రమయిన- మహత్వ్యం గల - రోజూ పూజలూ పురస్కారాలు - అప్పుడప్పుడూ జాతరలు చేయబడే - శివుడి గుడిచుట్టూరా మరియు లోపలా నీళ్ళు. దాని ప్రక్కనేవున్న పెద్ద మారేడు వృక్షం గుడిమీదుగా పడిపోయింది.

జలమయమైన ఆ దేవుడి గుడిని - ప్రజల వేలుపును చూసి అతడికి నవ్వాగలేదు. పకపక నవ్వాడు.

తళుక్కున మెరుపు. ఆ వెలుగులో - వాగులో మధ్యవరకు - సగంవరకు ఆక్రమించుకుని వున్న కొండమీది రాళ్ళు దొర్లుతూ, చెట్లను [illegible]స్తూ, వేగంగా వాగులో పడిపోవటం [illegible] కనిపించింది.

ప్రకృతి తత్వం అర్థంకాదు. ఒకవైపు అతివృష్టి నిర్దాక్షిణ్యంగా ఊళ్ళకు ఊళ్ళనే ముంచెత్తుతూ - మరోవైపు అనావృష్టి. ప్రజలు తిండికి మాడి చచ్చేలాగా. అనాదిగా మానవుడు విజ్ఞానశాస్త్రంతో అన్నీ సాధిస్తూ ప్రకృతిని శాసించే ప్రయత్నం తీవ్రంగా చేస్తున్నాడు. తప్పకుండా సఫలుడు అవుతాడు. మానవుడి మేధకు అందనిది లేదు. ప్రకృతి విభిన్న రూపాలు తప్పకుండా రాజీ పడతాయి, ఎప్పుడో ఒకప్పుడు.

త్వరత్వరగా నడుస్తున్నాడు. రెండుసార్లు కాలు జారి పడబోయి తమాయించుకున్నాడు.

దూరాన నది - ఒడ్డుల్లేని నది. ఒడ్డు కనిపించడంలేదు మునుపటిలా. నల్లగా నది. నల్లటి నీళ్ళు. నేల, నీళ్ళ ఉపరితలాలు ఒకే సరళరేఖలా అగుపిస్తున్నాయి. రేడియం డయల్ వాచీలో టైము చూసుకున్నాడు. తెల్లవారవస్తున్నది.

వర్షం వెలిసింది.

క్షణాలు, నిముషాలు గడుస్తున్నాయి.

చిన్న తుంపర మాత్రమే పడుతున్నది. కొద్దికొద్దిగా వెలుగు వస్తూ, చీకటి పారిపోతున్నది క్రమంగా.

నది దాదాపు రెండుమైళ్ళ - వెడల్పుతో ప్రవహిస్తున్నది. అవతల ఒడ్డున వున్న తాటిచెట్లు, వగైరాలు, సగంకంటే ఎక్కువగా నీటిలో మునిగిపోయి వున్నాయి. దూరాన నది మీదుగా వుండే వంతెన అగుపించడంలేదు. మునిగిపోయింది. అక్కడ రైలు ఆగిపోయినట్టుగా, పైన కొద్దిగా పొగ కనిపిస్తున్నది.

అక్కడే ఆగాడతను, ముందుకు పోయేవాడల్లా.

ఇకముందర బురద, నీళ్ళు. జుయ్‌మంటూ ప్రవహిస్తున్నది నది. మురికిగా తేనీటిలాగా వున్న నీళ్ళతో బుడగలు బుడగలుగా, నురుగుతో ప్రవహిస్తున్నది.

అందులో—

'అంబా' అంటూ అరుస్తూ కొట్టుకుపోతున్న పశువులు, ఇళ్ళకప్పులు, దూలాలు, వాసాలు, మిగతా చెక్కలు, గడ్డివాములు బరబర కొట్టుకుపోతున్నాయి.

హాహాకారాలు చేస్తూ, అరుస్తూ కొట్టుకుపోతున్నారు మనుషులు మునుగుతూ తేలుతూ. వాళ్ళ చావుకేకలు, నిస్సహాయులైన వాళ్ళ అరుపులు ప్రవాహపు హోరులో సరిగ్గా వినిపించడం లేదు. చచ్చినవాళ్ళు తేలుతూ కొట్టుకుపోతున్నారు. కొట్టుకుపోతున్న గడ్డివాముల్లమీద, ఇంటికప్పులమీద, తల్లుల, పిల్లలు నిస్సహాయంగా [illegible] అరుస్తున్నారు, రోదిస్తున్నారు. సహా[illegible] [illegible]ం

నది ప్రవాహం మధ్యలో కొట్టుకుపోతున్న మనుషులు, పశువులూ అవీ సూటిగా ఎక్కడికో అంతులేకుండా పోతున్నాయి. ఇక మధ్యగా కాక ఇటువేపుగా వస్తున్నవి కొండకు సూటిగా పోయి ఢీకొంటున్నవి. అదే వేగంతో రిఫ్లెక్టయి ఒడ్డుకు — అతను నిల్చున్న వేపుగా వస్తున్నాయి. గడ్డివాముల్ని గాని, చెక్కలను గాని, ఆసరాగా పట్టుకొని వస్తున్నవాళ్ళు కొండను గుద్దుకొని ఘోరంగా చచ్చిపోయి, వాళ్ళ శవాలు ఒడ్డువేపుకేసి వస్తున్నాయి; పశువులూ, మనుషులూ అందరూ —

అతివృష్టి - ప్రకృతి బీభత్సం. ఎన్ని ఊళ్ళను పొట్టన పెట్టుకుందో నది, ఘోరమైన ప్రాణ నష్టం, సంపద నష్టం కలిగిస్తూ నురగలు గ్రక్కుతూ గట్టును గ్రుద్దుతూ ప్రవహిస్తున్నది.

నది ఒడ్డున కొంతదూరం నడిచి, సురక్షితమయిన, తన పని చేసుకునేందుకు వీలుగా వున్న ప్రదేశం చేరుకున్నాడు.

అది, ఇసుక తీసేందుకు ప్రయోగించే యంత్రసామగ్రితో, సాధనాలతో కట్టబడిన కార్ఖానా. మునుపు నది ఒడ్డునే వుండేది. ఇప్పుడది పూర్తిగా మునిగిపోయింది. క్రేన్‌లు, చిమ్నీలు, కన్వేయర్ బెల్టులూ అన్నీ మునిగిపోయినై. చాలా వస్తువులు కొట్టుకుపోయినై. 'బంకర్' స్థలం మాత్రం అలాగే నిలిచి వుంది. ఎందుకంటే అది ఐరన్ పిల్లర్స్‌తో బలంగా ఎత్తున కట్టబడి వుంది. పడిపోకుండా నిలిచివుంది. షెడ్ మీది రేకులు, సిమెంట్ గోడలు అలాగే ఉన్నాయి చెదరకుండా. అతనా షెడ్‌లో నిలబడి చూస్తున్నాడు.

షెడ్‌దగ్గర అంతమవుతూ, నది కోతవల్ల పెద్ద సొరిక ఏర్పడింది చాలా లోతుతో. శవాలూ అవీ అన్నీ ఆ సొరికలోకి కొట్టుకు వస్తున్నాయి. ప్రవాహపు వేగానికి అక్కడ పెద్ద సుడిగుండం ఏర్పడింది. నీళ్ళు జోరుగా బుయ్యిమంటూ తిరుగుతున్నాయి. శవాలూ అవీ అందులో, అంచుల నొరుసుకుంటూ వలయాకారంగా తిరుగుతున్నాయి. వేగంగా తిరుగుతున్నది సుడి.

అతను ఇనుపమెట్లమీద నిలబడి తనకు అతి చేరువలో వున్న ఆ సుడినీ, అందులోనివాటినీ చూశాడు కాసేపు సాలోచనగా. రెయిలింగ్ కమ్మీలను ఒక చేత్తో బలంగా ఆసరా పట్టుకుని, నీళ్ళలో దిగి ప్రవాహంలో కొట్టుకుపోతున్న పెద్ద వెదురుబొంగును లాఘవంగా అందుకున్నాడు మరో చేత్తో. షెడ్ అంచులనున్న ఇనుప కమ్మీలు ఆసరాగా తీసుకొని, బొంగుతో అతి నేర్పుగా సుడిలో కెలుకుతూ ఒక్కొక్క శవాన్ని ఒడ్డుపైకి తీయనారంభించాడు. అలా డజను శవాలదాకా పైకి లాగాడు.

బొంగును పక్కన పెట్టి ఒక్కొక్క శవాన్ని పరీక్షగా చూశాడు. ఆడాళ్ళు, మగాళ్ళు, ముసలి, ముతక అందరూ నీళ్ళు తాగి, కడుపులు ఉబ్బి చచ్చివున్నారు. పసిపిల్లలు కూడా వున్నారు సుడిలో. జీవితంలో ఇంకా ఎంతో అనుభవించాల్సిన వారు - ఎక్కడో పుట్టి ప్రకృతి బీభత్సానికి బలి అయ్యారు. శవాలు ఉబ్బిపోయి వున్నాయి!

శవాల్ని చూశాడు మళ్ళీ. సమీపంగా వున్నదాన్ని పరికించి చూశాడు. ఎవరో ఆమె సంపన్న కుటుంబీకురాల్లా వుంది మెడలో, కాళ్ళకూ, చేతులకూ అన్నీ నగలే బంగారువి!- మట్టి కొట్టుకుపోయి అస్పష్టంగా వున్నా అతను గుర్తించగలడు. స్వచ్ఛమైన బంగారంతో చేసిన పాతకాలపు నగలు అవి.

అతడు ఉషారుగా ఈల వేశాడు. తన పని ఫలించబోతుందన్నట్టుగా. ఆమె ఒంటిమీద నగలన్నీ వొలిచాడు. తరువాత శవం దగ్గరకెళ్ళాడు.

ఆ శవం, ఎవరో సేట్‌దిలాగున్నది. భయంతో గుడ్లు తేలవేసి నోరు తెరిచాడు. ఆ నోటినిండా మట్టి భయంకరంగా, అతని చేతికి ఖరీదైన బంగారు విదేశీ గడియారం. వ్రేళ్ళకు నాలుగు జతల వజ్రపుటుంగరాలు. మెళ్ళో గొలుసు. చెవులకు ఆభరణాలు. అన్నీ వొలిచాడు గబగబా. అలా అన్ని శవాల మీది నగలు వొలిచి కుప్పపెట్టాడు. సులభంగా వొలవరాని సమయంలో కత్తిని కూడా ఉపయోగించాడు. ముక్కు, చెవుల్లాంటివి కోసి నగల్ని తీసేందుకు.

మళ్ళీ కొత్త శవాలను పైకి లాగాడు. వాటినీ వొలచనారంభించాడు.

కాలం నెమ్మదిగా దొర్లుతున్నది.

ఎవరో - ఆమె - నగలు వలిచేందుకు చేయి పట్టుకుని ఆశ్చర్యపోయాడు. నాడి మళ్ళీ పరీక్షించాడు. బలహీనంగా కొట్టుకొంటున్నది. శ్వాస భారంగా కష్టంగా చేయగల్గుతున్నది. ఉన్నతమైన వక్షస్థలం కొద్దిగా కదులుతున్నది. అదృష్టవశాత్తు- ఆమె, సజీవురాలు - బ్రతికే వుంది - ఆశ్చర్యం!

పాతికేళ్ళు ఉండవచ్చు యువతికి. కొద్దిగా చిక్కిపోయినట్టున్నా, అందగత్తె అని చెప్పవచ్చు. మూసిఉన్న విశాల నేత్రాలు. ఎర్రగా అరుణిమ వొలుకుతున్న పెదవులు - గెడ్డం దగ్గర పుట్టుమచ్చ, చక్కటి రంగు—!

ఉలికిపాటు క్షణకాలం అతని వదనంలో మెరిసి మాయమయింది.

ఎన్ని గంటలనుండి నానుతూవుందో, ఈ చల్లని నీళ్ళల్లో! అదే స్థితిలో ఆమె ఇంకాసేపుంటే బ్రతకటం కష్టమేమోననిపిస్తున్నది. నీళ్ళు కూడా తాగి వున్నది.

గబగబా ప్రథమ చికిత్స చేయనారంభించాడు. పొట్ట ప్రక్కల చేతులుపెట్టి వొత్తి నీళ్ళు కక్కించాడు. చీరా అవీ వొదులుచేసి, వొంటికి వొత్తి పిండినట్టు చేశాడు. షెడ్ లోపలికి తీసుకొచ్చాడు. కృత్రిమశ్వాస కల్పించనారంభించాడు, నోటితో.

క్షణాలు, నిమిషాలు గడుస్తున్నాయి.

కొంతసేపటికి ఆమె నాడి చురుకుదనాన్నందుకున్నది. కొద్దిగా స్పృహ వచ్చినట్టున్నది.

వొళ్ళు కొంకర్లు పోయేలా వీస్తున్నది ఈదురుగాలి చల్లగా.

చలికి విపరీతంగా వణుకుతూ మూలుగుతున్నది. కళ్ళు తెరిచే ఓపికలేదు. తెరవలేకపోతున్నది.

ఇప్పుడామెకు వేడి, వెచ్చదనం కావాలి!!

క్షణమాలోచించి, గబగబా రెయిన్‌కోటు తీసి, లోపలి షర్టు, బనియను విప్పాడు. అవి పొడిగానే వున్నాయి. సిగార్ లైటర్‌లోని పెట్రోల్ దూది తీసి వాటికి అంటించి కొద్దికొద్దిగా వెలిగించాడు, సెగ తాకేలాగ.

మెల్లగా ఆమెకు వెచ్చదనం తాకింది. వణుకు తగ్గింది. నరాలు తిరిగి చైతన్యం పుంజుకున్నాయి. సత్తువ మేల్కొంటున్నది.

అతను మఫ్లర్‌తో ఆమె తల తుడిచాడు. ఒళ్ళంతా తడి నద్దాడు. బురద, ఇసుక తుడిచాడు. ఇక ఆమె నెమ్మదిగా తేరుకుంటున్నది. - ప్రమాదం లేదని గ్రహించాడు. లేచి సిగరెట్ వెలిగించాడు. దమ్ము లాగుతూ కొండను, ఢీకొంటున్న నదీ ప్రవాహపు పరవళ్ళను తదేక దృష్టితో చూడనారంభించాడు.

ఆ నది కెరటాల పొంగులాగే, అతనిలోనూ ఏదో అంతర్మథనం. పాత స్మృతుల విజృంభణ.

ఆమెకేసీ నదికేసీ మార్చి మార్చి చూస్తున్నాడు.

ఇంతలో ఆమె పూర్తిగా తేరుకున్నది. కళ్ళు విప్పింది మెల్లగా. పరిసరాలు పరికించి ఆశ్చర్యపడింది.

ఎదురుగా నిల్చుని తనను తదేకంగా చూస్తున్న అతనిపై పడింది చూపు. ఆమె ఆశ్చర్యం ద్విగుణీకృతమయింది. దిగ్గున లేచి అతన్ని మరీమరీ చూసింది.

ఆమె ఆశ్చర్యం అంతులేని ఆనందంగా మారిపోయింది. ఆమె విశాల నేత్రాలు మరింత విశాలమయినై. యుగాల తరబడి చేస్తున్న తపస్సు ఫలించినట్టుగా ఆమె ముఖం రాగరంజితమయి జిగేల్‌మంటూ, అప్పుడే దూరాన, నదిలోంచి తేల్తూ, వంతెన మీదుగా, మబ్బుతెరలను చీల్చుకొంటూ ఉద్భవిస్తున్న నవ్యోషస్సుతో పోటీపడింది.

రక్తం పులుముకున్నట్టున్న ఆమె పెదాలు విచ్చుకున్నాయి.

"ఆఁయ్....నువ్వు....నువ్వేనా?" ఆనందంతో అరచింది.

అతను చలించలేదు. ఆశ్చర్యపోలేదు. ముఖంలో ఏ భావమూ స్పష్టంగా స్ఫురించలేదు. నిశ్శబ్దంగా, ఆమెమీదినుండి తన దృష్టిని మరల్చుకొని తిరిగి నదికేసి సారించాడు. సిగరెట్ ఆఖరి దమ్ములాగి విసిరేశాడు.

అనుకోకుండా జరిగిన సంఘటన! ఎన్నాళ్ళకు, ఎంత అసహజంగా, అసంభవంగా-అనూహ్యంగా జరిగింది తిరిగి తమ కలయిక!

ఒక్కసారిగా లేచింది ఆమె. ఆ లేవడం - ఆ ఉప్పొంగుతున్న నదీకెరటాల ఉధృతిలాగా వున్నది.

ఎప్పుడో పోగొట్టుకున్న వస్తువు, తిరిగి చాలాకాలం తర్వాత లభిస్తే, మళ్ళీ ఎటన్నా పోతుందన్న భయంతోలాగా— అమాంతం అతన్ని వాటేసుకున్నది - ప్రేమ, ఆరాధన ప్రవహిస్తున్న తన మృదువయిన కరకమలాలతో అతన్ని తడిమింది, ఉన్మాదిలాగా.

"నువ్వు ఇంతకాలం ఎక్కడున్నావ్? ఏమిటీ నీ ఉద్దేశ్యం?"

"నన్నెందుకు మోసంచేసి పారిపోయావ్? నేనేం పాపం చేశానని నా గుండెలు బ్రద్దలు కొట్టావ్? నా జీవితం నాశనం చేశావ్! ఇన్నాళ్ళూ నీకోసం తపించాను. నువ్వు మళ్ళీ కన్పిస్తావనే ఆశతోనే చచ్చిపోకుండా ఇంతకాలం జీవచ్ఛవంలా బ్రతికాను! నీకోసమే - కేవలం నీకోసమే బ్రతికివున్నాను ఇంత కాలం!"

ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగినయ్. అవి ఆనందబాష్పాలు— బాధతో వస్తున్న కన్నీళ్లు—

"మాట్లాడవేం? నోరు విప్పు!"

అతనింకా గంభీరముద్రను వదలలేదు.

"నువ్వు నిజంగా మనిషివి కావు! రాక్షసుడివి. నీది రాతి గుండె! ప్రమాదకరమైన వ్యక్తివి!" ఉక్రోషంగా అరిచింది.

అతను కొద్దిగా చలించాడు.

"కావచ్చు. నువ్వన్నది నిజమే కావచ్చు. నేనెలాంటి వాడినోనని నేనెప్పుడూ ఆలోచించలేదు. ఆ విషయం నాకు తెలీదు. నా నిఘంటువులో, ఈ మనిషి-మనుగడ, వ్యక్తిత్వాలు ఇంకా మిగతావాటికి అర్థాలు వేరు. ప్రేమలూ పెళ్ళిళ్ళూ పడవు. నా సిద్ధాంతాలూ, అభిప్రాయాలూ........"

"ఏడిసినట్టుంది! మనుషుల్ని చిత్రవధ చేసేందుకా? ఖండించిందామె. ఇంకేమో అనాలనుకుంది.

—కాని అతని సమక్షంలో వున్న ఆమె ఇంకేమీ అనలేక పోయింది.

అతనిలోని ఆకర్షణలాంటిదేదో ఆమెను ఆమె మస్తిష్కాన్ని బంధిస్తున్నది హిప్నాటిజంలాగా.

తెలీని దూరంనుండి కూడ తన ప్రభావాన్ని చూపిస్తూన్న ఆ ఆకర్షణవల్లనే కాబోలు ఆమె ఇంతవరకు బ్రతికివున్నది.

ఈ సృష్టిలోని ప్రతి ప్రాణీ - దేన్నీ ఆశించకుండా బ్రతకలేదు. ఆశ ఫలించేదాకా బ్రతకాలని తపిస్తుంది. ఆ ఆశే లేకపోతే ఈ సృష్టే లేదు. మానవుడి ఆరాధన - హృదయ స్పందన - మానసిక భావన - ప్రేమ - చిత్రాతిచిత్రమయింది. సమాజం దృష్టిలో ఆమె వివాహిత అయినా ఆమె హృదయం అతనికోసమే పరితపించింది.

"నన్ను ప్రేమించానన్నావ్? నాలో ఆశలు రేపావు! పెళ్ళి చేసుకుందామనేనరికి హఠాత్తుగా మాయమయ్యావు. కొన్ని సంవత్సరాలుగా కనుమరుగయ్యావు. నీకోసం విలపించాను. నా తల్లిదండ్రులు బలవంతంగా పెళ్ళి చేసే ప్రయత్నం చేశారు. ఇంట్లోంచి పారిపోయాను. నీకోసం వాకబు చేశాను. నువ్వు జైల్లో వున్నావని తెలిసి కృంగిపోయాను. మూడేళ్ళ తర్వాత విడుదలయ్యావని తెలిసి సంతోషించాను. కలుస్తావని ఎదురుచూశాను. ఎంతో వెదికాను. దుండగుల కుట్ర ఫలితంగా కొంతకాలం వేశ్యాగృహంలో మగ్గాను. నా జీవితం అక్కడే అంతమవుతుందనుకున్నాను. ఏడ్చాను. అదృష్టవశాత్తు ఒక కరుణామయుడు, నన్ను కాపాడి చేరదీశాడు. జీవిత భాగస్వామినిగా స్వీకరించాడు. కొన్నేళ్ళ తర్వాత తనకున్న ఆస్తిని నా పేర రాసి కన్నుమూశాడు. ఒంటరినైపోయాను. జీవన పోరాటంలో అలిసిపోయాను. బ్రతుకుమీద విరక్తి కలిగింది. కాని గుండెలో అట్టడుగున, ఎక్కడో లోపలి పొరల్లో నిన్ను చూడాలన్న తపన, నువ్వు వస్తావనే ఆశ మినుకు మినుకు మంటుండేది. అందుకే ఇంతకాలం బ్రతికాను....ఇప్పుడు నేను నిన్ను తనివిదీరా చూస్తున్నాను!"

ఇప్పుడతను తన ఎదుటే వున్నాడు-తన కౌగిట్లో. ఆమె హృదయం దూదిపింజలా ఎగురుతున్నది.

తన జీవితంలోని ఇంకెన్నో వివత్కర పరిణామాలు, అనూహ్య మలుపుల గురించి ఆమె చెప్పదలుచుకున్నదో లేదో గాని, ఒకవేళ చెప్పదల్చుకున్నా చెప్పలేనట్టుగా అతని సమక్షంలో ఆ జీవితం పూర్తిగా ఈ కొద్దిసేపటిలోనే మరచిపోయింది. ఏమీ చెప్పగలగలేదు. పునర్జన్మ ఎత్తినట్టుగా వుంది. పై మాటలు మాత్రమే ఆమె హృదయాంతరాళాలనుండి వెలువడినయ్.

"నిజంగా నేను అదృష్టవంతురాలిని. ఆఖరుసారిగా నా కోరిక - నిన్ను చూడాలన్న కోరిక - తీరకుండా వ్యర్థంగా ఈ రాకాసి జలాల్లో పడి కొట్టుకుపోయి చావకుండా బ్రతికినందుకు భగవంతునికి ధన్యవాదాలు—"

"ప్రతిక్షణం నా స్వప్నజగత్తుకు కేంద్రకం నువ్వే! ఇప్పుడు నువ్వు, యదార్థంగా నా సాన్నిధ్యంలో - కౌగిలిలో వున్నావు! ఇక నిశ్చింతగా చచ్చిపోతాను!" పిచ్చిదానిలా పలవరించినట్టుగా అంది.

అతని పెదవులను గాఢంగా చుంబించింది. ఆ బిగి కౌగిలిలో మైమరచిపోయింది—

ఏదో పొందాలని - అతనినుండే పొందాలని ఇన్నేళ్ళుగా తపన - ఆరాటం - ఆమె ఏదో అనంత లోకాల్లో పరిభ్రమిస్తున్నది. ఆనందసాగరంలో విహరిస్తున్నది.

ప్రకృతి పరవశిస్తున్నది.

సృష్టి సంతృప్తిగా నవ్వింది తన సుంకాన్ని చూసుకొంటూ.

అటు గలగలా ప్రవహిస్తున్న నది - ఇటు గబగబ పైకి ప్రాకుతున్న సూర్యుడు - తమ పని చేసుకుపోతూనే వున్నారు- ఆ వెచ్చని జీవుల్తో పనిలేకుండా.

కాలచక్రం తన సహజ ధోరణిలో దేన్నీ పట్టించుకోకుండా భ్రమిస్తూనే వుంది.

క్షణాలు, నిమిషాలు గడుస్తున్నాయి.

అతను కౌగిలి విడిపించుకొని ఆమెపైనుండి లేచాడు. కాని ఆమె లేవలేదు.

అతను ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూశాడు. ఆమె వళ్ళు — ఇంతకుముందు వెచ్చగా కాగిన వళ్ళు — ఇప్పుడు మంచులా తాకింది - అతని చేయిలోంచి ఆమె చెయ్యి నిర్జీవంగా జారిపోయింది.

అతను కాసేపు శూన్యంలోకి చూశాడు ఎటో సాలోచనగా.

అతనికి తన పాత జైలు జీవితం స్మృతిపథంలో మెదిలింది. ఉద్యోగం దొరకక విసిగి వేసారి దొంగతనం వృత్తిగా చేపట్టటం మూలంగా జైలుకు వెళ్ళవలసి వచ్చింది. జైలులో తనకు తోడుగా మరో ఖైదీ ఒకడుండేవాడు. అతడు ఒకసారి జైలు గోడలు దూకి పారిపోయే యత్నం చేశాడు - ఫలితంగా తీవ్రంగా గాయపడ్డాడు. మరొక ప్లాను వేస్తున్నట్టు తనతో చెప్పాడు. 'అనవసరంగా చచ్చిపోతావెందుకు?' అని తను మందలించాడు. దానికతడు నవ్వి, 'చావడానికేముంది? ఏ వెధవైనా చచ్చిపోగలడు - సోమరిలా బ్రతకడం - పిరికిపందలా చావడం పనికిమాలినవాళ్ళ లక్షణం. బ్రతుక్కి ఒక ఆశయం, అర్థమంటూ ఉండాలి. నా ఆశయసాధన కోసం నా జీవితంలోని ప్రతిక్షణమూ వినియోగించాలనీ ఉవ్విళ్ళూరుతున్నాను. బహుశా నాకు ఉరిశిక్ష పడవచ్చు. అప్పటిదాకా గొర్రెలాగా పడివుండటం నాకిష్టం లేదు. విప్లవం కోసం — సాగుతున్న ఉద్యమానికి తోడ్పడేందుకు ప్రజలలోకి వెళ్ళే అవకాశం కోసం నిరంతరం ప్రయత్నిస్తాను!" అనేవాడు. రెండోసారి అతడు పారిపోయే ప్రయత్నంలో వుండగా కాల్చివేయబడ్డాడు.

"బ్రతుక్కి ఒక ఆశయం, అర్థమంటూ వుండాలి!" అతడు నెమ్మదిగా గొణుక్కున్నాడు. ఊరివైపు చూశాడు. ఏ సవ్వడీ వినిపించలేదు.

ముసురు, తుఫాను ఎప్పుడో వెలిసిపోయినై. నది ఉరవడి తగ్గింది. ఆకాశం స్వచ్ఛమవుతున్నది. ప్రకృతి ప్రశాంతత దాల్చింది. సూర్యుడు ఎర్రగా ప్రాణులకు అభయమిస్తూ నవ్వుతున్నాడు.

మళ్ళీ ఆమెవేపు చూశాడతను కాసేపు.

తర్వాత, ఆమెను - ఆ శవాన్ని మెల్లగా నీళ్ళలో వదిలాడు. అది ప్రవాహంలో కొట్టుకుపోతుంటే, అలాగే చూశాడు కనుమరుగయ్యేంతవరకు.

నగలను - శవాలనుండి తీసిన నగలను - నదిలోకి బలంగా గిరవాటేసి వెనక్కి తిరిగాడు. ఊరు దిశగా వడివడిగా నడిచాడు

# అంతః అక్షర చిత్రం

ఆలోచనల వృక్ష సమూహాలు
జారవిడుస్తున్న పండుటాకుల శబ్దాలు
పదాల మహారణ్యాల నుదుటిమీద
అతికిస్తున్న అక్షరచిత్రాలు
నిరాశ వాకిళ్ళ వొదిగి కూర్చున్న
జ్ఞాపకాల కన్నీటి శిలలు.

క్షణాల నిశ్శబ్ద రాహిత్యం
అంతస్సీమల వ్యధల వృధాగీతాల సరిహద్దులు
చెదరిపోయిన కలల కొరడా దెబ్బల
నిట్టూర్పుల కెరటాల్లో కొట్టుకొచ్చే
గుర్తించలేని ఆశల శవాలగుట్ట.

భవిష్యత్తు కొమ్మమీద
గొంతు సారించుకుంటున్న కోయిల
గుండెల్లో విరుచుకుపడ్డ తూటా
బతుకు చౌరస్తా అడుగడుగునా ఖాకీ విషపు నవ్వు
ఎండని సముద్రంలా ఆందోళన
నికృష్ట వాస్తవాల క్రూరత్వంలో బలౌతున్న అంతరంగం
నిట్టూర్పుల ఎడారిలో
కలల పత్రహరితాల ఊహారణ్యం.

ట్రాక్ చెడిన ట్రైన్‌లా
చెడ్డ చేదుగా చీకటి చెట్టుక్రింద
నిరాశ నీడల్లో సేద తీర్చుకుంటున్న అంతర్ముఖి ఆవేశం
కవిత్వం ఆకాశంలా అనంతం
కవిత్వం ఆకాశంలా శాశ్వతం.

**శ్రీ ముత్యాల**

# కలగూరగంప

## ఇటీవల లభించిన ఐదు తాళపత్ర గ్రంథములు

తాళదళ సంపుటమ్ముల నోలి గూర్చి
పూర్వమత ధర్మపద్ధతి పూర్తి నెరిగి
యెల్ల విద్యలు నేర్చి సర్వేశు గొలిచి
ఆంధ్ర జనము స్వతంత్రత నలరుగాక॥

—అని యొక ఆధునిక కవిపుంగవుని భావము - సర్వాంధ్ర సాహిత్యలోకము యథాశక్తి నాచరింపగలరని మనవి.

మన పూర్వులు మన కొసగిన దివ్యధనము తాళపత్ర గ్రంథములే - ఇందు సకల ప్రపంచము నిమిడియున్నది. మన పెద్ద లనుభవించిన కష్టసుఖములు, మంచిచెడ్డలు, లాభనష్టములు ఆదర్శములు. ఇహ పర సౌఖ్యములన్నియు నిందు నిక్షిప్తమై యున్నవనుటకు సందియ మిసుమంతయు లేదు. వేయేల! "యది హాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్" అన్నట్లు ఇందు లేనిది యెందు లేదు, ఎందు లేనిది యిందు కలదు. ఈ తాళపత్ర గ్రంథములందెంత విశిష్టత లేకున్న అనేక వ్యయప్రయాసల కోర్చి, సముద్రాల కవతలనున్న పాశ్చాత్య మహామనీషులు—ఒక్కొక్క గ్రంథమున కెంతయో విలువతో విలిచి తమ దేశమునకు కొనిపోయి, తమ గ్రంథాలయము లందుంచుకొని 'సర్వ విజ్ఞానసారముల'ని పూజింతురా? అంత విలువయిన ఈ తాళపత్ర గ్రంథములు _ పల్లెపట్టులలో నేటికిని - అటకలపై - పొగను భోంచేయుచు, ఆదరించువారు లేక అల్లాడుచుండుటలు నేను వీటిని సేకరించి ప్రాంతములందు కాంచితిని. ఇప్పటికైనను-ప్రభుత్వ\ ప్రాచ్యలిఖిత గ్రంథాలయమువారు తగినవ్యక్తులను నియమించి వీటిని సేకరించి, భద్రపరుతురుగాక! అని మనవి చేయుచున్నాను.

ఇటీవల నేను వ్రాయుచున్న 'తిరుమలాద్దంకివారు' అను చరిత్ర గ్రంథమునకు సంబంధించిన విషయసేకరణకై-అద్దంకి వారికి నివాసభూమియగు 'తక్కెళ్ళపాదు' వెళ్ళి ఆ అగ్రహారీకుల నింటనుండు గ్రంథాలయమును వారి యనుమతితో - పరిశీలింప మొదలిడితిని. అందపూర్వమైన, అసంఖ్యాకములైన సంస్కృత ద్రావిడాంధ్రాది భాషలలోని గ్రంథములున్నవి. ఆ గ్రంథాలయమను మౌక్తికహారమునకు మేరుపూస లనదగు మూడు తాళపత్ర గ్రంథములు దర్శన మిచ్చినవి. తమను పరిశీలించువారే కనుపడలేదని నల్లమోముతో ధూళియను కన్నీరుకార్చుచుండినవి. సమీపించి పరిశీలింపగా నవి అపూర్వములై, ఆశ్చర్యకరములైనవిగా కనుపించినవి:

(1) ఆంధ్రశబ్ద చింతామణికి - మరియొక వ్యాఖ్య - లోగడ అహోబల పండితీయమను సంస్కృత వ్యాఖ్య మహాభాష్యమువలె నున్నది. ఇది యొకటి. దీని చివర 'మంచెళ్ళ రఘునాథాచార్య పుత్రేణ వాసుదేవ కవినా విరచిత ఆంధ్రశబ్ద చింతామణి పంచమ ప్రకరణమ్' అని కలదు. అథర్వణకారికావళి 222 శ్లోకములను పైగా తొలి ఆకుమీద వసంతరాజీయము, వాసవదత్త వ్యాఖ్య—శాకుంతల సప్తమసర్గ వ్యాకరణమందు తత్సమ, తద్భవ శబ్దాదికారములు, అవి కలదు కాని ఇవన్నియు కనుపడలేదు చింతామణి వ్యాఖ్య మాత్రము సమగ్రముగనున్నది. పరిశీలింప తగిన వ్యాఖ్య.

షుమారు 1½ అంగుళము వెడల్పు కలిగి పేజీకి 8, 9 పంక్తులు కలిగి ముత్యపు లొలికెడు గుండ్రనిముల్లాంటి అక్షరములు కలిగి 300 పేజీలతో నున్నది. కవి శిరోభూషణము కాక మరియొక వ్యాఖ్య.

ఇక రెండవది - సంస్కృత రామాయణమ్.

దీనిని 'యీడతమున కల్గిం ...వాడిననుకుమార తిరుపతీశ్వరునకునీ, గాదేపల్లి నృసింహులు, వేడుక రామాయణంబు వెలయగ వ్రాసెనూ, అని వ్రాయుచు 'క్రోధన వత్సర చైత్ర మహాధవళ పక్ష దశమి యందుల గీర్వాణోధిక రామాయణ సుప్రిధర గాదెపల్లి నృసింహులు వ్రాసెనూ, సంస్కృతకావ్యము చివర తెలుగు పద్యమేమిటో?

ఈ గ్రంథము తాటియాకుగ కనుపడలేదు, మొగలి ఆకువలె మృదువుగనుండి 2½ అంగుళముల వెడల్పు కలిగి పొరలుకు 18 పంక్తులు కలిగి అందమైన ఆంధ్రాక్షరములతో నున్నది. విశేషించి పట్టుదలగా ప్రతి పేజీకి 18 సంఖ్యలు వేసికొని అందముగా వ్రాసినాడు. 330 పేజీలున్నది. 'శ్రీ' అని ప్రారంభము చేసి 'ఇతిశ్రీ' వరకు ఒకేవిధమైన రచన.

ఇది స్వతంత్రమైన రచనగ కనుపడుచున్నది. తొలిపొరట సరిగా కనుపడని కారణాన - కవి నివాసాదికములు నిర్ణయము చేయజాలకున్నాను.

గాదేపల్లివారిది పండిత వంశము. కర్నూలు ప్రాంతమున గాదేపల్లి వీరరాఘవశాస్త్రి శతావధానులుండినారు. వారికి వీరు పూర్వపురుషులై యుందురని నా యూహ!

మధురమైన కవిత. విశేషించి అనుష్టుప్ వృత్తములే వాడినాడు.

మూడవ గ్రంథము. బ్రహ్మసూత్ర భాష్యము. సంస్కృత గ్రంథము 330 పేజీలుండి చక్కని ప్రతి. చివర - సంపూర్ణము లేదు కావున - మరికొంత యుండి యుండునని తోచుచున్నది— వ్రాయసగాని పేరు కనపడలేదు-

ఈ మూడు గ్రంథములు పైవారింటిలో నున్నవి. అది యొకనాడు-కవులకు కాణాచియై, పండితుల నిలయమై, దాతలకు నిధానమై-వాగ్దేవి వివిధ భంగిమలతో నృత్యముచేసిన గ్రంథాలయోద్యానము - నేడు కాలము మారిపోయినది అవిదంత కథలుగా, కట్టుకథలుగా మార్పు చెందినవి. నేడు వాటిని చూచు నాధుడు క్రమముగా కరువగుచున్నాడు.

నాల్గవది: గౌరీపరిణయచంపు. పూర్వోత్తర భాగములు కలిగియున్నది — సంస్కృతము 'గద్యపద్యోభయమయం కావ్యంచం పూరిత్యభిధీయతే, అన్న విశ్వనాధుని వాక్యము త్రసరేణుమాత్రము తప్పలేదు.

కవి పిన్నింటి వేంకటాఖ్యుడు.

పిన్నింటి వేంకటాఖ్యేన కవినా పార్వతీపతేః।
ప్రీయతే శ్రయతే గ్రంథో గౌరీపరిణయాభిధః॥

కవిర్వేంకటాఖ్యోహం కరోమి ప్రబంధం।
లసద్గద్య ధామం నికామం।
క.... ధసమ్యగాపీయ తుష్యేద్ర సాలం,
యథేమం కవిచ్ఛేదికుర్యామ్॥

గౌరీ పరిణయ పూర్వం సతాం సంతుష్టయేయధా।
గౌరీ పరిణయసోప్యయం సతాం సంతుష్టయే భవేత్॥

అని (కవి) తన పేరు, ఇంటి పేరు, కావ్యము పేరు అంకితము, అన్నియు కలిపి ముచ్చటగ మూడు శ్లోకాలలో చెప్పినారు.

ఇందలి గాథ 'పార్వతీ పరిణయము'వరకే పరిమితము చేసినాడు. ఇందలి కథను బ్రహ్మాండ పురాణ, శివపురాణములనుండి గైకొని, కావ్యమునకు వలసిన కొలది మార్పులతో కథా కావ్యము మాదిరిగ నడపినాడు. కవి ఆంధ్ర ప్రాంతీయుడుగ నున్న కారణాన ఆంధ్ర దేశాచారముగ. పెండ్లితంతువు నడిపినాడు. ప్రాంతీయతన కనుపడనీయలేదు. కాలమును కనుపడలేదు. పూర్వకవులను స్మరింపలేదు.

సంస్కృతమున గద్యకావ్యములైన కాదంబర్యాదులను పుక్కిట నింపిన పుణ్యమూర్తిగ కనుపడుచున్నాడు. ఈ హిమాద్రి వర్ణనను పరిశీలించుము-

"శ్రితానేక రామతయా చిత్రకూట మాశ్రయన్. కుబేర ఇవపరిచి పంచానః, పాండురంగ ఇవపుండరీకాశ్రయః, రామ సేతురివ. గజ, గవయ, శరభ, సంచార సంశోభితః, చంద్ర ఇవని స్తంద్ర మంద్ర మృగసాంద్రః. శైవ... సంగీతభుజంగః, ఆమ్నాయ ఇవ అనల్ప కల్పాభిరామః, పాణినిరివ ప్రకటిత ధాతుః, సూర్యేవ ప్రసారితపాదః, పుంగవ ఇవ ఉన్నతశృంగః భగవానివ వనమాలాలంకృతః, సర్వోర్వీభృత్సార్వభౌమో— హిమవాన్" ఇందలి పదముల కూర్పు కాదంబరిలోని శుకనాసోపదేశము. దండకారణ్య వర్ణనమును కలిపి చదువుడు.

మేనా గర్భం ధరించిన విధము-

దద్రే కుద్రే ప్రియాగర్భం ద్యౌరివా భ్రమదభ్రకం
బిభ్రాజేత. సహసుభ్రుర్భి భాణా దేహ్యదం బహు॥

ఇట్టి శబ్దాలంకారముల కవి రసనాగ్రముపై నృత్యము చేయుచుండును.

మేన కన్న బిడ్డ.... ప్రాచీవ మరీచిమండలీం ప్రతీచీవ.... ఉపనిషదివ, ముక్తిగిరీశ వనితా ప్రాసూత.

పురుగులు అక్షరములను పొట్టలో పెట్టుకున్న కారణమున సరిగా కనుపడుటలేదు.

పార్వతీ పరమేశ్వరుల వివాహము-ఆంధ్ర సంప్రదాయము ననుసరించి చేయించినారు.

నేడు వధూవరులు పరస్పరము చూచికొని ఊ-అనో ఆ-అనో అన్న పిదప కదా పెద్దల నిర్ణయము. ఇక్కడా అట్లే చూడనిచ్చినారు. భాషికములను కూడా కట్టించినారు. అది దంపతులు తెరవచ్చదమును పట్టించినారు.

మాంగళ్య స్వస్తివాద్యైసహ మణిపలకై సంస్థయోదష్ట
మూర్త్యోః।
అన్యోన్యాపాంగవీక్షా....ముఖరుచోః పార్వతీ శూలపాణ్యోః॥

పెండ్లితంతు ముగించిన తరువాత అహమహమికతో నూతన దంపతులకు కట్నాలు చదివించుతారు కదా! అట్లాగే ఇక్కడను 'పార్వతీ శూల పాణ్యోః'లకు చదివించారు తరువాత పుట్టింటివారు. నేడు కట్నాలపేరున పుచ్చుకుంటున్న, నాడు

అరణమన్న పేరున 'గిరీన్‌చ కైలాస ముఖానీనేకాన్ వనాని పుణ్యాని మహాఫలాని। క్షేత్రాణి కేదారముఖాన ననేకాన్ చాపి దిదేశ తస్మై హరణం హిమాద్రిః॥ ఇట్లా ప్రాచీన సంప్రదాయమున మొక్కవోనీక రెండు భాగములలో-పరిణయు కావించి-కృతార్థుడైనాడు వేంకటాఖ్యుడు.

ప్రౌఢిరుక్తేః పరిపాకః ఇతి కావ్య విదో విదుః" అన్నట్లు రచన జిగిబిగి సడలనీక కావ్యలక్ష్మి కదను త్రొక్కించినాడు.

"వృత్తజాతమివ శార్దూల విక్రీడితాభిరామం, దేవబృంద మివ గంధర్వ సుందరం, ఇంద్రవాహన మివ ప్రస్ఫురతోట్కడం, గగనమివహంత బుక్షం, ఖూరాస్థాన మివకేసరిల సత్కండం, సరఇవ రంగత్తరంగం, పశ్చిమాంతరమివ జంబుదాక్రాంతం, సంగీతమివ సారంగాంచితం, ప్రమధకులమివ నీలకంఠోజ్జ్వలం, అశేష విశేష ఔషధీ భావనం, మహావనం, అగాహత" ఇట్లా చదివినంతనే తనువు పులకింపచేయు రచన.

ఇది పూర్వోత్తర భాగములు కలపి 40 పొరలున్నది. 1½ అంగుళము వెడల్పున్న తాటియాకుపై రెండువైపుల పేజీకి 8, 9 పంక్తులు కలిగియున్నది. ముద్రించు దాతయున్న సారస్వత లోకమునకే గాక సంస్కృత వాఙ్మయ కేదారమును ఫలవంత మొనరించుటేగాక, ఆ వేంకటాఖ్యుని చిరంజీవిగను చేయవచ్చును. అట్టి సమయమునకై నిరీక్షింతము గాక!

మరొక తాళపత్ర ప్రతి — ఇది పలు కవితా నదులకు సాగరము. కాశీ సుబ్బయ్యగారను ఆంధ్ర కవిచంద్రుడు-మదన గోపాలపురముపై వ్రాసిన నాల్గు సీసములు, పోలేరమ్మను తిట్టిన రెండు పద్యాలు. 54 పంక్తులు కలిగిన 'గాలివాన సీసమాలిక'— కురంగి పంచకమను పేర 5 శ్లోకాలు, పాంధపంచకము పేర నాల్గు శ్లోకాలు ఒక తెలుగు పద్యం - నానార్థ నిఘంటువు 99 కందపద్యాలు - దీనికి కర్త లేదు. ఇవి యిందు కలవు.

ఈ కవి ప్రకాశం జిల్లావాడనుట కథ్యంతరములేదు. కందుకూరు తాలూకాయందలి మదనగోపాలపుర వైశిష్ట్యము అతి వేలము, పరమ రమణీయము వర్ణించి మాతృస్థానమునకు కృతజ్ఞతను తెలుపుకొన్నాడు.

"ప్రతివాది మదదంతి - పంక్తుల బెదరించు
పంచాస్యరవము గో-పాలపురము
వేదశాస్త్ర శ్రౌత వివిధ విద్యల బల్కు-
పరమేష్టి ముఖము గోపాలపురము
దీన మానవ వారి-ద్యావాళి ధాముల
ప్రాణరక్షణము గో-పాలపురము
హర మంత్ర రాజయోగానంద కను
ప్రాన 'మదనగోపాలపురము'

పండితులకు ప్రాణపదము గోపాలపురము?
భావజునికి దివ్యశరము గోపాలపురము
పంకరుహ నేత్రునురము గోపాలపురము
పార్వతికి కంఠసరము గోపాలపురము.

ఇది రామన్నపైన - ఈ పాపాత్ముడెవడో? పాపం. ఏం చేశాడో?

యీసారికి - వైశాఖపు
మాసానికి, లక్ష్మి తొలగి మతిచెడి భ్రష్టై
వీసానికి కొఱగాకను
కాసారామంన(న్న)వల్ల కాటికి చేరు(నూ)న్

కాశీవారి గాలివాన 'సీసమాలిక'. (54 గీట్లు)

ప్రమోదూత కార్తీకమాస శుద్ధ దశమి సోమవారంనాడు-వచ్చిన గాలివానను గూర్చి వ్రాసినది. ఇందలి భావము చదువు చున్న ఎంతో భయంకరముగ నున్నది. ఆ జనము ఎట్లు ఆ బీభత్సాన్ని చూచి బ్రతికి బయటపడినారో?-

శ్రీగిరి మల్లయ్య చెక్కిట చెయిచేర్చె
భ్రమరాంబ చింతచే - పవ్వళించె
వేంకటాచలపతి విపర్యాసముం బొందె
అలమేలు మంగమ్మ - యదల సాగె.

ఆనాటి భయంకర దృశ్యాన్ని, కనుల్లకు కట్టినట్లుగ వర్ణించినాడీ కవి.

కురంగి పంచము - సంస్కృత రచన :-

అయి: కురంగి తురంగమ విక్రమే
త్యజ వనం జవనం గమనం కురు.
ఇహచరంతి వనేచర నాయికాః
సురభి లోహిత లోహిత సాయకాః॥

పాంధపంచకము - ఇది అన్యాపదేశముగ నున్నది.

భోపాంధా! పుస్తధర: క్షమాత్రతిష్ఠ
వైద్యోసికిం? గణితశాస్త్ర విశారదోవా?
కే నేషదేన మమ పశ్యతి-భర్తుః అంబా
కిం వా? గమిష్యతి పతిః పరదేశవాసీ॥

ఈ క్రింది పద్యమందలి నాయిక ఎంత గడుసరిదో కనుడు!

చైత్రేమాసి కఠోర సూర్యకిరణై
స్సంతప్త గాత్రోభవాన్
అస్మిన్ కుబ్జవటే సుశీతల తలే
భో! పాంథ! విశ్రమ్యతాం।
ఏకాకీచ భవాన్ అహంచ తరుణీ
శూన్యప్రపావర్తతే
లజ్జామేగదితుం, త్వమేవ చతురః
జానాసి కాలోచితమ్॥

ఇందలి భావము పరిశీలించిన మొండిచేతివాడికి నువ్వులు తినటం నేర్పుచున్నట్లున్నది:

నాధుడు లేనిది యీ అనాధ-నానార్థ శతకము:-

మా కందమైన తొంభై తొమ్మిది కందపద్యము లున్నవి.

విధుడనగ - బ్రహ్మ, అనలుడు
విధుడన-విష్ణుండు, పతియు, విశ్వమునయ్యెన్
విధుడన-చంద్ర-బలాసును
విధుడనగను ఇష్టసుఖుడు. విద్యయునయ్యెన్.

మిత్రమన-మిత్ర, వరుణులు
మిత్రంబన చంద్ర(ద్రు)డగ్ని మీరలు నెమలిన్.
మిత్రమన-లోకమిత్రుడు
మిత్రంబన-బుట్ట, మొక్క-మీనమునయ్యెన్

ఈ గ్రంథమున నిన్ని-విషయములున్నను 38 పుటలే. పొరటకు 8, 9 పంక్తులతో చక్కని దస్తూరి కలిగియున్నది. ఈ చివర రెండు గ్రంథములు-ఉలవపాడు గ్రామమందలి దేవర పల్లి వేంకట కృష్ణారెడ్డి స్మారక గ్రంథాలయమున బీరువా సొరుగులో చీకటిని ఆహారము చేసికొని వెలుగు రాలేక-జీవించు మన్నవి.

ఇప్పటికే వ్యాస విస్తరమునకు జంకితిని. మరికొన్ని విశేషములు మరియొక పర్యాయము మనవి చేయుదును - పై గ్రంథములు పరిశీలించుటకు అవకాశము కలిగించిన - శ్రీమాన్ తిరుమలాద్దంకి శ్రీశైనాథన్‌గారికి కృతజ్ఞతలు తెలియచేయు చున్నాను.

కొమాండూరి రామానుజాచార్యులు

# కృష్ణస్య మానుష రూపం

భగవద్గీత పదకొండవ అధ్యాయంలో అర్జునుడు శ్రీకృష్ణుని తన ఐశ్వర్య రూపాన్ని చూపించమని కోరుతాడు. శ్రీకృష్ణు డంగీకరించి సహస్ర బాహూదరవక్త్రమైన తన దుర్నిరీక్ష్య విశ్వరూపాన్ని ప్రదర్శిస్తాడు. మామూలు చర్మచక్షువులతో గాక శ్రీకృష్ణుడిచ్చిన దివ్యచక్షువులతో మున్నెన్నడు చూడని ఐశ్వర్య రూపాన్ని తిలకిస్తాడు అర్జునుడు. భయప్రకంపితుడౌతాడు. ఆ దుర్నిరీక్ష్యమైన ఉగ్రరూపాన్ని ఉపసంహరించుకొని ఎప్పుడూ కనిపించే ప్రసన్నరూపంతో కనిపించమని దేవదేవుని ప్రార్థిస్తాడు. ఎప్పుడూ కనిపించే ప్రసన్నరూపం ఎలా ఉంటుందో కూడా చెప్పాడు.

కిరీటినం గదినం చక్రహస్తం
ఇచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ
తేనైవరూపేణ చతుర్భుజేన
సహస్రబాహో! భవ విశ్వమూర్తే!

నాల్గు చేతులతో, నెత్తిని కిరీటంతో శంఖ చక్ర గదాధారి యైన మూర్తిని ప్రసన్నమూర్తిగ అర్జునుడు భావించినట్లు స్పష్టం. అయితే కృష్ణుడెల్లపుడూ ఇదే రూపంలో ఉన్నాడనికాని, రథం తోలేటప్పుడు కూడా చతుర్భుజాలతో ఉన్నాడనికాని నమ్మ డానికి మనకాధారాలు కనిపించవు. సరికదా అది సామాన్య మానవరూపం కాదు. అర్జునుని ప్రార్థనను విన్నాక శ్రీకృష్ణుడు తన ఐశ్వర్యరూపాన్ని చూసి భయపడవద్దని, ముందటి రూపు తోనే (తదేవరూపం) దర్శనమిస్తున్నానని చెప్పి చతుర్భుజ మూర్తిగ దర్శనమిచ్చాడు. అప్పుడు సంజయుడా విషయాన్ని ధృతరాష్ట్రునకు తెలియజేస్తూ ఇలా అంటున్నాడు: "స్వకంరూపం దర్శయామాస భూయః" [తన సహజమైన (సౌమ్య) రూపాన్ని తిరిగి ప్రదర్శించాడు]. ఆ రూపాన్ని చూసి సంతృప్తుడైన అర్జునుడు ఇలా అంటున్నాడు: "దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యంజనార్దన!" [ఈ నీ మానుష రూపాన్ని చూసి స్వస్థుడ నైతిని]. ఈ రెండు శ్లోకాల్లో చెప్పిన 'స్వకీయం రూపం', 'మానుషం రూపం' ఇంతకుముందు చెప్పిన 'తదేవ రూపం' 'తేనైవరూపేణ చతుర్భుజేన' ఒకదానితో ఒకటి సమన్వయించి ఒకే రూపాన్ని నిర్దేశిస్తున్నాయా అన్నది ప్రశ్న. మనకు అవి సంవదించవని స్పష్టమౌతోంది. మొదటి రెండు శ్లోకాల్లో చెప్పిన శంఖ చక్ర గదాధారి మానవలోకంలో కనిపించే సామాన్య మానవమూర్తి కాదు. కాని అర్జునుడు సంతుష్టుడవడాన్నిబట్టి

పై నాలుగు శ్లోకాలు ఒకే మూర్తిని నిర్దేశిస్తున్నాయని అంగీకరించవలసి ఉంటుంది. చతుర్భుజుని చూడాలని ఆకాంక్షించిన అర్జునుడు ద్విభుజమూర్తిని చూసి సంతుష్టుడౌతాడని మనం ఊహించలేము.

ఇక్కడ సుప్రసిద్ధ వ్యాఖ్యాతలు శంకర రామానుజులిద్దరూ చతుర్భుజ రూపాన్ని సమర్థిస్తూనే రాశారు. ఇతరులు వారి ననుసరించారు. శంకరుల వ్యాఖ్య ఇలా ఉంది: తదేవరూపం చతుర్భుజ రూపం శంఖచక్ర గదాధరమ్'; 'స్వకంరూపం వసుదేవస్య గృహేజాతమ్' (వసుదేవుని ఇంట్లో పుట్టిన రూపం అంటే చతుర్భుజ రూపమే కదా). ఇక రామానుజులవారు నిర్ద్వందంగా ఇలా చెప్పారు: "స్వకీయ యేవ చతుర్భుజం రూపమ్." రామానుజులు తమ భాష్యంలో ఈ క్రింది అంశాలను స్పష్టంగా ప్రతిపాదించారు: (1) శ్రీకృష్ణుడు నాల్గు భుజాలతోనే పుట్టాడు. (2) ఇందులో రెండు భుజాలను కంసవధ పర్యంతం గుప్తంగా ఉంచడానికి వసుదేవుని కోరికపై అంగీకరించాడు. (3) కంస వధానంతరం మళ్ళీ చతుర్భుజాలను ప్రదర్శించాడు. (4) కృష్ణుడు విశ్వరూపానంతరం తన పూర్వపు రూపం స్వకీయ మానవ రూపం పొందినపుడు కూడా చతుర్భుజుడే. ఈ చతుర్భుజ రూపమే మానవరూప మనడం ఎంతవరకు సబబు?

ఇక్కడ ఇంకో విషయం కూడా గమనించాలి. **11**వ అధ్యాయంలో **48**, 49 శ్లోకాలు చతుర్భుజ మూర్తిని సౌమ్య రూపునిగను, 50, **51** శ్లోకాలు మానుష రూపునిగను పేర్కొంటున్నాయి కాని అంతకుముందే **16, 17** శ్లోకాల్లో విశ్వరూపాన్ని వర్ణిస్తూ అర్జునుడిలా అంటున్నాడు:

కిరీటినం గదినం చక్రిణం
తేజోరాశిం సర్వతోదీప్తిమంతమ్
పశ్యామిత్వాం దుర్నిరీక్ష్యం సమన్తా
ద్దీపానలార్కద్యుతి మప్రమేయమ్.

ఇది దీనిపైనున్న 'అనేక బాహూదర వక్త్రనేత్రం'తో సమన్వయించారు. అంతేకాక దీనివల్ల అర్జునుడు శ్రీకృష్ణుని చతుర్భుజ రూపాన్ని చూశాడని, అది ఐశ్వర్యరూపంలో ఒక భాగమేనని, అది సౌమ్యం కాదని, ఉగ్రమని, దుర్నిరీక్ష్యమని తెలుస్తోంది. అయితే దేన్ని ఉపసంహరించమని కోరుకొంటున్నాడో, ఆ చతుర్భుజ రూపాన్నే తిరిగి ప్రదర్శించమని కోరడం వింతగాను అసంబద్ధంగాను తోచక మానదు. ఈ అసంబద్ధతను పరిహరించడానికి డా॥ అరవిందశర్మ 'విశిష్టాద్వైతా: ఎ స్టడీ' అన్న గ్రంథంలో ఒక ఊహ చేశారు. అర్జునుడి కోరిక మేరకు మొదట చతుర్భుజునిగా దర్శనమిచ్చినా తరువాత వెంటనే తన మానుష రూపమైన ద్విబాహుత్వాన్ని ప్రదర్శించాడని దీన్నే సంజయుడు 'స్వకీయం రూపం' అని అర్జునుడు 'మానుషం రూపం' అని వ్యవహరించారని వారి ఊహ. ఇది కొంతవరకు సమంజసమే అయినా సమస్య పూర్తిగ పరిష్కారం కాలేదు. పైగా అది కేవలం ఊహ మాత్రమే. భగవద్గీతలోని అనేక వైరుధ్యాలలో ఇది కూడా ఒకటి అని సరిపెట్టుకోవడం వినా గత్యంతరం లేదు.

**డా॥ గంటి శ్రీరామమూర్తి**

# కొన్ని సాహిత్య మర్మాలు

భారత భాగవత రామాయణాలలోనేమి, చాటు పద్యాలలోనేమి మనమెన్నో అమూల్య సాహిత్య మర్మాలను చూస్తూ వుంటాము. వాటిలో కొన్ని పరిశ్రమించిననేగాని అర్థమందని భూగర్భమణులై యుండును. అట్టి సాహిత్యమర్మాలు కొన్ని జ్ఞప్తికి తెచ్చుకొందము.

ఆద్యంతము లేని భోజనము

పై మాట వినుటకేమో అంతూ పొంతూ లేని భోజనమని పైకి మనకు తోస్తూవుంది. కాని దీని యర్థమదికాదు. నెయ్యి, మజ్జిగ రెండూ లేని తిండియని దీనికర్థము.

ఎట్లనగా భోజన సమయములో నెయ్యి, మజ్జిగ రెండిటిలో మొదటి తడవ నెయ్యి వడ్డింతురు, చిట్టచివరి తడవ మజ్జిగ వడ్డింతురు. అందువల్ల భోజనవేళలో అవి రెండు ఆద్యంతములు కాబట్టి ఆద్యంతము లేని భోజనమనగా నెయ్యి, మజ్జిగ రెండూ లేని తిండియని యర్థము.

పల్నాటిసీమ పర్యటనలలో ఎక్కడో ఆనాటి భోజనానుభవము కవిసార్వభౌమ శ్రీనాథ మహాకవి చెప్పిన చాటుపద్య భాగమిది.

వినాశకాలే ఫలముద్భవంతే

సంతానముతో చచ్చునవి అని దీని యర్థము. అళి కుళీ వృశ్చిక వేణు రంభా

వినాశకాలే ఫలముద్భవంతే అనునవి పై లక్షణము కలవి.

అళి యనగా తుమ్మెద. తుమ్మెద గ్రుడ్డు పెడుతుంది. దానితో దాని కడుపు పగిలి అది చస్తుంది. ఆ గ్రుడ్డునుండి

తర్వాత పిల్ల తుమ్మెద ఉత్పత్తియగునే కాని, అసలు తుమ్మెద మాత్రం బ్రతుకదు.

కుళీ యనగా ఎండ్రకాయ. ఎండ్రి గ్రుడ్డు పెడుతుంది. దానితో దాని పెంకు పగిలిపోయి అది చస్తుంది. అనంతరము గ్రుడ్డులోనుండి పిల్ల పుడుతుంది.

వృశ్చికమనగా తేలు. తేలు గ్రుడ్డు పెడుతుంది. దానితో దాని కడుపు పగిలి అది చస్తుంది. అటుపిమ్మట గ్రుడ్డులోనుండి తేలుకూన పుడుతుంది.

వేణు అనగా వెదురు. వెదురుగుమి అరవై సంవత్సరాలకు ఫలిస్తుంది. అంతటితో గుమి యెండిపోతుంది. తదనంతరము గుమి క్రింద రాలిన వెదురుధాన్యము మొలకెత్తుతుంది.

రంభా అనగా అరటిచెట్టు. అరటిచెట్టు గెల వేస్తుంది. గెలను ఖండించి చెట్టును నరికివేయుదురు. ఎందుకనగా అరటి చెట్టు ఒకసారికంటె హెచ్చుసార్లు ఫలించదు కాబట్టి. చెట్టును మొదటికి నరికివేయగా దాని వ్రేళ్ల భాగమునుండి ఆరటి పిల్లలు తిరిగి మొలకలు వేయును. అంతియేగాని అసలు చెట్టును పెట్టి పెట్టరు.

లోకములో ప్రాణులు తమ మేలుకని సంతానాన్ని పొందుతూ వుండగా పై ఐదు ప్రాణులు మాత్రము తమ సంతానోత్పత్తికై తాము కీడు పొందుతూ వున్నవి. ఇది సృష్టి లోని ప్రత్యేకత.

ముగురు రాజులు

ముగురు రాజులకును మోహంబు పుట్టించు
కొమరు మించిన వీడు కొండవీడు

మూడు తెగల రాజులకు గూడ కొండవీడు పట్టణము గుండె గాలమగునని భావము.

అప్పుడు తాను నివసిస్తూ వున్న కొండవీడు పట్టణ ఘనతను శ్రీనాథకవి వర్ణించు చాటుపద్య భాగమిది.

ఈ ముగురు రాజు లెవ్వరనునది మన కిప్పుడు చర్చనీయము. కేవలము కొంతమంది సైనికులు కలిగిన భూపాలకులు నరపతులు.

సైనికులు, సైనికులతోబాటు అశ్వబలము కూడా కలిగిన భూపతులు అశ్వపతులు.

సైనికబలము, అశ్వబలముతోబాటు గజబలము కూడా కలిగిన రాజేంద్రులు గజపతులు.

ఈ త్రివిధ బలసంపదలు కలవారే ముగురు రాజులు.

సింహావలోకనము

సింహ+అవలోకనమని సంధి. సింహ పరిశీలనమువంటి పరిశీలనమని భావము.

సింహము గుహలలో నివసించును. గుహనుండి వేటకు బయలుదేరి అది నేరుగా పోవదు. గుహ ద్వారమువద్ద నిలబడి అచట గల పుల్ల, పుడక, రాయి, రప్ప అన్నింటిని, తన అడుగుజాడలను పరిశీలించి గుర్తుపెట్టుకొని పోవును. తిరిగి గుహవద్దకు వచ్చి అది నేరుగా గుహలోనికి పోవదు. తాను చూసుకొనిపోయిన గుర్తులేవైన చెడియున్నచో తన శత్రువెవరో గుహలో దూరియున్నారని అది గమనించును. అట్లు చూసుకొని పోయిన గుర్తులనే మరొకసారి సింహము పరిశీలించి జాగ్రత పడుటకే సింహావలోకనమని పేరు.

ఉపాధ్యాయులు తాము విద్యార్థులకు బోధించిన పాఠము లనే సంవత్సరాంతమున పునర్విమర్శ చేయుదురు. దానికి గూడ సింహావలోకనమని పేరు.

ఛందశ్శాస్త్రములో సింహావలోకనమను పద్యమొకటి వచ్చును. మొట్టమొదట ప్రారంభమైన పదమే ఆ పద్యములో తిరిగి చిట్టచివర వచ్చును. కాబట్టి దానికి సహితము సింహావ లోకనమని పేరు.

మచ్చుకొక పద్యము

తే॥ హరికి దక్షిణ నేత్రమౌ నాతడు హరి
హరికి వామాక్షమై యొప్పునాతడు హరి
హరి ముఖము గల్గి వర్ధిల్లు నాతఁడు హరి
హరి సుతుని రాయబారియౌ నాతఁడు హరి.

విష్ణుదేవుని కుడి నేత్రము సూర్యుడు. ఎడమ నేత్రము చంద్రుడు. సింహముఖము కలవాడు నృసింహమూర్తి. ధర్మ రాజు రాయబారిగా పోయినతడు కృష్ణుడని యర్థము.

పై పద్యమున మొదటి హరి పదము చివర తిరిగి అగ పడుతూ వుంది కాబట్టి యిది సింహావలోకన పద్యము.

పుట్టంబుట్ట శిరంబునన్ మొలవ

ఈ పద్యపాదము పోతన భాగవతములోనిది. పుట్ట శిరముపై పెరగగా జన్మించిన వాల్మీకివి కాను అని దీని యర్థము. కాని పుట్టంబుట్ట శిరంబునన్ - అని, పుట్టంబుట్ట, శరంబునన్ మొలవ - అని దీని యర్థము. రకరకాలుగా తికమక పడి అసమంజస వ్యాఖ్యానాలు చేసియున్నారు. అయితే నేనిందు

చూపిన యర్థమే మూలముతో సమంజసమవుతూ వుంది. కాబట్టి యీ యర్థమే దీనికి సరి.

ఓషధీ చతుష్కము

హనుమంతుడు సంజీవి మూలికను తెచ్చినట్లు మనము రామాయణములో చదువుతూ వున్నాము. దీనికే 1) సంజీవకరణి అని కూడ పేరు. దీనికి చెందిన మరి మూడు మూలికలు 2) విశల్యకరణి 3) సంధానకరణి 4) సౌవర్ణకరణి.

1) సంజీవకరణి మరణించినవారిని బ్రతికించును. 2) విశల్యకరణి కండరాల లోభాగమున విరిగిపోయిన యెముకలను జతచేయును. 3) సంధానకరణి కాలు, చేయి మొదలైన అంగములు తెగి రెండైపోయినపుడు ఇది వాటిని సంధించును. సౌవర్ణకరణి గాయపడి శరీర తేజస్సును కోల్పోయినవారికి తిరిగి టానిక్కువలె తేజస్సును చేకూర్చును. ఇవి నాలుగు రకముల వనమూలికలు.

సంపంగి వాసన

తుమ్మెదలు వాసనను బట్టి పోయి అనేక విధముల పూలపై వ్రాలి మకరందాన్ని గ్రోలుతూ వుండును. అందుచే వాటికి మధుపములని, మధువ్రతములని పేరు.

అన్ని రకముల పుష్పములపై వ్రాలే తుమ్మెద సంపంగి పుష్పము చెంతకు మాత్రము చేరదు. ఒకవేళ పొరబాటుగా సమీపిస్తే సంపంగి వాసనకది మత్తెక్కి పడిపోవును. సృష్టిలో ఇదొక వైచిత్రి.

ఇందుకు మనుచరిత్ర గ్రంథము మనకు ప్రమాణము. ప్రవరుని రూపురేఖా విలాసములు చూచి కాంక్షించిన జారవనితల పాలిటికి అతని వైరాగ్యము భోగబాహ్యమయ్యె "పూచిన సంపంగి పొంపు మధుకరాంగనలకు బోలె."

అదు తుమ్మెదలు సంపంగి వాసనకు మత్తెక్కి పడిపోవునని యిందలి రహస్యము.

కరి మ్రింగిన వెలగపండు

క॥ సిరిదా వచ్చిన వచ్చును
సరిపోల్పగ నారికేళ సలిలము భంగిన్
సిరిదా పోయిన పోవును
కరి మ్రింగిన వెలగపండు కరణిని సుమతీ!

ఏనుగు మ్రింగి విసర్జించిన వెలగపండులోని గుజ్జు మాయమగునని పద్యములోని కడపటి పాదమున కర్థము. లోకములో పెక్కురు ఈ విపరీతార్థమునే ఏనుగు మ్రింగిన వెలగపండుకు చెబుతూ వుంటారు. ఇదొక గ్రుడ్డి నమ్మకము.

అసలర్థ మేమనగా వెలగపండు మాగినపుడు మామిడి గింజ లోపల చేరునట్లు పండులో నొక పురుగు చేరును. దాని పేరు గజకీటకము. అది లోపల చేరి పండును తినుటకు మొదలుపెట్టి పూర్తిగా తినివేయులోపల వెలగపండు పైభాగపు పెంకు నలుపెక్కిపోవును. నలుపునకు కరియని యర్థము. ఆ కరిచేత మ్రింగబడినపుడు లోపలి గుజ్జు హరించిపోయి పండు బుజ్జిగా మారిపోవును. దీనికి సంస్కృతశ్లోక ప్రమాణమిది.

శ్లో॥ సమాయాతి యథాలక్ష్మీః నారికేళ ఫలాంబువత్।
వినిర్యాతి యథాలక్ష్మీః గజభుక్త కపిత్థవత్॥

శ్లోకములోని గజమునకు ఆ పేరిటి పురుగని యర్థము.

[ఏనుగు మ్రింగిన వెలగపండు సంగతి నేను తిరుపతిలోని మావటివాండ్రను విచారించాను. అది ఆచరణలో లేదని, గ్రుడ్డి నమ్మకము మాత్రమేనని వారు చెప్పిరి. కాబట్టి యేనుగు మ్రింగిన వెలగపండు వదంతి భ్రమ మాత్రమే.]

—బయిరెడ్డి సుబ్రహ్మణ్యం

# కవిత్వము - లక్షణము

## సవరింపు

1. ఈ శీర్షికతో జూన్ 1989 సంచికలో ప్రచురించబడిన వ్యాసంలో 'ధారుణి రాజ్యసంపద మదంబున' అనే పద్యానికీ, 'రాముం బుణ్య గుణాభిరాము' అనే పద్యానికీ మూలగ్రంథాలు పొరపాటుగా పేర్కొనబడ్డాయి.

వాటిలో మొదటిది భారత సభాపర్వములోది. రెండవది భాస్కర రామాయణంలోది.

ఈ రెండుచోట్ల పొరపాటు ఎట్లా సంభవించినదో పరిశోధించడం ఇక అనవసరం గదా! ఈ సవరింపును చదువరులు గమనింప ప్రార్థన.

2. 'ఓ పాంథ' అనే పద్యం స్వేచ్ఛా ఛందస్సులో కూర్చినది అని కూడ గమనింప ప్రార్థన.

చివుకుల వేంకట సుబ్బావధానులు
నూజివీడు

# గ్రంథ విమర్శలు

## మన గురజాడ

[రచయిత : శ్రీశ్రీ వ్యాసములు, కూర్పు : చలసాని ప్రసాద్, డెమ్మీ 1/8, 4+72 పుటలు, వెల: రూ. 10/-, విరసం ప్రచురణ, నవంబరు 1988, దొరుకుచోటు: పి. యస్. ఆర్. ప్రసాద్, సి. 132, ఎస్. వి. యన్. కాలనీ, గుంటూరు-6 మరియు ఇతర ఆరుచోట్ల.]

గురజాడపై ఏమి వ్రాసినా, ఎవరు వ్రాసినా బాగుంటుంది. ఆ వ్రాసేది శ్రీశ్రీ అయితే ఇక చెప్పవలెనా? ప్రస్తుత గ్రంథం శ్రీశ్రీ 1932 నుండి 1976 వరకు అప్పుడప్పుడు వ్రాసిన గురజాడపైవి వ్యాసాల సంకలనం. ఇందు 15 వ్యాసాలున్నాయి. రెండు ముత్యాలసరాలు ఛందస్సుమీద. "ముందడుగు" అనే వ్యాసం కామ్రేడుల "సహయాత్రికు"ల కుటుంబ కలహంగా కనిపిస్తుంది. ఈ వ్యాసంలో శ్రీశ్రీ "ప్రపంచం అంతటా కమ్యూనిజాన్ని స్థాపించే ఆఖరు పోరాటం ఇండియాలోనే జరుగుతుందనేది నా దృఢ నిశ్చయం" అంటాడు. శతధాభిన్నమై పోయిన కామ్రేడులకిది ఊరట కలిగించే భరవస అనుకొంటాను. ఈ సమీక్షలో శ్రీశ్రీ కన్యాశుల్క నాటకంపైని వ్రాసిన విషయాలను చర్చిస్తాను. "నాటకమున మధురవాణి వ్యక్తిత్వం పరిపూర్ణముగా ప్రకటింపబడలేదు" అంటాడు శ్రీశ్రీ. నాలాంటివాళ్లైమో మధురవాణి పాత్ర (హామ్లెట్ పాత్రవలె) నాటక పరిధులను దాటి పోయిందనుకొంటాము. నాటకాని కంతటికీ మధురవాణి ముఖ్యమైన స్త్రీ పాత్ర అనేది సబబు. రామప్పంతుల మాటల్లో ఆమె తిక్క లంజ. కానీ ఆ తిక్కే వేరు. రామప్పంతుల ధణుతు ఎగురగొట్టిన తిక్క. వసంతసేన పాత్రకంటె మధురవాణి పాత్ర సృష్టి గొప్పదని శ్రీశ్రీ అన్నాడు. ఇది నిజం. వసంతసేన, తగిన మగడు దొరికితే, సవతితనానికైనా ఒప్పుకొనే స్వార్థపరురాలు. బుద్ధిహీనబేల. మధురవాణో, నేటి "ఉమెన్ లిబ్బరు" వంటిది. నాటకాంతాన కాంతి స్తంభంవలె నిలబడి వుంటుంది. మధురవాణి పాత్రకు సాహిత్య మాతృక ఎక్కడైనా ఉందా అని? తంజావూరు రఘునాథ నాయకాస్థాన విద్వన్మణి మధురవాణి (పేరు ఒకటే చూడండి) కావచ్చును. లేదా పింగళి సూరన "కళా పూర్ణోదయము"లోని కలభాషిణి పాత్ర కావచ్చును. మంచితనంలోనూ, మాటకారితనంలోనూ, పాత్రోన్మీలనంలోనూ, నామ సామ్యంలోనూ మధురవాణి పాత్ర కలభాషిణిని బోలుతుంది. కన్యాశుల్క నాటకాన్ని సినిమాగా తీసే ప్రయత్నాన్ని శ్రీశ్రీ ఇష్టపడినట్లులేదు. శ్రీ పుల్లయ్యగారు 1950లో తీసిన "కన్యాశుల్కం" సినిమా బాగానే ఉండింది. పూటకూళ్ళమ్మచే గిరీశం చీపురుకట్ట దెబ్బలు తినే "సీను" కళ్ళకు కట్టినట్లుంది. కన్యాశుల్కం బీభత్సరస ప్రధానమైన విషాదాంత నాటకం అని రెండుచోట్ల శ్రీశ్రీ అన్నాడు. కన్యాశుల్కం బీభత్సరసం కలదే. అసహ్యం కలిగించే విషయాలుండడం చేతనూ, కడుపులో త్రిప్పినట్లనిపించే దృశ్యాలుండడం చేతనూ. నాటకం బీభత్సమే. ఉదా : గిరీశం పూటకూళ్ళమ్మచే చీపురుకట్ట దెబ్బలు తినడం, లుబ్ధావధానికి దయ్యం విడిపించే దృశ్యం, తెల్లవారుజామున కాలువగట్టుకు పోతూండే రామప్పంతులను దాసరి వేషంలో వెంకటేశం ఓగత్యపు పాట పాడుతూ అంటుకొనిపోవడం, సారాకొట్టు దృశ్యం, ఇవన్నీ జుగుప్సను కలిగించేవే. నాటకం విషాదాంతం కాదు. ఎందుకంటే కన్యాశుల్కం నాటకం పండోరా పేటికవంటిది. అందుండి ఎన్ని బీభత్సాలు వచ్చినా, అరిష్టాలు వచ్చినా, చిక్కులు, కష్టాలు పైకి దుమికినా అడుగున ఇంకా ఆశ (హోప్) మిగిలిపోతుంది. మానవుని మనుగడకు పరిస్థితులు బాగుపడవచ్చుననే ఆకాంక్ష ఏడుగడ. హనుమంతునివంటి చిరంజీవి, త్రికాలజ్ఞుడు రామాయణంలో జీవన్భద్రాణి పశ్యతి, తస్మాత్ బ్రతుకుతాను అంటాడు. ఇబ్సెను నాటకం "జనశత్రువు" ఇదే ఆశను కల్గిస్తుంది. హామ్లెట్ నాటకం తుదిదృశ్యంలో రంగంమీద నాలుగు పీనుగులు పడివున్నా, మనలో "హోప్" పోదు. "కన్యాశుల్కం" అట్టి నాటకం. ఏలాటి ఆశలేని నిజమైన విషాదాంత. నాటకాలు సాఫోక్లిసు నాటకం "ఆంటిగొనె" షేక్సుపియరు "లియరు రాజు", సింజ్ వ్రాసిన నాటకం "సముద్ర నావికులు". ఇంకొకరకపు నాటకాలున్నాయి. నాటకం తుదిలో ఏ అనర్థం జరుగకపోయినా, మోదాంతమే అయినా ప్రేక్షకుల హృదయాలలో అదొకరకమైన సంవేదన (పాథోస్) ఆవరించును. షేక్సుపియరు నాటకాలు "హేమంతగాథ", "సింబలైన్", "తుఫాను" అట్టి నాటకాలు. కన్యాశుల్క నాటకమూ ఇట్టి నాటకమే. నాటక పాత్రల నామ్నీకరణం గురించిన శ్రీ శ్రీ విమర్శ సరికాదు. లుబ్ధావధానులు, కరటకశాస్త్రి పేర్లు అపహాస్యకాలే. నాటకాన ఆరు విధాలయిన హసితాలూ ఉన్నాయి. కన్యాశుల్క నాటకాన్ని

రియలిస్ట్ నాటకం (గోర్కీ నాటకం "లోవర్ డెప్త్స్‌వలె) అనుకోరాదు.

దీని బాహ్యరూపం ప్రహసనం. ఇందు అసంబద్ధతా (థియేటర్ ఆఫ్ ది అబ్సర్డ్) ధోరణులూ లేకపోలేదు. నాటకోద్దేశం సంస్కరణ. ప్రేక్షకులు విద్యావిహీనులు అట్టి వారికి వ్రాసిన కన్యాశుల్కం నాటకం రాను రాను కాలాన్ని, దేశాన్ని జయించుట రామప్పంతుల మాటలలో చెప్పవలసి వస్తే "అది వేరే కథ". అగ్నిహోత్రావధాని పేరు తప్పుపట్ట పని యుండదు. ఇప్పుడు ఒక సినిమా సుందరి అగ్నిహోత్రి (రతీ అగ్నిహోత్రి) అని పేసు పెట్టుకొంటే లేని ఆక్షేపణ నూరేండ్ల క్రితం ఎనభై పన్నాల వేదం చదివినావని చెప్పికొనే శ్రోత్రియ బ్రాహ్మణుడు పెట్టుకొంటే చేయవలెనా? అన్యాయం! వికార్సయిన బద్మాషుల పేర్లు రామప్పంతులు, గిరీశం ఎంత సాదాగా రియలిస్టుగా, వారిఖల స్వభావాన్ని కప్పిపుచ్చుతూ ఉన్నాయో గమనించండి! సందేశాత్మక కావ్య నాటకాలలో పాత్రల పేర్లు అదొక విశిష్టంగా ఉంటాయి. డికెన్సు నవలలు, బన్యన్ "యాత్రికుని పురోగతి" "ప్రబోధ చంద్రోదయ" నాటకంలోని పాత్రల పేర్లుదాహరణాలు. "సాక్షి" సంఘంలో అందరికంటె బుద్ధిమంతుని పేరు "జంఘాలశాస్త్రి" హాస్యస్ఫోరకంగా వుంది. గిరీశం, రామప్పంతులు, లుబ్ధావధాన్లుది శిథిలీకృతమవుతూన్న ఒకానొక సాంఘిక వ్యవస్థయొక్క కరాళనృత్యం అన్నాడు శ్రీశ్రీ. నేటివారితో (కన్యాశుల్కం నాటకానికి నూరేండ్ల తర్వాతివారు) పోల్చి చూస్తే, రామప్పంతులు, లుబ్ధావధాని, అగ్నిహోత్రావధాని, సత్యహరిశ్చంద్రులవలె, ధర్మరాజువలె కన్పడుతారు. ఆనాటివారు అవినీతి (ఇమ్మారల్) పరులు.

నేటి వీరు అనీతి (అ-మారల్) పరులు. కనుక ఎక్కువ ప్రమాదకారులు. హిందూ సంఘం క్యూరెటు (క్రైస్తవ పాదరీ సహాయకుడు) కోడిగ్రుడ్డువలె పాక్షికంగా బాగుంటుంది, చెడి వుంటుంది. శ్రీకృష్ణ నిర్యాణమప్పుడూ (ద్వాపర యుగాంతం) ఇట్లే, నేడూ ఇట్లే వుంది. పైగా సౌజన్యారావు, కరటకశాస్త్రి, మధురవాణి, పరోక్షంగా వీరయ్యపంతులు (కందుకూరి వీరేశలింగం) లాంటి సదాగ్రహులు, ప్రగతిశీలురున్న ఆనాటి వ్యవస్థను శిథిలీకృతమని ఎట్లనగలం? ఇప్పటి వ్యవస్థను ఏమంటాడో శ్రీశ్రీ. గురజాడ కథలలో "మీ పేరేమిటి" తనకు నచ్చినదంటాడు శ్రీశ్రీ. ఈ ఎంపికతో నాకు పేచీలేదు. కాని "పెద్ద మసీదు" లేక "మతము : విమతము" అని పేరుండే కథ గురించి చెప్పుతాను. ఇది గురజాడ వ్రాసిన అతి చిన్న కథ. (మూడు పుటలు). అన్నిటికంటె గొప్ప కథ. టెరిబుల్ స్టోరీ. ఇతిహాస పరిమాణం (ఎపిక్ డైమెన్షన్) కలది. కథ మొదటి వాక్యానికీ, తుది వాక్యానికీ మధ్య వేయి పుటల చరిత్ర వుండి వుంటుంది. ఇసుకరేణువులో ప్రపంచాన్నీ, కాలసూచక గాజు ("అవర్ గ్లాస్")లో అనంతకాలాన్నీ చూపించగల కథ "పెద్ద మసీదు". మినియేచర్ పెయింటింగ్ వంటిది. గురజాడ కథలు చిన్నవయినా, చాలా తక్కువ సంఖ్యలోనే వున్నా ఇటాలియన్ పునరుజ్జీవన చిత్రకారుడు జార్జియోని గీచిన ఒకే చిత్రం ఒక బాణీగా భావి కాలంవారికి మార్గదర్శకమైనట్లు, తెలుగు చిన్న కథలకు ఒరవడి పెట్టినాయి. గురజాడ గొప్పతనాన్ని శ్రీశ్రీ మొట్టమొదట కనిపెట్టలేదు. కానీ, గురజాడను ఎప్పుడూ తగిన "ఫోకస్"లో ఉంచిన ఘనత శ్రీశ్రీకే దక్కుతుంది. శ్రీశ్రీ గురజాడ గురించి ఇంత తక్కువ వ్రాసినాడే, ఇంకా ఎక్కువగా ఎందుకు వ్రాయలేదు అనిపిస్తుంది. ఒక్కొక్క వాక్యమే ఒక్క పేరాగ్రాపుగా నిల్చినాయి. గురజాడను కామ్రేడుగా కూడ చేసినాడు. ఒక వర్గంవారేమో గురజాడ ఒక జమీందారు తాబేదారు డంటున్నారు. "కనిపించని వంద వృక్షాలకన్న" "దేశభక్తి" గీతం మిన్న సన్మానాలు పొందే లక్ష సామ్రాట్టులకన్న ఒక కామ్రేడ్ గురజాడ మేలు." అని శ్రీశ్రీ తుది వ్యాసంలోని తుది వాక్యం. గురజాడ హెచ్చగుటకు విశ్వనాథ లొచ్చు కానక్కర లేదు. ఈ విపరీత ధోరణినే విశ్వనాథ అభిమానులు, గురజాడ తిరస్కారులు అవలంబిస్తున్నారు. ఈ వాక్యాన్ని శ్రీశ్రీ బ్రాండు ఫ్లిప్పెన్సీ అనుకొన్నా ఇచట ఒకటి చెప్పవలసి వుంది. ఫ్రెంచి రచయిత, నోబెల్ బహుమాన గ్రహీత అయిన ఆంద్రేజీద్‌ను ఎవరో "అందరు ఫ్రెంచి కవులలో గొప్పకవి ఎవరు?" అని అడిగినారట. జీద్ కొంచం ఆలోచించి "దురదృష్టవశాత్తు "విక్టర్ యూగోయే" అన్నాడట. ఈ మాట విశ్వనాథకు చెల్లుతుంది. ఆయన అంటే కొంతమందికి సరిపోకుండినను, విశ్వనాథ 20వ శతాబ్దంలో అత్యుత్తమ తెలుగుకవి. శ్రీశ్రీ అట్లంటే నేనిట్లా అంటున్నాను. సాహిత్య పరిశోధకులకూ, గురజాడ పఠితలకూ శ్రీశ్రీ "మన గురజాడ" ఒక టార్చిలైటువలె గురజాడను చూపించే గ్రంథం అనడంలో నాకు సందేహం లేదు. వ్యాసాల కూర్పు, ఎడిటింగు, ప్రేమకృషి, కూర్పరి శ్రీ చలసాని ప్రసాద్ ఇందుకు అభినందనీయుడు.

సర్దేశాయి తిరుమలరావు

# మనీషా సంగ్రహః

# కావ్యకంఠ వాశిష్ఠ గణపతిముని

(నాయన)

[వృత్తికారుడు : శ్రీ అయ్యల సోమయాజుల నరసింహ శర్మ, ప్రతులకు: డా॥ గంటి శ్రీరామమూర్తి, శారదానగర్, అనకాపల్లి, విశాఖ జిల్లా, వెల: రూ. 6-00]

శుద్ధ తాత్త్విక సూత్రగ్రంథం. దీనియందు ఎనిమిది ఉపవ్యాఖ్యానాలున్నాయి.

ఆత్మ, కాలము, లోకము, ప్రకృతి, శక్తితరంగోపాఖ్యానము, విద్య, త్రిపుటి, జీవము - అని అవి ఎనిమిది.

బ్రహ్మ, మూలప్రకృతి, అదితి, ఇంద్రుడు, శక్తి, విద్య - అనే విషయములను అల్పాక్షర పరిమితమైన సూత్రమార్గాన చెప్పడం యీ గ్రంథరూపం.

సూత్రపద్ధతి కడుంగడు క్లిష్టమైనది. దీనిని ఆర్ష సంప్రదాయముగా విజ్ఞులు చెప్తారు. అది సామాన్యజీవులకు సాధ్యము కానిది. 'నాయన' అన్ని విద్యలకూ ఆత్మయైన గణపతి కనుక ఆ పద్ధతి ననుసరించి యీ ఆధ్యాత్మిక సూత్రవిన్యాసం అవలీలగా చెయ్యగలగడం ఆశ్చర్యం కాదు.

మూల ప్రకృతి, ప్రకృతి, మాయ, శక్తి, ఆత్మ - అనే ఆధ్యాత్మిక శబ్దశక్తికి దర్పణం యీ మనీషా సంగ్రహం.

'విశ్వమీమాంస' అనే గ్రంథం కూడా నాయన చెప్పినదే. దానిని అక్కడ ఉదాహరిస్తూ గంభీరార్థకమైన యీ సూత్రమణిమాలను తెలుగు మాటలలో వివరించిన మిత్రుడు శ్రీ నరసింహ శర్మ ఆధ్యాత్మిక తత్త్వం తెలుసుకోవాలనే బుద్ధిమంతులకు ఎంతో ఉపకరించినట్టు భావించి అభినందిస్తున్నాను.

ఇందున్న 'విద్యోపవ్యాఖ్యానం' ఓర్పుగా చదివి అర్థం చేసుకోవాలని నా అభిప్రాయం.

ఈ దివ్య గ్రంథమును ముద్రించి వెలుగునకు తెచ్చిన 'కావ్యకంఠభారతి' వారిని ప్రత్యేకించి అభినందిస్తున్నాను. అక్కడక్కడ ఉన్న అచ్చుతప్పులను సవరించవలసి ఉంది. సూత్రగ్రంథం కదా!

# కనకధారా స్తవము

[మూలం: ఆదిశంకరులు, తెనుగుసేత : శ్రీ వెలుదండ సత్యనారాయణ, ప్రతులకు : (1) రచయిత - కొండనాగుల 509 401. (2) వెలుదండ రామకృష్ణ ప్రసాదరావు, మంగునూరు, మహబూబ్‌నగర్ జిల్లా-509 203. వెల: రెండు రూపాయలు.]

ఒక పేద ముసలమ్మ భిక్షకు వచ్చిన బాలశంకరునకు ఒక ఉసిరిక కాయ ఇవ్వగా తీసుకుని ఆ అవతార పురుషుడు కనికరించి సిరులరాణిని ప్రార్థించగా పసిడి ఉసిరిక ధారగా కురిసింది. అదే

'కనకధారా స్తవం'— ప్రపంచ ప్రసిద్ధం.

ఒకటి రెండు తెనుగుసేతలు నా చేతికి వచ్చాయి. చూశాను. మంచిపని చేశారనుకున్నాను. బూర్గులవారిది చూడలేదు. ఇప్పుడు శ్రీ వెలుదండవారిది చూడడమయింది.

దీనిలో మిత్రులు శ్రీ గోలి వేంకటరామయ్యగారి 'స్వాదువాదము' సాధువాద మనిపించింది.

శ్రీ సత్యనారాయణ పద్యరచన నింపైన శైలితో సొంపుగా ఉంది. పదాల కలయిక ముచ్చటగా ఉంది. వంకర నడక లేక పద్యం హృద్యంగా నడుస్తుంది. మెచ్చవచ్చు.

అక్కడక్కడ నాకు తోచిన సవరణలు :

5వ పద్యంలో 'ఇందిర కైపుమాపు క్షణమేనియు నాపయి నిల్చుగావుపన్' అంటే మూలానుసారంగా ఉంటుంది. 7వ పద్యంలో 'సొంపు' బదులుగా 'పెంపు' అంటే నింపైన అర్థం వస్తుంది. 9వ పద్యంలో 'భంగిమలెల్ల నాపయిని - ప్రసరించుగావుతన్' - అనిన్నీ 'క్షీరవారినిధి బాలిక' అంటే యతి సరిపోతుందనీ నా సవరణ. 15వ పద్యంలో చివరి పాదంలో యతి సవరించాలి. 16వ పద్యంలో రెండవ చరణంలో యతి సవరించాలి.

'సువర్ణధారా స్తోత్రం యత్ శంకరాచార్య నిర్మితం
త్రిసంధ్యం యఃపఠేన్నిత్యం స కుబేర సమో భవేత్'—

అని చివర ఫలశ్రుతిగా ఒక శ్లోకం వినవస్తుంది. దీనిని యీ కృతిలో చేర్చడం మంచిదే అనుకుంటాను. ఇది యీ రచయితకి ఉపలబ్ధం కాలేదేమో!

# అర్చన

[కలముదార్లు : శ్రీ దేవరకొండ సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీమతి రాచకొండ వెంకట సత్య సుబ్బలక్ష్మి, ప్రతులకు : 1) శ్రీ కళాభారతి-బొబ్బిలి, 2) శ్రీమతి దేవరకొండ అన్నపూర్ణ భవాని, కేరాఫ్ శ్రీ డి. యస్. శాస్త్రి, సబ్‌జడ్జి - మచిలీపట్నం-521 001, వెల: రూ. 4/-]

కనిపించని కనిపిస్తున్న లోకం యీ 'అర్చన'లో కనిపిస్తుంది. చెప్పవలసేవి చురుకుగా సురుచిరంగా చెప్పడం మెచ్చుకోదగినది.

'రసీదు గల అమ్మకాలకు ఆడిటు తప్పదు.
రసీదు లేని అమ్మకాలకు ఆడిటు ఒప్పదు'—
ఇపుడు జరుగుతూన్నది ఇదేగా.

'రాజ్యమన రంజింపబడేదని
భోజ్యం కాకూడదని'—

దీని అర్థం వేరే చెప్పనక్కరలేదు. ప్రస్తుతం ఇది భోజ్యమే ఔతూంది కాని ఇలా అనడానికి కొందరు వెనుదీస్తారు.

'ఎలెక్షను అంటే బ్యాలటు కలెక్షను....
నిర్లక్ష్యంగా 'అర్చన' దీనిలో కనిపిస్తూంది.

కట్నం నీ వడుగబోకు
కొనుబడి వస్తువై పోకు
తలయెత్తుకు తిరుగగలుగు
వ్యక్తిత్వానికది మెరుగు - (వెలుగు')

అంటే రంజకంగా ఉంటుందనుకున్నాను.

అటూ ఇటూ ఉన్నవారందరూ చదివి అర్థం చేసుకుని ప్రవర్తించడానికి ఈ 'అర్చన' - ఒక నీతి ముక్తావళి.

యామిజాల పద్మనాభస్వామి

## సందేహాలు సమాధానాలు

[రచన: నిజామీ కుమార, ప్రకాశకులు: తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, లక్కడ్‌కోట్, ఛత్తాబజార్, హైదరాబాద్-500 002, పేజీలు: 207, వెల: రు. 25/—, సైజు: డెమ్మీ]

'గీటురాయి' పత్రికలో వెలువడుతున్న 'సందేహాలు-సమాధానాలు' శీర్షిక పుస్తకరూపం పొందినది. ధార్మిక, సామాజిక, సర్వసాధారణ సంబంధమైన మొత్తం 22 శీర్షికలు చర్చించబడినాయి. దైవం, మతభావన, ఆరాధన, ధర్మానుసరణ, ముస్లిం సమాజం, సైద్ధాంతికం, క్రియాజీవితం మొదలయిన విషయాలపై వివరణ యివ్వబడినది

## హదీసు వెలుగు

[మూలం: మౌలానా జలీల్ అహ్‌సన్ నద్వీ, అనువాదం: ఎస్. ఎమ్ మలిక్, ప్రకాశకులు: తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, లక్కడ్‌కోట్, ఛత్తాబజార్, హైదరాబాద్ - 500 002, పేజీలు: 444, వెల: రు. 30/—, సైజు: క్రౌను]

దైవప్రవక్త ముహమ్మద్ ప్రవచనాలను, ఆచరణలను 'హదీసు' లంటారు. గీటురాయి పత్రికలోని 'హదీసు వెలుగు' పరిష్కరించిన పుస్తకం యిది ఇందులో 11 ఖండములున్నాయి అందు సంకల్పశుద్ధి, విశ్వాసాలు, నమాజ్ ప్రాముఖ్యం, సామూహిక నమాజ్, ఇమామత్, జకాత్, సదకా, ఫిత్రా, ఉష్ర్, రోజా, ఎతెకాఫ్, ఇన్ఫాక్ మొదలయిన విషయముల వివరణ బావుంది.

పై రెండు పుస్తకములలో పరమత సహనం కనిపిస్తుంది. చక్కని తెలుగు నుడికారంలో దొరలిన ఈ పుస్తకములు ముస్లిములే కాక, ముస్లిమేతరులు కూడా చదువతగినవి. విషయ అవగాహన విధానం బావుంది.

మేజర్ షేక్ మౌలాలీ

## సైన్సు సంగతులు

[రచయిత: డా॥ కె. బి. గోపాలం, పుటలు : 111, ప్రచురణకర్తలు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, వెల: రు. 12/- హైదరాబాద్]

డా॥ కె. బి. గోపాలంగారు కేవలం శాస్త్రీయతకే ప్రాధాన్యం ఇవ్వకుండా తమ రచనలకు చక్కని "సుగర్" కోటింగ్ ఇస్తారు. సామాన్య పాఠకుడు, ఈ రచనలు శాస్త్రంలోని సరిగమలు అనుకొని దూరమవకుండా సహజంగా ఆకర్షితమవుతాడు మొత్తం తియ్యగా ఆరగించగల్గుతాడు.

తమ రచనలను చిన్న కథలరీతిలో మలచి పాఠకుని మెదడులోనికి ప్రవేశింపచేసే చాతుర్యం, సామర్థ్యం డా॥ గోపాలం గారికి వెన్నతో వచ్చిన విద్య.

ఈ సైన్సు సంగతుల్లో అర్ధశతకం "గుళికలు"న్నాయి. రెండు పేజీలకు సామాన్యంగా మించని ఈ చిన్ని చిన్ని వ్యాసాల పరంపర, 1986-87లో ఆంధ్రజ్యోతిని ఆదివారం, ఆదివారం అలరించింది.

ఒక మహాకవిగారి పుష్పవిలాపం, ఆకుల్లోని గట్టేషన్ చర్యను వర్ణిస్తుంది. బ్రహ్మంగారు తోకచుక్క వెంబడి ప్రయాణిస్తారు తమ సరస సల్లాపాలతో పెంగ్విన్‌లు, శ్రీకృష్ణుని యమునాతీర రాసక్రీడలను గుర్తుకు తీసికొనివస్తాయి.

మరి వీళ్లూ వాళ్లూ ఇష్టంతో పానంచేసే బీరు కేవలం బూజు అంటే అసహ్యించుకోనయినా ఆ వ్యాసం చదవాలనిపించదా. ఇక అలనాటి అర్జునుడి సమ్మోహనాస్త్రం కేవలం కట్టుకథ కాదు అంటే, దానిని సంధించాలని మనకూ అనిపించదా హరిశ్చంద్ర యంత్రాలు అంటే హవ్వ! అని ఆ వ్యాసానికి హత్తుకొనిపోమా. ఇలా అంతరిక్షం, ఆస్ట్రోనమి, జెనెటిక్స్, క్రికెట్ చరిత్ర, జీవావరణం ఆఖరికి సంసారాలు సంభోగాల విషయాలు కూడా సునాయాసంగా అక్షర తూణీరాల్లాగా వారు వదలితే చదవకుండా మనం వదలిపెడతామా. సైన్సు పుస్తకం అని ఎవరూ "భయపడ" అవసరంలేదు.

జమ్మి కోనేటిరావు

Printed & Published by S. Radhakrishna for Nageswara Rao Estates Ltd., at the Andhra Patrika Press. Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247